# దీపకళిక

"ప్రేమ అనేది ఉజ్వల దీపకళిక లాంటిది లీలా. రెండు చేతులూ అడ్డుపెట్టుకొని రక్షించుకుంటూ వస్తేనే అది నిలుస్తుంది; లేకపోతే ప్రమాదం తప్పదు."

నిలువుటద్దం ముందు నిలబడి తలలో పూలు తురుముకుయిన్న లీల - త్యాగరాజులు అన్నమాటలకి వెనక్కి తిరిగి చూసి నవ్వి;

"ఈ పుస్తకాల్లో కబుర్లుమానేసి నేనెలా ఉన్నా చెప్పండి!" అన్నది.

"నువ్వెలా ఉన్నా అందంగానే ఉంటావు"

"అలా అని పెళ్ళాన్ని మాయలో పడేస్తే చీరెలూ నగలూ ఏమీ కొనక్కరలేదు. అవునా ?"

"అందకత్తెకి ఆభరణాలు అందం చెడగొడతాయి"

సిగరెట్ ముట్టించాడు త్యాగరాజులు - లీల అంతటితో వదలలేదు.

"నాలో ఏదయినా కొత్తదనం కనిపిస్తున్నదా ! ఈ హెయిర్ స్టయిల్ ని -పోనీటెయిల్ అంటారు" అన్నది.

"అంటే గుర్రపు తోక - బాగుంది."

"మరి ఈ జాకెట్ ఎలా ఉంది! నాకు అందా వచ్చిందా!"

"వేరే అడగాలా ఆ సంగతి — నీవు ఎలా ఉన్నా నా కంటికి అప్సరసవే"

"మీతో వచ్చిన చావే ఇది - మీరు నన్నుగురించి ఏ విషయంలో సరి అయిన అభిప్రాయం చెప్పారు గనక ! ఎప్పుడూ ఒకటే మాట — నీవు నా కంటికి అప్సరసవే"

"బాగుంది. అదీతప్పేనా ? ఎవడి పెళ్ళాం వాడికి అప్సరసగా కనిపించిన రోజున లోకం స్వర్గమే అవుతుంది"

"మీ సంగతి తెలియని వాళ్ళ దగ్గర కోతలు కొయ్యండి - నామీద మీకు శ్రద్ధలేదనేది మాత్రం నిగ్నం - నేను చింకిపాతలతోనూ, చింపిరి తలతోనూ ఉన్నా అప్సరసనే అని అనుకోవటానికి అంత తెలివితక్కువదాన్నేమీ కాదు."

"నా భార్యవు నువ్వు — నన్ను నమ్మకపోతే ఏం చెయ్యను ? ఇదుగో లీలా, గుండెమీద చెయ్యివేసుకొని చెబుతున్నాను - నీవు నిజంగా చింకిపాతలతోటీ, చింపిరితలతోటీ ఉన్నా అందంగా ఉంటావు. మొహానికి పౌడరుమెత్తి బొట్టుబొమ్మలా తయారవడం నాకు నచ్చదు ... స్త్రీ తన స్త్రీత్వాన్ని మర్చిపోకూడదు"

"మీ సంగతి ఎవరికి తెలియదు !... అవన్నీ కొక్కురపేదు లెండి ... అనవసరంగా వాటి నెందుకు విమ స్తారు ?"

"లీలా!"

"ఏం, అలా అరుస్తారు ! నేను చెప్పింది నిజం అవు

కాదో ఆత్మపరీక్ష చేసుకోండి" లీల దూకుడుగా ఇచ్చిన జవాబుకి త్యాగరాజులు నిట్టూర్చి;

"నీవు నన్ను అర్థంచేసుకోలేదు – ఇకముందు చేసుకోలేవేమో కూడా" అన్నాడు.

"మరి మంగళం పాడారుగా, ఇక లేవండి- మొగం ముడుచుకుని కూర్చోకండి."

"నువ్వు కొన్ని సమయాల్లో చిత్రంగా మాట్లాడతావు లీలా! ఏం మాట్లాడుతున్నావో నీకే అర్థంకాదు. నీ ఉద్దేశ్యం- నిన్ను నేను ప్రేమించటం లేదని – అబద్ధం చెప్తున్నాననీ కాదూ ?"

"ఇక ఆ సంగతి మర్చిపోండిబాబూ – నాచేత ప్రబ్రమాలించుకోవాలని ఉంటే చెప్పండి ... కొంచెం ఇలా వచ్చి ఈ రిబ్బను ముడివెయ్యండి" అన్నది లీల ... త్యాగరాజులు సిగరెట్ యాష్ట్రేలో పడేసి లీల చెప్పిన పనిచేసి;

"ఇలాగే రిబ్బను ముడేస్తూ బ్రతుకంతా గడిపేస్తాను గలను లీలా ... అయిందా ? ఇంకా ఏమైనా సేవ చెయ్యాలా ?" అన్నాడు.

"మీ అపారమైన సేవకి అనంతమైన నా కృతజ్ఞతలు"

"అటుచూడు లీలా, ఆ అద్దంలో ... నీ వెనక నేను లబడితే బ్రహ్మాండమైన మొక్క గులాబీమొక్క పక్కన లబడి నట్లుంది" అన్నాడు త్యాగరాజులు.

ఆ మాటకి లీల పొంగిపోయింది. అతని చెయ్యి తీసి చెంపకి ఆనించుకొని;

దీపకళిక 6

"ఆ బ్రహ్మదొండ మొక్కే ఈగులాబీ సుందరి సర్వస్వం. అంతేకాదు అభేద్యమైన ప్రాకారం" అన్నది.

"ఏం లాభం! ఆగులాబీరాజకుమారికి ఈ బ్రహ్మదొండ రాక్షసుడంటే చాలా అసహ్యం – అవునా ?"

"ఇక చాలించి త్వరగా పోయి బట్టలు వేసుకోండి- పాపాయికి కూడా. ఇంకా బజారుకి వెళ్ళాల్సిన పనుంది మధ్యలో" అని భర్తను గద్దించింది లీల. అతను కిక్కురు మనకుండా ఆమె చెప్పినట్లు చేశాడు.

కొన్ని విచిత్రమైన పరిస్థితులలో తండ్రిమాట ఎదిరించి త్యాగరాజుని పెళ్ళి చేసుకుంది లీల. ధనిక కుటుంబంలో పుట్టి ఇంగ్లీషువారి ఆచారాల మధ్య పెరుగుతూ ఉన్న లీల, మధ్య తరగతి కుటుంబంలో పుట్టి జంధ్యం తీసెయ్యని త్యాగరాజుల్ని పెళ్ళిచేసుకోటం అనేది ప్రేమచేసే చిత్రాల్లో ఒకటి – అని నిస్సంశయంగా చెప్పవచ్చును. ఆ తరువాత లీల తండ్రికూడా మాట్లాడకుండా ఊరుకొన్నారు — క్షీణ వ్యాధితో బాధపడుతున్న ఆ రిటైర్డ్ ఉద్యోగికి ప్రస్తుతం పట్టుకున్న ప్రధాన సమస్య తన వ్యాధి – అల్లుడు ఇన్‌కంటాక్స్ ఆఫీసరుగా ఉద్యోగం చేస్తూ నాలుగురాళ్ళు వెనకేసుకోలేని, అసమర్ధుడని, పైకి కూతురు దగ్గర అంటున్నప్పటికీ- అంతరాంతరాల్లో అల్లుడి నిజాయితీ అంటే ఆయని భయం.

త్యాగరాజులు పరిస్థితి వేరు... మేనమామ కూతురు కాదని, లీలని పెళ్ళిచేసుకోవటం తల్లికీ చెల్లెలికీ ఇష్టం పోయినా అతని పోషణలో ఉన్నవాళ్ళు కనుక కిక్కురు

కుండా ఊరుకున్నారు. పెళ్ళిఅయిన ఈ రెండేళ్ళనుంచీ ఒడు దుడుకులు ఆట్టేలేవు - చిన్న చిన్నవి తప్ప.

అంతర్యం చిత్రమైనది. పెద్దయింట్లో నౌకర్లూ చాకర్ల మధ్య పెరిగివచ్చిన లీలకి మొదట మొదట్లో ప్రేమనిషావలన సుఖంగానే అనిపించినప్పటికీ- క్రమంగా కాలం గడిచినకొద్దీ ఈ మధ్య తరగతికొంపలో ఉన్న అసౌకర్యాలన్నీ ఒకటొకటీ బోధపడటం ప్రారంభించినయ్—అన్నిటికన్న ముఖ్యంగా అత్తగారి మడి ఆమెకి అసహ్యం. రెండో న్యూసెన్స్ తద్దినాలు. ఆఫీసునించివచ్చి తడిబట్ట కట్టుకుని తనభర్త తద్దినం పెట్టటం చూస్తుంటే తేళ్ళూ జెర్రులూ పాకేవి ఆమెమీద. ప్రాచీనావీతి అంటూ ఆ జంధ్యం ఇటూ అటూ మార్చ పొగ - గారెలవాసన - వంటయింట్లో చిత చిత్ర... చూస్తుంటే మధ్యతరగతికి బ్రాహ్మణకొంప ఎంతనర... ఆమెకు అవగాహన అయి ఒకటి రెండు తడవలు పొరపా చేశానా, అనికూడా అనుకుంది. కాని మరుక్షణంలోనే త్యా... రాజులు శాంతగంభీరాకృతి చూసి అన్నీమరిచిపోయేది లీల.

ఆంగ్లం చదువుకుని గెజిటెడ్ ఆఫీసరయిన తనభర్త సంధ్య వార్చటం, జంధ్యం మార్చటం చూసి ఆమె ఆశ్చర్య పొయేది—పట్టుబట్ట కట్టుకుని భోజనం చేయటం మొదట్లో చిత్రం అనిపించినప్పటికీ ఇప్పుడు అలవాటయింది. పరిస్థితులు ఇలావుండగా పాపపుట్టటం, విజయవాడ బదిలీకావటం తప్పని సరిగా వేరింటి కాపురం పెట్టాల్సిరావటం జరిగింది—భర్త ఆఫీసుకి వెళ్ళిన తరువాత, మిగిలిన ఒంటరితనంలో ఆమెకు తిరిగీ తన కిశోరీ జీవితం జ్ఞాపకం రావటం ప్రారంభిం

చింది... కారూ, ఫాన్లూ, ఫోనూ, అందమైన తోటా ఇల్లూ మొదలయిన వాటితో నేటి తన నలభయి రూపాయల వాటా పోల్చుకొని నరకంఅంటే వేరే లేదని ఆమె బాధపడటం తిరిగి ప్రారంభమయింది. వచ్చేజీతం నాలుగువందలలోనూ రెండు వందల రూపాయలు చెల్లెలి పెళ్ళికోసం బాంక్‌లో వేస్తాడు త్యాగరాజులు.

మిగతా రెండువందల్లో పాతికరూపాయలు తను అట్టి పెట్టుకుని మిగతాది లీలకిస్తాడు. దానితోతిండి సుఖంగానే గడిచిపోతున్నది, గాని మిగతా కోరికలు కోరటం కష్టంగా ఉంది...అయినా ఇప్పుడిప్పుడు కోరికలు కోరకపోవడానికే అలవాటుపడింది లీల- అందుకని బాధా లేదు.

లీల అందమైనది...అందంకన్న సౌకుమార్యంఎక్కువ. ధనవంతుల ఇంట్లో పెరగటం ఒక విధంగా కారణం అవచ్చు. ఇప్పుడు ఇంటి పనులు చేసుకోవటం వలన సౌకుమార్యం తగ్గి ఆరోగ్యం పెరిగింది.... అది అనాకారితనం అని ఆమె అభిప్రాయం. దానికి కారణం త్యాగరాజులు వంటిల్లు అని ఆమె అంటూఉంటుంది. సరిగ్గాఇదే పరిస్థితుల్లో ఒక ఆదివారంరోజున త్యాగరాజులు, లీలాషాపింగ్ కి బయలు దేరారు — వాళ్ళు ఉన్న ఇంటినుంచి బజారుకి ఒక అడ్డదారి ఉంది - ఆ సందు చాలా అసహ్యంగా ఉంటుంది... అయినా సరే దగ్గరకు రావటం వలన అదే దారి తీశాడు త్యాగరాజులు, లీలకి ఇదంతా చూస్తూంటే ఒళ్ళు మండి పోతున్నది. తనకి ఏది అయిష్టమయితే అదే చేస్తాడు ఈయన-

విసుగ్గా మొహంపెట్టి పాపని ఆ చేతినుంచి ఈ చేతికిమార్చు కుంటూ,

"అబ్బ ఎండమండి పోతున్నది బాబూ, ఒక జట్కా పిలవండి" అన్నది. త్యాగరాజులు భార్య పడుతున్న విసుగు బొత్తిగా గమనించకుండా;

"శుద్ధ అనవసరం. నాలుగు గజాలు నడిపి రూపాయి అడుగుతాడు. ఇదిగో ఈ సందుమలుపు తిరిగితే బజారుకిరానే వచ్చాం. ఎందుకు వేస్టు." అన్నాడు లీలకి విపరీతమైన కోపం వచ్చింది. తద్వారా కర్కశంగా మారిన కంఠంతో;

"అవును లేండి. యీసందుల్లో మురికి మీకేం అంటదు, కనిపించదు" అన్నది త్యాగరాజులు ఆ కంఠానికి తె[illegible] ఉలిక్కిపడినా విషయాన్ని పరిహాసం కిందమార్చాలని ప్రయత్నం చేస్తూ "ఇప్పుడీ సందులన్నీ ప్రతిరోజూ శు[illegible] చేస్తున్నారు. పందుల్ని కూడా పట్టుకుంటున్నారు" అన్నా[illegible] లీల అందులో ఉన్న పరిహాసాన్ని బొత్తిగా గ్రహించకు[illegible] మరింత విసుక్కుంటూ-

"అంతేలెండి. మీ కంటికి ప్రతి మురికిసందూ శుభ్రం గానే [illegible]ంటుంది — ఈ దరిద్రపు వాసనలో ఒక్కక్షణం [illegible]" అన్నది.

'నువ్వొక్కడ ! నీవు బంగళాల్లో పుట్టావు- పెరి[illegible]. ఏం చేస్తాం ? ఇప్పుడీ మామూలు ఇన్‌కంటాక్స[illegible]ంటగట్టబడ్డావు" అన్నాడు త్యాగరాజులు, సాధ్య[illegible]త సానుభూతి కంఠంలో ధ్వనింపచేస్తూ.

ఆ మాటతో లీల కొంచెం శాంతించి "ఇన్‌కంటాక్స్
వాడినని మిమ్మల్ని మీరే తేలిక పర్చుకోనవసరంలేదు. ఇన్
కంటాక్స్‌వాడు తక్కువేంకాదు" అన్నది.

"ఇతర్ల సంగతి ఏమోకాని, నేను మాత్రం బొత్తిగా
అసమర్ధుడిని. ఇతర మార్గాల్లో సంపాదించటం ఏమాత్రం
చేతకావటంలేదు. వాళ్ళ దుకాణం నాకూ నా దుకాణం
వాళ్ళకీ బొత్తిగా బోధపడటం లేదు." అని నవ్వాడు
త్యాగరాజులు.

"అది మీ తెలివితక్కువ. దానికి ఇతర్లనని ప్రయో
జనం ఏమిటి? అలా కానప్పుడు ఇన్‌కంటాక్స్‌వాడినని అను
కోవటం మాత్రం దేనికి?"

"నేను అలా అనుకోవటంలేదు - నీ ఉద్దేశాన్ని,
భావాల్ని ఊరికే నెమరవేస్తున్నాను.... అయినా ఈ మురికి
కుండుల్ని నేనేం ప్రేమించి అఘోరించటంలేదు, నాలుగు
డబ్బులు ఆదా అవుతాయని గాని"

"ఆదా, నా మొహం. ఇలాటి సందులోంచి ఏమయినా
సరే నేను నడవలేను బాబూ, వెధవసందు - చాంతాడల్లే
తెగటంలేదు" అని విసుక్కుంది లీల.

"చూడు లీలా, అలా విసుక్కుని ప్రయో[illegible]
కష్టానిబట్టి చొక్కా కుట్టించుకోవాలి" అని అన[illegible]
త్యాగరాజులు. లీల విషయంమార్చి-

"ఏమయినా సరే, పాపాయికి అరుగ్లాస్[illegible]
చాలి" అన్నది.

"అరే ?... ఎందుకూ ? దానికి చొక్కాలున్నాయిగా! ఏం ? లేవావమిటి ?" అన్నాడు త్యాగరాజులు మరింత ఆశ్చర్య పడుతూ.

"మీ దృష్టిలో దానికీ నాకూ అన్నీ ఉన్నట్లే కనిపిస్తూ వుంటుంది... బిడ్డ చిరుగుల చొక్కాల్తో ఉన్నాసరే—పెళ్ళాం మాసినచీరతో ఏడుస్తున్నా సరే వాళ్ళిద్దరూ సర్వ సౌఖ్యాలూ అనుభవిస్తున్నట్లే ఉంటుంది"

"సరే అలాగేకానీ, నీవు చెపితే వింటావుకనుకనా ! చూడు—బజారు దగ్గిరికి వచ్చేస్తున్నాం. నీ మొహాన్ని కాస్త మామూలుగా పెట్టు. ప్రజలుచూసి నన్ను పరమ దుర్మార్గుడనుకోగలరు ...పాపం ఆ ఇల్లాలు ఆ రాక్షసి మొగుడితో కాపురం చేస్తూ బోలెడు బాధలు పడిపోతున్నది కాబోలు-అనుకుని నావంక ఉరిమిచూస్తారు"

పరిహాసాన్ని అర్థంచేసుకోలేదు లీల.

"ప్రజలు ఒక్క మొగాన్నే చూస్తారా ఏమిటి ? ఈ చింకిపాతల్నికూడా చూస్తారు. అయినా ప్రజలేమనుకున్నా గాని మీకు లెక్కలేదుగా!"

త్యాగరాజులు ఒక్కనిట్టూర్పు విడిచి "సరేలే కాస్త చల్లబడు—బజారు దగ్గరికి వచ్చాం" అన్నాడు.

లీల సమాధానం చెప్పకుండా నడవటం ప్రారంభించింది—ఈ బ్రతుకుమీద నిజంగానే ఆమెకు విసుగుకలిగింది. కోరిచేసుకున్న సుకుమారికోసం అర్ధరూపాయి డ... ఖర్చుపెట్టలేడు ఇతను. ...తన విలువ తన సుఖం

రూపాయి ఖరీదు చెయ్యలేదు—లీలకి కళ్ళనీళ్ళు తిరుగుతున్నయ్-ఒకతడవ తను లలితతో సినిమాకి వెళ్ళి దగ్గరే కదా-అని ఇంటికి నడిచివచ్చినప్పుడు కేకలేసిననాన్న ఇప్పుడు గుర్తుకి వచ్చాడు ఆమెకి.

ప్రపంచంలో ప్రేమా-గీమా అంతా అబద్ధం. నువ్వు చెప్పినట్లు డబ్బే ముఖ్యం నాన్నా! ఈ విషయంలో నేను పొరపాటు చేశాను-అనుకుంది ఆమె. మరి ప్రేమకీ త్యాగానికీ అర్థం ఏమిటి? అర్ధరూపాయి డబ్బులుకూడా వాటివిలువ లేకపోతే వాటిని గురించి అనవసరమైన ఈ తాపత్రయం మిమ్మల్నిపట్టి ఎందుకు పీడిస్తున్నట్లు? ఈ ప్రశ్నల పరంపర నీరుగామారి కంటికి అడ్డుపడటంతో తడబడి రోడ్డుమధ్యకి నడిచింది లీల... వెంటనే కారుకి సడన్‌బ్రేక్ పడినధ్వనితో పాటు "ఏయ్, నీకేమయినా కళ్ళుపోయినయ్యేమిటి? రోడ్డు పక్కన నడవాలని తెలియదూ?...ఓ నువ్వా...లీలా..." అనేమాటలూ ఒక అందగత్తె కారులోంచి దిగి లీలని కావిలించుకోవటమూ ట్రాఫిక్ ఆగిపోవటంవలన లీలని కారులోకి లాగి తలుపువేసి కారు స్టార్టుచేయటం...పదిగజాలు నడిచి ఆగిపోవటం లీల చెయ్యి వూపటం, నిస్సహాయంగా నిలబడిన త్యాగరాజులు గతిలేక అందులో కూలబడటం ఒక అయిదారు నిమిషాల్లో జరిగిపోయింది.

"లలితా" అన్నదిలీల ఆశ్చర్యాన్నుంచి తేరుకుంటూ.

రెండో చెయ్యి స్టీరింగుమీదనుంచితీసి లీల భుజంమీద వేసి;

"మై డియర్ లీలా!" అంది లలిత.

తా నువ్వెలా వచ్చావు?"

"ముందీసంగతి చెప్పు. నేను కలగనటం లేదుగదా... నువ్విక్కడ ఉన్నావేమిటి? కొంపతీసి ఈ సందులోగాని ఉంటున్నారా ఏమిటి?"

"లేదులే .. ఇంకా ఆ స్థితికి రాలేదు" అని నీరసంగా జవాబిచ్చింది లీల. లలిత ఆ మాట వినిపించుకోకుండానే "వీరు మా బావగారనుకుంటాను అవునా?" అన్నది-అంత వరకూ దిగాలుపడి కూర్చున్న త్యాగరాజులు ఆ మాటతో ఈ లోకంలో పడి "అవునండీ" అని తన అస్తిత్వాన్ని ఋజువుచేసుకున్నాడు. లలిత ఆ మాటా వినిపించుకోలేదు.

"మనం కలుసుకున్నందుకు చాలా సంతోషంగా వుంది లీలా" అన్నది.

"మీరిప్పుడు ఇక్కడే ఉన్నారా? మీ ఆయనేమన్నా ఇక్కడికి బదిలీ అయ్యారా ఏమిటి?" అని పుంజుకున్న ఉత్సాహంతో ప్రశ్నించింది లీల.

"భలే! నీవు దాన్ని బదిలీఅంటే నాకేం అభ్యంతరం లేదుగాని, మా ఆయనికి ఇక్కడ ఒకటి రెండు ఫ్యాక్టరీలున్నాయి. మరి మీరెప్పుడొచ్చారు?"

"ఆరునెలలు దాటింది"

"మేమూ అమెరికా అదీ తిరిగి సంవత్సరం క్రితం ఇండియాకి వచ్చాం. రాగానే..."

"పెళ్ళి ఎప్పుడయింది మరి?"

"అంతకుముందే"

ఈ సంభాషణ ఆగేటట్లు లేదని గ్రహించిన త్యాగరాజులు సకిలించాడు. అవివిన్న లీలకి తమకు బయలుదేరినపని జ్ఞాపకం వచ్చింది.

"ఇక్కడ ఆపు లలితా, మేం కొంచెం బజారు వెళ్లాల్సిన పని ఉంది. ఎడ్రసు చెపితే రేపు మీ యింటికి వస్తాను" అన్నది.

"అదేం కుదియాదమ్మాయ్ బజారు పనిఏమిటో చెప్పు" అని తర్జని ఆడించింది లలిత.

"ఏంలేదు, పాపాయికి బట్టలుకొనాలనుకుంటున్నాం"

"ఎక్కడ ? ఈ పాత గుడ్డల పెట్టెదుకాణాల్లోనా ? నాతోరా, మా షాపువాడికి ఫోనుచేసి నీకు కావల్సిన గుడ్డలు తెప్పిస్తాను" అన్నది లలిత.

"సరిపోయింది" అనుకున్నాడు త్యాగరాజులు. లలిత అన్నమాటలకు లీల గాభరాపడి;

"మేము సినిమాకి కూడా వెళ్ళాలను కుంటున్నాం" అన్నది.

"ఏ సినిమాకి ?"

"దుర్గాలో కొత్త సినిమాకి ... ఆరు గంటలకి వెళదామని"

"ఇవాళ నేను లేచిన వేళ మంచిది లీలా! మేంకూడా అదే సినిమాకి పోవాలనుకున్నాం. టిక్కెట్లుకూడా తెప్పించాలి. మరి మీరు టిక్కెట్లు తీసుకున్నారా ?" అంది లలిత. తీసుకోలేదంటే మొదటి తరగతి టిక్కెట్లు ఎక్కడ కొదను

కుంటుందో అని "తీసుకున్నాం" అని అబద్ధం చెప్పేసింది లీల.

"మరి అలాంటప్పుడు బెంగ దేనికి ఇంటికిపోయి మొగం కడుక్కు వెడదాం. మా ఇల్లు చూద్దువుగాని" అని స్పీడ్ హెచ్చించింది లలిత.

ఉపద్రవంగా పైకి రాబోతున్న నిట్టూర్పుని బలవంతాన అణుచుకున్నాడు త్యాగరాజులు. అతని స్థితి చాలా శోచనీయంగా ఉంది. వాళ్ళిద్దరూ తనని గుర్తు పట్టటం మానేసి అప్పుడే అరగంట దాటింది — ఈ అరగంటనుంచి ఖరీదుగల ఆ కారు కుషన్సు ముళ్ళ కంచెల్లా ఉన్నాయి అతనికి. ఇన్‌కంటాక్స్ ఆఫీసరు. ఈ బాపతు ధనికవర్గానికి తను శత్రువర్గంలో వాడు. వీళ్ళలో అతి పరిచయం మొగమాటం కిందతేలి తన విధి నిర్వహణలో అడ్డురావటానికి చాలా అవకాశం ఉంది - ప్రభుత్వాన్ని, ప్రజల్నికూడా మోసగిస్తారు వీళ్ళు...

అతనికి ఆలోచనలు పూర్తికాకుండానే కారు ఒక మేడ ముందు ఆగింది. బందరురోడ్డు మీద ఉన్న ఆ మేడ చాలా అధునాతనంగా కనిపిస్తున్నది. బాల్కనీమీద పాకిన రాధామాధవం పూలతీగ ఆ మేడ అందాన్ని ద్విగుణీకృతం చేస్తున్నదని చెప్పవచ్చును. కారు ఆగగానే గూర్ఖా వచ్చి గేటు బార్లగా తీశాడు. గేరుమార్చి కారు లోపలికి పోనిచ్చింది లలిత.

అరుస్తూ ఎదురువచ్చిన కుక్కపిల్లని ఎత్తుకొని "పాపాయిని ఆయా తీసుకొస్తుందిలే నువ్వు దిగు" అన్నది ఆమె.

ఒక క్షణంకూడా చంకదిగని పాపాయిని ఆయాఅందు కోగానే ఎంతో హాయిగా రెక్కలు వచ్చినట్లు అనిపించింది లీలకి. ఆయా పాపాయిని ముద్దుచేస్తూ లోపలికితీసుకువెళ్ళింది.

నిశ్శబ్దంగా ఆ ఇంటి సౌభాగ్యాన్ని పరిశీలించటం ప్రారంభించింది లీల ... తనుకూడా ఇలాంటి వైభవంలోనే పుట్టి పెరిగింది ... అతి పరిచయంవల్ల వాటి విలువ తనకి తెలియకుండా పోయింది ... అందుకే త్యాగరాజుల్ని పెళ్ళి చేసుకుంది కూడా ... ఇప్పుడు తెలుస్తోంది మళ్ళీ వాటి విలువ.

హాలులోకి అడుగుపెట్టగానే అదిరిపోయినాడు త్యాగ రాజులు. ఎంతో కొంత భాగ్యవంతులయి ఉంటారుగాని ఇంత భాగ్యవంతులనుకోలేదు అతను. వీళ్ళని ఒక కంట కని పెట్టటం చాలా అవసరం అనుకొన్నాడు అతను.

ఆ హాలులో ఉన్న ఫర్నిచరే దాదాపు పదివేల రూపాయలు ఉంటుంది - తెరలూ తివాచీలూ ఇక చెప్పనే అక్కరలేదు. ఒక్కొక్కటీ వెయ్యి రూపాయిలయినా చేస్తాయి.

"లీలా, మనం డ్రాయింగ్ రూములో కూర్చుందాం-పద" అంది లలిత ప్రాణాలు బిగపట్టుకుని వాళ్ళని అనుస రించాడు త్యాగరాజులు —

ఆ డ్రాయింగురూములో ఉన్న ఖరీదుగల సోఫాల్లో ఒకదాంట్లో అందమయిన ఒకాయన పైపు కాలుస్తూ విను వీధి సంచారం చేస్తున్నాడు.

"హల్లో" అంది లలిత - ఆయన తాపీగా కళ్ళువిప్పి లలిత వంక చూసి "హల్లో" అన్నాడు.

"చూశారా నేను చెప్తూ ఉంటానే లీల ... ఇదిగో ఈమె" అన్నది లలిత. అతను లీల వంక బద్ధకంగా చూసి "మిమ్మల్ని కలవటం చాలా సంతోషం. అస్తమానం లలిత చెబుతూ ఉంటుంది" అన్నాడు - లలిత త్యాగరాజుల్ని ఉద్దేశించి వీరు లీల భర్త .. పేరు..." అని తడుముకుంది- లీల నవ్వుతూ ఆ మాట అందుకుని "త్యాగరాజులు" అంది.

"మిమ్మల్ని కలుసుకోవటం చాలా సంతోషం. నా పేరు గోపాలస్వామి...స్వామి అంటారు" అన్నాడాయన.

"స్వామీ, ఈ రోజు నాకెంత సంతోషంగా ఉందను కున్నారు! నేను ఎన్నాళ్ళనుంచో లీలని కలుసుకోవాలని బెంగపడి పోతున్నాను. ఇవ్వాళ అకస్మాత్తుగా బజార్లో కని పించింది...లీలా నేను చెపితే నమ్మవుగాని నిన్ను తలుచుకోని క్షణం లేదంటే నమ్ము. నీ నవ్వుమొగం ఎప్పుడూ నా కళ్ళ ఎదుటే కనిపిస్తూ ఉంటుంది" అని తన సంతోషాన్ని వ్యక్త పరిచింది లలిత.

"నేను చెబితే నువ్వూ నమ్మవుగాని నువ్వు కనిపించే ముందుకూడా జ్ఞాపకం వచ్చావు నాకు" అన్నది లీల.

"అసలు సంగతేమిటి లీలా — చూస్తే చాలా విచా రంగా ఉన్నట్లు కనిపిస్తున్నావు...ఇదివరకులా నవ్వటంలేదు- ఆ వెనకటి వెన్నెల నవ్వులూ అల్లరిమాటలూ అన్నీ ఏమయి పోయినాయి ? చెంపల్లో కాంతి లేదు—కళ్ళల్లో తళుకు లేదు.

ఆ అందమంతా ఎక్కడికి పోయింది? నీకు జ్ఞాపకం ఉందా? నే నెప్పుడూ ఇలాగే ఉంటాను- అంటూ ఉండేదానివి... అయితే వంటిల్లు నిన్నుకూడా బంధించిందన్నమాట...సరేలే ఇదుగో కాఫీ తాగు ... ఈ కాఫీ బావగారికియ్యి" అంది లలిత.

త్యాగరాజులుకి లలిత మాటలు వింటుంటే నిజంగానే లలితమీద జాలివేసింది. ఏమనటానికి తోచక కాఫీ అందుకొని తేంక్స చెప్పాడు.

"ఏడు సంవత్సరాల కింద విడిపోయిన మమ్మల్నిద్దరినీ మీరు ఒకచోట చేర్చినందుకు చాలా సంతోషంగా ఉంది బావగారూ—స్వామీ ఇక లేచి డ్రెస్ చేసుకోండి—ఇప్పటి నుంచీ మొదలు పెడితేగాని తెమలరు మీరు" అన్నది లలిత.

"ఓ. కే. డార్లింగ్" అని ఒళ్ళు విరుచుకుంటూ లేచి పోయినాడుగోపాలస్వామి—అతను ఇంట్లోంచి కదలకుండానే కేవలం ఫోన్లమీద వ్యాపారాన్ని నడుపుతాడు. అతని తెలివి తేటల్ని గ్రహించలేని చాలామంది అతన్ని బద్ధకస్తుడను కుంటారు. లలితకూడా అలాగే అనుకుంటుంది—స్వామి గదిలోంచి వెళ్ళగానే లీలని ఉద్దేశించి నవ్వుతూ "స్వామికి ఎంత బద్ధకమో చెప్పలేను లీలా! ప్రతిరోజూ ప్రొద్దుతిరిగి పోతున్నాగాని సోఫాలోనుంచి లేవరు—పైగా నేను కనుక ఏమయినా అంటే - కాలం ప్రపంచాన్ని ఆడిస్తుంటే...ఆ కాలాన్నే నేను ఆడిస్తున్నాను అంటారు. బొత్తిగా కాలం విలువ తెలియదు" అన్నది.

"అయినా ఆయనకి త్వరగా లేవాల్సిన పనిఏముంది? డబ్బు దగ్గరఉంటే పనిమారం అవుతుంది - మా ఆయనబోటి వారయితే త్వరగా లేవాలే-ఆఫీసుకి టైముకి వెళ్ళాలే - అనే తాపత్రయం ఉంటుంది... అదీగాక ఆయనలేచి పాలు తీసుకు రావాలి...."

"అదేమిటి - డెయిరీ నుంచి పాలవాడు పాలుతీసుకొచ్చి పొయ్యడా? మేం డెయిరీనుంచే తెప్పిస్తాం- గుమ్మంలోకి వచ్చి పోసిపోతాడు"

"డెయిరీపాలు మరీ ప్రియం కదూ" అంది లీల సగం సిగ్గుతో తలవంచుకుని.

"పెద్ద ప్రియం కాదని నా ఉద్దేశ్యం"

ఈ ఆఖరి మాటకు త్యాగరాజుకి ఒళ్ళుమండిపోయింది.

"బహుశః మీకు ప్రియంగా కనిపించకపోవచ్చును" అన్నాడు ... ఆ మాటకి లీల మరింత సిగ్గుపడి,

"మా ఆయన సంగతి నీకు తెలియదు లలితా -చిల్లర డబ్బులిన్ని లెక్కచూసి చెక్కిన్ని గిరాటేస్తారు - అవసరం అయిన విషయాలకి ఖర్చుచెయ్యటం మానేసి అనవసరమైన విషయాలకి కుడీ ఎడమా చూడకుండా డబ్బు తగలేస్తారు. ప్రతి చిన్న విషయానికీ పట్టుదల జాస్తి" అంది లీల డబ్బు ఖర్చుపెట్టటం పెద్ద క్వాలిఫికేషనుగా ధ్వనింపచేస్తూ.

"పట్టుదల, దుబారా మొగాళ్ళ లక్షణం లీలా! స్వామి కూడా అంతే. అయినా నేను చాలా జాగ్రత్తగా ఉంటాను సుమా! మా చప్రాసీ పళ్ళు తీసుకురావటానికి బజారు వెడితే

వాడెక్కడ దగాలో పడతాడో- అని కారుమీద వెనకాలే పడతాను ... మర్చిపోయాను, నువ్వేదో బట్టలు కొంటానన్నావుగా” అన్నది లలిత, షాపువాడికి ఫోను చేయాలని లేస్తూ.

“వద్దు, ఇప్పుడంతతొందరేంలేదు, వచ్చి ఇలాకూర్చో నువ్వు. ఎన్నాళ్ళకో కలుసుకున్నాం, ఇప్పుడు శ్రమదేనికి!”

“ఫోను చెయ్యటం కూడా పెద్ద శ్రమేనంటావా ఏమిటి? అంతగా అలసిపోతే ఉపచారం చెయ్యటానికి నువ్వు ఉన్నావుగా” అని నవ్వుతూ వెళ్ళిపోయింది లలిత.

లీల నిస్సహాయంగా భర్తవంక చూస్తూ “చూడండి, డబ్బులెంత తెచ్చారు?” అన్నది.

“ఇరవయి రూపాయలు”

“ఇంట్లో ఇంకా డబ్బు తగలడ్డదిగా!”

“ఉంటే! ఇంతకంటె ఎక్కువ అనవసరం... ఏం అవసరమా?”

“అంత కాపీనం పనికిరాదుమీకు. ఆ కాస్త తెస్తే ప్రపంచం మునిగిపోతుందా? ఇప్పుడు నేనేం చేయాలి?”

“ఆ సంగతి టెలిఫోన్ చెయ్యటానికి ముందే నువ్వు ఆలోచించాల్సింది.”

“చూస్తూనే ఉన్నారుగా - నేను దాన్ని ఆపుదామనే అనుకున్నాను. కాని.......”

“కాని ఆపలేకపోయావు - మన ఆదాయం రెండు వందలయాభై మాత్రమేననీ-ఇతరమార్గాలద్వారా అంటే-

లంచాలూ ఇత్యాదులవల్ల పైరాబడి ఎంతమాత్రం లేదని చెప్పటానికి మొగమాట పడ్డావు - అవునా ?"

"నా ఖర్మ .... మీకు నాలుగు వందలుజీతం అని అందరికీ తెలుసు.... పెళ్ళికాకపూర్వాం ఉన్నట్లే నాపర్సులో వందల కొలదీ డబ్బు ఉందని అది అనుకుంటోంది."

"అందుకే ఎప్పుడో చెప్పాను-నీకు తగనివాడిని చూసి కట్టుకున్నావని"

భార్యా భర్తల ఈ వాగ్వివాదం తెమలక పూర్వమే లలితవచ్చి "బట్టలు తీసుకుని త్వరగా వచ్చేయమని ఫోను చేశాను ! లీలా ఈపాటికి సగం దూరంలో ఉంటాడు. ఆ చేత్తోనే మరోఇద్దరు స్నేహితుల్ని రమ్మనిపిలిచేశాను. వాళ్లు అద్భుతమైన వాళ్ళు. నీకు బలే సరదాగా ఉంటుంది. అన్నట్లు వాళ్ళుకూడా మనతో సినిమాకి వస్తారు" అని గబ గబా చెప్పేసింది. లీల ఉత్సాహాన్ని అణుచుకుని; "క్షమించు లలితా - ఇంటికెళ్ళాలి. మళ్ళీ హాలు దగ్గర కలుద్దాం" అన్నది.

"అలాటివేం పనికిరావు. భోజనం చేయందే కదల టానికి వీలులేదు."

ఇక త్యాగరాజులు ఊరుకోలేకపోయినాడు. సాధ్యమైనంత మృదుత్వం కంఠంలోకి తేవటానికి వ్యర్థప్రయత్నం చేస్తూ "చూడండి, మేం మీతో సినిమాకి వచ్చినా కలిసి కూర్చోలేం. మా టికెట్లు తక్కువ క్లాసువి" అనేశాడు.

ఆ మాటకి లీల సిగ్గుపడితే లలిత గాభరాపడి;

"భలే! మీ ఉద్దేశ్యం లీలని తక్కువక్లాసులో కూర్చోపెడదామనే .. ... అయ్యబాబోయ్! ఆ క్లాసులో అడ్డమైన వాళ్ళూ కూర్చుంటారు" అన్నది. త్యాగరాజులుకి పూర్తిగా తిక్క రేగింది.

"అడ్డమైనవాళ్ళూ కారండి.... సామాన్య ప్రజలు...."

అతని మాట ఏ విధంగా పూర్తి కాబోతున్నదో పసికట్టిన లీల అతన్ని ఆపి లలితవంక అనునయంగా చూస్తూ; "ఆయన భావాలన్నీ అదోమాదిరిగా ఉంటాయి, ఏమనుకోకు లలితా! మనం సామాన్య ప్రజల్లో ఎందుకు కూర్చోకూడదు? ఏమిటి వాళ్ళకీ మనకీ భేదం? అందరం పీల్చే గాలీ ఒకటే - అంటారు ఉత్త తిక్కమనిషి" అని సర్దింది.

"ఫరవాలేదులే ... ఆ టికెట్లు ఇటు తెండి" అంది లలిత.

"దేనికి?"

"ఆ టికెట్లు చప్రాసీకీ ఆయాకీ ఇచ్చి పెద్ద టిక్కెట్లు తెప్పిస్తాను"

త్యాగరాజులు పెద్ద నిట్టూర్పు విడిచాడు - కులభేదం పోవచ్చును - పోవాలనికూడా ప్రయత్నిస్తున్నాం...న్యాయానికి, కులభేదం సంఘానికి చేసిన పెద్ద అపకారంలేదు — ఇప్పుడీ వర్గభేదం చేస్తున్న అపకారంతో పోల్చిచూస్తే.

ఇప్పట్లో ఈ వర్గభేదంపోయే అవకాశం ఎంతమాత్రం లేదు. ధనం అనేది సుఖానికీ అవసరానికీ కాకుండా ఆధిక్యతకి చిహ్నంగా భావించబడుతున్నప్పుడు - అదే వాసుకి కక్కిన

విషంలాగా తయారయి తన గాలి వీచినంత మేరా శ్మశానం చేసివేస్తుంది - త్యాగరాజులు విడిచిన నిట్టూర్పులో ఇంత వ్యథ ఉన్నదన్న విషయం కేవలం ఆ సర్వాంతర్యామికే తెలుసు.

# 2

నాలుగు రోజులు గడిచిపోయిన తరువాత అప్పుడే ఆఫీసునించి వచ్చిన త్యాగరాజులుకి కాఫీ కప్పు అందిస్తూ "మా స్నేహితురాలిమీద మీ అభిప్రాయం ఏమిటి? అంత భాగ్యవంతురాలైనా ఎక్కడా గర్వం అన్నది లేదు" అన్నది లీల.

త్యాగరాజులుకి లీల అంటే చాలా ప్రేమ. మరీమారం పోతే తప్ప ఆమె అభిప్రాయాలకి అడ్డంరాడు—ఆమె కష్ట పడటం అనేది అతనికి గిట్టదు. అతనిలో ఉన్న లోటు ఒకటే, ఇంత ప్రేమని పైకి చెప్పలేకపోవటం. లీల అన్నమాటకి నవ్వుతూ;

"నిజమే గర్వం ఆట్టే లేదు. ఎందుకంటే; సరేలే, ఒకటి మాత్రం నిశ్చయం. ఆమె చూడటానికి మాత్రం చాలా అందంగా ఉంది" అన్నాడు.

"ఆదివరకు ఇంత అందంలేదు"

"ఇప్పుడు మాత్రం అందంగానే ఉంది. మొగం అంత అందంగా లేకపోయినా మొత్తంమీద ఫరవాలేదు. మొన్న కట్టుకున్న చీరా రవికాకూడా ఆమె రంగుకి సరిపోయినాయి.

ఏది ఏమయినా అనుకో, పెళ్ళిఅయినాక ఆడదానికి అదో అందం వస్తుంది"

"కాలేజీలో అది అస్తమానం నాతో ఇలా అంటూ ఉండేది 'లీలా నీ నడుమూ వేళ్ళూ కళ్ళూ నాకిచ్చి నావి నువ్వు తీసుకోకూడదూ! ఇంత అందం ఎలా వచ్చింది నీకు?' అనేది"

"అవును...నిజమే... ఆ రోజుల్లో నీకేం పని లేదు కనుక అస్తమానం అలంకారం మీద శ్రద్ధగా ఉండేదానివి. అంతేకాక చాలాబాగుండే దానివి."

"అవును. ఏదయినా అలంకరించు కోటంలో కూడా ఉంది. లలితలాగా నాకూ డబ్బు, స్వేచ్ఛా ఉంటే నేనూ అలాగే ఉండేదాన్ని. రాణీలాగ బ్రతుకుతోంది అది మేడా, కారూ నౌకర్లూ నగలూ... నేను దానివెంట దాని గదిలోకి వెళ్ళాను. బీరువాలో ఉన్న చీరలే దాదాపు పది పదిహేను వేలు రూపాయలవి ఉంటాయి"

"నీవు వాళ్ళ ఇనప్పెట్టె చూడలేదు కాబోలు! దాని నిండా అన్యాయపు డబ్బు అనంతంగా ఉంటుంది"

త్యాగరాజులు అన్నమాట లీల వినిపించుకోలేదు.

"ఒకప్పుడు దానివేళ్ళు మోటుగా సాఫీగా ఉండేవి. అయినా ఆ వేళ్ళే ఇప్పుడెంతో అందంగా కనిపిస్తున్నాయి. అందరూ ఆ వేళ్ళపై ఉంగరాల్ని చూస్తున్నారో లేదో అని దాని తాపత్రయం"

"ఏం ఆడవాళ్ళు లీలా మీరు! వానిటీవల్ల కొన్ని తృష్ణలుతీ రతాయేమోగాని, శాంతి ఉండదన్న సంగతి

గ్రహించలేం ! ఏది ఏమయినా ఇప్పుడేం మునిగిపోయింది లెద్దూ—ఎంత అలంకరించుకున్నా నీతో మాత్రం సరిరాదు- ఆ మాటకొస్తే అసలు పోలికే లేదు"

త్యాగరాజులు అన్నమాటలకి తనసర్వస్వమూ పోయి నట్లనిపించింది లీలకి.

"నాతో సరీరాదు - నాతో పోలికాలేదు. ఆనాటి అందంఇప్పుడు నాకు లేదు. ఏకొంచెమో ఉంటేఅది కాస్తా ఈ వంటఇంటికి ధారపోశాను. ప్రస్తుతం మిగిలివున్న ఈ అందం దాని కాలిగోటికి సరిపోలదు...నా అందం...ఎక్కడుంది, అంతా పోయింది" రెండుచేతులూ మొగానికి అడ్డంపెట్టుకుని ఏడవటం ప్రారంభించింది లీల.

చేసి చేసి వచ్చిన త్యాగరాజులకి ఈ ఏడుపు విసుగ పించింది. సహనాన్ని పూర్తిగా పోగొట్టుకుని "ఎందుకి ఏడుపు ? ఏమిటీమధ్య ప్రతి చిన్న విషయానికీ బాధపడు- తున్నావు ! నీకేం తక్కువయిందని" అన్నాడు.

లీల ఆ ప్రశ్నకి సమాధానమూ చెప్పలేదు; ఏడుపూ ఆపలేదు.

త్యాగరాజులు విసురుగా లేచి చెప్పులు తొడుక్కుని వీధిలోకి వెళ్ళిపోయినాడు...శరీరం నడుస్తున్నది- మనసు ఆలోచిస్తున్నది. ప్రస్తుత సాంఘిక జీవితం ఆదరణా ప్రేమా మమతా వీటిమీద ఆధారపడిలేదు. దీని వేళ్ళూ కొమ్మలూ కాండమూ అన్నీకూడా డబ్బుతోనే పెరిగి చిగురిస్తున్నాయ్. ఆ విషయం తనకి తెలియకపోలేదు. తన వృత్తిలో ఉన్న

వాళ్ళు అక్రమంగా సంపాదించటానికి బోలెడు అవకాశం కూడా ఉన్నది - ఎందుకో తెలియదు. తను అలా చేయలేక పోతున్నాడు. ప్రభుత్వాన్ని, ప్రజల్నికూడా మోసగించిన ధనంతో తన లీలకి చీరలూ నగలూ కొనాలంటే తన అంతర్యం ఒప్పటంలేదు. తద్వారా లీలకికూడా తనువిరోధిగా మారుతున్నాడు. ధర్మంలో కష్టమూ-అధర్మంలోసుఖమూ దొరుకుతోంది నేటి జీవితంలో.

ఈ లోపం ఎక్కడున్నది? దీనికి నిష్కృతి ఎక్కడ?

"త్యాగీ!" పరధ్యానంగా నడుస్తున్న త్యాగరాజులు ఈ పిలుపుకి తలఎత్తాడు.

"సుమతీ... కూరలు కొనటానికి వచ్చావా?"

"శనివారం సాయంత్రం చవగ్గా ఉంటాయికదా అందుకని... సరేగాని అంత పరధ్యానంగా నడుస్తున్నా వేమిటి?" అన్నది సుమతి. ఆమెవయసు పాతికలోపే. నిరాభరణంగా - నిరలంకారంగా ఉన్న ఆ యువతిని చూస్తేనే వితంతువని తెలిసిపోతున్నది - కనుమాసిన తెల్లచీరా, రవికా ఆమె వంటిమీద ఉన్నాయి. జుట్టు వేలుముడి వేసుకుంది. అంటే ఒక్క నగకూడా ఆమె వంటిమీద లేదు. ఆమె అడిగిన ప్రశ్నకి త్యాగరాజులు సమాధానం చెప్పలేదు. రెండు మూడు క్షణాలు ఆమె జవాబుకోసం నిరీక్షించి;

"పోతాను త్యాగీ, అత్తగారింట్లో బాగాలేదు... కాస్త పెందరాళే వంటచేసి ముసలాయనకి పెట్టకపోతే అరగదు" అని కూరలసంచీ చెయ్యి మార్చుకుని వెళ్ళిపోయింది సుమతి.

త్యాగరాజులికి కళ్ళల్లో నీరు తిరిగింది. సుమతిది కూడా తనవూరే. అంతేకాదు; దూరపుచుట్టంకూడా...తల్లి చిన్నప్పుడే పోవటంవలన తమ్ముళ్ళనీ చెల్లెళ్ళనీ పెంచింది. తన సుఖం ఏనాడూ చూసుకోలేదు ఆమె. పెళ్ళి అయినాక బడిపంతులైన భర్తతో, వృద్ధులయిన అత్త మామలతో కొన్నాళ్ళు సుఖంగానే గడిపింది. ఏడాదికింకట విధి నిర్దాక్షిణ్యంగా ఆమె సుఖాన్ని ఉండచుట్టి విసిరివేసింది. ఏకపుత్ర వియోగంతో కుమిలిపోతున్న అత్తమామల్ని పంతులమ్మ ఉద్యోగంచేసి తనే పోషిస్తున్నది. ఆమెకు అవసరాలులేవు, అనుభూతులు ఉన్నాయో, లేవో తెలియదు. స్వధర్మాన్ని ప్రాణప్రదంగా పాటిస్తున్నది. ఇతర్లకి సేవచేయటం అనేది ఆమెకు రక్తగతమైపోయింది. ఇంత ధర్మమూర్తిని సర్వ సుఖాల్నించీ దేనికి వంచించినట్లు భగవంతుడు? ఈ ధర్మ నిర్వాహణలో ఆమె ఏం పొందకలుగుతోంది—ఏమీ పొంద లేనప్పుడు ధర్మంవలన ప్రయోజనం ఏమిటి?

బహుశా సుమతి ఇప్పటికి ఇంటికిచేరి ఉంటుంది. కూరలు నట్టింట్లో కుమ్మరించి - పొయ్యిరాజేస్తూ ఉంది కాబోలు. కట్టెలు బహుశా పచ్చివై ఉంటాయి. పొగచేత ఆమెకళ్ళూ ముక్కూ ఎర్రబడిపోయినాయి. అయినా ఆమె అదేమీ లక్ష్యపెట్టటం లేదు. మామగారికి పెందరాళే వంట చేసి పెట్టాలి: అదే ఆమె ధ్యేయం. అత్తగారు మంచంలో పడుకుని తలనొప్పివల్లా పుత్రవియోగం వలనా కుమిలిపోతూ ఉంటుంది. ఎసట్లో బియ్యంపోసి అత్తగారి దగ్గరకువచ్చి

'అత్తయ్యా అమృతాంజనం వ్రాయమంటారా?' అని అంటుంది సుమతి.

ఆ వృద్ధుల సేవలోనే ఆమె దివారాత్రాలు గడిచి పోతున్నయ్. అంతకన్న ఆమె పొందుతున్నది ఏమీ లేదు. పొందాలనికూడా ఆమె అనుకోటంలేదు. ఆమె జీవితానికి సమరంలేదు. ఆమె హృదయానికి అనుభూతులు లేవు – ఆమె దేహానికి కోరికలులేవు. ఉన్నది ఒకటే. అది రక్తగతమైన స్వధర్మ నిర్వహణ. మనసులోనే సుమతికి నమస్కరించి ముందుకి సాగిపోయినాడు త్యాగరాజులు.

## 3

ఖరీదుగల సోఫాలో కూర్చుని కూల్‌డ్రింక్ తాగుతూ "లలితా, అస్తమానం పనివాళ్ళకి పనులు పురమాయిస్తూ గడిపితే నీకు ఎలా తోస్తుంది?" అని అడిగింది లీల.

లలిత సోఫాలో వెనక్కివాలి ఒళ్ళువిరుచుకొనిఆవలించి; "నిజం చెప్పాలంటే పెళ్ళయిన తరువాత కొన్ని రోజులు ఈ జీవితం బాగానే ఉంది. తరువాత తోచలేదు... ప్రస్తుతం ఆబాధ లేదులే – కావల్సినంత పని".

"ఎలా?"

"ప్రతీ ఉదయం పదకొండింటికి లేడీస్ క్లబ్‌లో ఒక లెక్చర్ ఇస్తాను. పన్నెండునించి ఒంటిగంట దాకా కాగితం పూలు తయారీ సర్ రైవా ఇంట్లో. రైవా నీకు తెలుసా? రైవా మోటార్ కంపెనీ సొంతదారుడు."

"ఏమిటీ! కాగితంపూలా?"

"అవును ఏమైనా ఉత్సవాలూ అలాంటి ప్రత్యేక సందర్భాల్లో వీటిని అమ్మకం పెట్టి ఆ వచ్చిన డబ్బు ఏదో ఒక సంస్థకి విరాళంగా ఇస్తాం. సరే విను. సాయంత్రం క్లబ్బుకి పోతాను. అక్కడ రకరకాల ఫలహారాలు తయారు చేస్తాం. కొన్నాళ్ళకిందట కేంద్రమంత్రి మా క్లబ్బుకి వచ్చి నప్పుడు... అలా చూస్తావేం? ఆమధ్య వచ్చారులే! ఆయన మేం చేసిన ఫలహారాలను తెగ మెచ్చుకున్నారు. ఆయనతో మేం తీయించుకున్న ఫోటో పేపర్లో పడింది-నువ్వు చూడ లేదా?"

లీల ఆశ్చర్యపడిపోతూ "కేంద్రమంత్రితోనే?" అం.

"మరే-కొన్నాళ్ళకిందట ఒక మేయరుగారు ఈ వూరు వస్తే ఇంకొందరు గౌరవనీయుల్ని ఆహ్వానించి మంచి పార్టీ ఇచ్చాం. ఆ సందర్భంలోనే అరబ్ బాల బాలికలకు బహుమతులు పంపించాంకూడా."

"ఊ" అంది లీల ఇంకేం మాటరాక.

"ఇంకా ఎన్నో ఉన్నాయి. ఆరోగ్యవారం- పుష్ప ప్రదర్శనం, కూరగాయల ప్రదర్శనం, ఫాన్సీడ్రెస్ పోటీ - వీటన్నిట్లో వేలకు వేలు వస్తాయి. నేనో అమెరికన్ పేపర్లో వ్యాసం వ్రాశాను తెలుసా?"

"నీవు పత్రికలకి కూడా వ్రాస్తావా?"

"ఏం, ఎందుకు వ్రాయలేను? ప్రతి నెలా న్యాయాన్న్ర-

నించి వచ్చే పత్రికకు హిందూ సమస్యలమీద వ్రాస్తూ ఉంటాను."

అక్కడ త్యాగరాజులు ఉన్నట్లయితే హిందూ సమస్యల మీద ఇంగ్లీషు పత్రికల్లో ఎందుకు వ్రాయుటమో అడిగిఉండేవాడు లీలకి ఆ విషయం తోచలేదు! కాగా నిట్టూర్పు విడిచి;

"ఏదో నీ జీవితంలో నువ్వా కొన్ని ఘనకార్యాలు చేస్తున్నావు లలితా" అన్నది— ఆ మాటకి అదృశ్య దేవతలు విరగపడి నవ్వారు.

లలిత లీల చెయ్యి తన చేతిలోకి తీసుకొని గంభీరంగా కళ్ళల్లోకి చూస్తూ "మరి నీ సంగతి ఏమిటి? నీ వయసు, నీ కాలాన్ని వృధాచేస్తున్నావు. నీకేం తక్కువ లీలా! చదువుకునేప్పుడు ఎంత చురుగ్గా ఉండే దానివి! అప్పట్లో నీవుకూడా మంచి వ్యాసాలు వ్రాస్తూ ఉండేదానివి. నిజం చెప్పాలంటే నా పేరుమీదపడే వ్యాసాలు మాస్టారు వ్రాసి ఇస్తూ ఉండేవారు లీలా! ఈ సంసారం నిన్ను నాశనంచేసింది. సరే లే, ఇక నుంచి మాత్రం నువ్వు నేను చెప్పినట్లు విని నేనెక్కడికి తీసికెడితే అక్కడికి రావాలి-సరేనా ?" అన్నది.

"బాగానే ఉంది. మరి పాపాయి సంగతి ?"

"మీ ఆయా దగ్గర విడిచేయి" అని లీలకి ఆయా లేదన్నసంగతి గుర్తుకొచ్చి నాలుక కరుచుకొని "మా ఆయాకి పనిలేక అస్తమానం కుక్క- పిల్లని ఆడిస్తున్నది. దానికి అప్ప చెపుదాం" అన్నది లలిత.

ఆడంబరపు నిషాలో మునిగిన లీలకి ఆ మాటల్లోని నైచ్యత అర్థంకాలేదు. ఆ మాటకొస్తే లలితకే తెలియదు తన మాటల్లోని నైచ్యత. జీవితపు విలువలు తలకిందుగా తిరిగిపోయిన విషయం స్త్రీలు గ్రహించడానికి చాలా కాలం పడుతుంది. కాని ఏం లాభం! గ్రహించేసరికి అంతా మించి పోతుంది. ఆ మించిపోవటానికి సమయం ఆట్టే లేదన్నట్లు సాంబశివరావు ఆ గదిలో ప్రవేశించాడు. తెరకి అవలవైపున కొన్నిక్షణాలు నిలబడి "శ్రీమతిజీ, ఈ సేవకమ్మన్యుడు లోనికి రావచ్చునా ?" అని ప్రశ్నించాడు.

లలిత సంతోషంతో పకపకా నవ్వుతూ "ఓ సాంబులూ! రా రా... నువ్వు రాదగనిచోటు ఇక్కడేం లేదు" అన్నది.

లీల ఖంగారుపడి సోఫాలోనుంచి లేచి నిలబడింది. సాంబులు ఆ గదిలోకి అడుగుపెడుతూనే లీలని చూచాడు.

"ఓహో... చంద్రికా జ్వలితమైన రజనీ సౌందర్యం లాగా మెరిసిపోతున్న ఈ అందాల రాశి ఎవరు ?" అన్నాడు.

ఆ మాటకి లలిత పకపకా నవ్వితే లీల నవ్వు ఆపుకుంది... చాలా రోజులుగా ఆమె సౌందర్య ప్రశంస చేసిన వాళ్ళెవరూ లేరు. ఆమె సౌందర్య గర్వితం. రకరకాల స్త్రీలని ఎరుగున్న సాంబులు చూసీ చూడగానే ఆమె స్వభావాన్ని గ్రహించేసి పై మాటలన్నాడు. అతని అంచనా తప్పలేదు. ఆమె చాలా సంతోషించి అందువలన కలిగిన నవ్వుని ఆపుకోవాలని వ్యర్థ ప్రయత్నం చేసింది.

"వద్దు వద్దు. నవ్వు ఆపుకోండి - హాయిగా నవ్వే సేయండి. పగడాలలాటి పెదవులమధ్యనించి ముత్యాలు రాలనీయండి" అన్నాడు సాంబులు.

"లీలా, ఇతనెవరో నీకు పరిచయం చేయలేదు కదూ! నాలుగు కాళ్ళులేని జంతువు" అని లలిత తన హాస్యానికి తనే నవ్వుకుంది.

సాంబులు ఆ మాట కేమీ కష్టపెట్టుకోలేదు-సరిగదా; 'నిజమే. నేను జంతువునే. సౌందర్యాన్ని పూజించే జంతువుని. శ్రీమతీజీ! ఫ్రెంచి ప్రేమకథల్లో జంతువు వేషం వేసుకొన్న రాజకుమారుల కథలు బోలెడు—పగడాల పెదవుల్తో ఏ రాజకుమారి తనని కటాక్షిస్తుందో అని అనుక్షణమూ ఎదురుచూస్తున్నాను-ఆమె పగడపు పెదవి..."

మోకాళ్ళమీద నిలబడి ఇంగ్లీషు సినిమాలో హీరో లాగా కవిత్వం చెబుతున్న సాంబుల్ని మధ్యలోనే ఆపి; "చాల్లే ఆపు - ఏమిటది. ఫ్రెంచి నవల్లో హీరో లాగా మోకాళ్ళమీద ప్రాధేయ పడుతున్నావు—లే...లే... లేచి టోపీధరించు. మా లీల రాజకుమారి కాదు-గృహిణి" అన్నది లలిత.

"గృహిణి...ఎంత దురదృష్టం...ప్రతి పయనం లోనూ నేను లేటేగదా ఖర్మ...నీ విషయంలోనూ అంతే! స్వామే ముందడుగు వేశాడు. కాలాన్నే ఆడిస్తున్నాడు లక్కీ ఫెలో"

"కాలం నిన్ను ఆడిస్తోంది - ఇదుగో సంగతి వినుమరి! లీలా, నేనూ చాలా రోజులకి కలుసుకున్నాం. లీలా, ఇతను

సాంబశివరావు. కార్ల ఇంపోర్టరు దగ్గరినించి కమీషన్ ఏజంటు దాకా రకరకాల పనులు చేస్తూవుంటాడు. డబ్బులిస్తే, ఏపని కావాలంటే ఆపని చేస్తాడు. సిటీ మొత్తంమీద తీరిక అనేది లేనివ్యక్తి ఎవరంటే సాంబులొక్కడే" అని లీలకి పరిచయం చేసింది లలిత.

లీల నవ్వి "ఆయన మాటల్లో అది తెలుస్తూనే ఉంది. దయచేసి కూర్చోండి" అన్నది.

సాంబులు హడావిడిగా వాచీ చూసుకొని "ఎక్కువ సేపు ఉండటానికి టైములేదు. సాయంత్రం మీ ప్రోగ్రాం ఏమిటో తెలుసుకుందామని వచ్చాను. ఒకవేళ ఏమైనా ఎంగేజిమెంట్స్ ఉంటే మానుకోవాలని ప్రార్థన" అన్నాడు.

"మానుకోటం దేనికి?" అన్నది లలిత.

"దేనికంటే, ఒకటి: మనం కలిసి టీ తీసుకోవాలి; రెండు: సినిమా చూడాలి- మూడు: భోజనం చెయ్యాలి - తరువాత మీ యిష్టంవచ్చిన చోటికి పోవటానికి అనుమతి లభిస్తుంది."

"ఎందుకిప్పు డవన్నీ! ఏమిటి కారణం?" అని తాపీగా అడిగింది లలిత.

"కారణం ఈ రాజకుమారి ప్రథమ పరిచయం! మరి వెళ్ళరానా? ఇంకొంచెంసేపు వీరి అందాన్నిచూడాలనిఉన్నా గాని... ఏం చేస్తాం జీవితం పర్మిషన్ ఇవ్వదు. మరి వెళతాను. టా టా" అని అంత హడావిడిగానూ వెళ్ళిపోయాడు సాంబులు. లీల తెల్లబోయి అతను వెళ్ళినవైపే చూస్తూవుండి పోయింది.

"చాలా చిత్రమైన వ్యక్తి కదూ లీలా!" అన్నది లలిత ఆమెని ఆ సమాధిలోంచి బయట పడేస్తూ.

"అవును, చాలా ఉత్సాహవంతుడు" అన్నది లీల లేవటానికి ప్రయత్నిస్తూ.

కొద్దికాలంలోనే ఈ విధమైన జీవితం నిషాలా ఆవరించింది లీలని. అస్తమానం పార్టీలూ, పొగ త్రాగడలూ, కారుషికార్లూ ఒళ్లైము చాలకపోవడం_ఇవన్నీ ఆమెకు అలవాటైపోయినయి. కొద్దిగా డబ్బు అవసరం కూడా ఎక్కువయింది. అందుకే ఆ సాయంత్రం త్యాగరాజులు ఇంటికిరాగానే లీల చాలా చాలా ఉపచారాలు చేసింది—త్యాగరాజులు నవ్వుతూ,

"ఏమిటి కథ!" అన్నాడు.

"మీరు పార్టీకి ఎందుకు రాలేదు? పార్టీ ఎంత బాగుందనుకున్నారు!" అన్నది లీల అతన్ని ఆనుకుని కూర్చుంటూ.

"రెండు ముఖ్యమైన కేసులు ఉండిపోయినయి; అందువల్ల రాలేకపోయినాను. అయిదుగంటలవరకూ ఊపిరి తీసుకోడానికి లేకపోయింది. నీకు టెలిఫోను చేస్తే బిజీగా ఉన్నావన్నారు. నన్ను క్షమించు లీలా" అన్నాడు ఆమె బుగ్గమీద చిటికె వేస్తూ త్యాగరాజులు.

ఆమె ఆనందానికి అతడు అడ్డురాడు. సామాన్యంగా తన ధర్మానికి అడ్డురావటం సహించనూలేడు. లీల ఆ సంగతి గ్రహించలేదంటా;

"సాంబశివరావు మిమ్మల్నందర్నీ ఎంతో నవ్వించేవాడు. అతనే ఈ రోజు పార్టీ ఇచ్చింది. చాలా ఉత్సాహవంతుడు"

"నీవు వెళ్ళినందుకు థేంక్స్. ఈ జీవితంతో విసిగి పోయిన నీకు నిజంగా కొంతమార్పు అవసరం"

లీల నిట్టూర్చి "ఎలా జీవించాలో వాళ్ళకు తెలిసినట్లు మనకు తెలియదు' క్లబ్బులో చూస్తాను, ప్రతివాడూ ఎంతో హాయిగా ఉంటాడు. ఎవరి మొగానా విచారం అన్నది ఏకోశం లోనూ కనిపించదు" అన్నది.

"వాళ్ళ మొగాలు అలా వుండక ఇంకెలా ఉంటాయి! కావల్సినంత డబ్బు ఉంది. ఏ విధమైన బాధ్యతలు గాని, సమస్యలు గాని లేవు."

"అలా అంటే, నే నొప్పుకోను. అది వాళ్ళ స్వభావ గాని, మరేం లేదు....వాసిలీగారని ఒకాయన ఉన్నారు. రేషనింగ్ డిపార్టుమెంటులో చిన్న ఆఫీసరుట—మీరు చూడాలి ఆయనెంత దర్జాగా ఉంటారో"

"మరి చిన్న ఆఫీసరు అంత దర్జాగా ఎలా బ్రతుకు తున్నాడంటావు లీలా!"

"బాగుంది- చెయ్యాలనుకుంటే మనిషి చేయలేనిది లేదు."

"అంటే పై సంపాదన ఏదో ఉంటుంది. అవునా!"

"అయి ఉండచ్చును. మనిషి గాడిదలా ఉంటాడు సాంబులు. అతన్ని ఒకటే ఏడిపించటం"

"అయితే మిసెస్ వాసిలీ అందగత్తె అయిఉంటుంది."

"అవును. ప్రతివాళ్ళూ ఆమెనెంతో గౌరవిస్తారు. అసలామెవల్లనే వాసిలీ గారు పార్టీలకు ఆహ్వానించబడు

తున్నాడు. లేకపోతే ఆయన మొహం చూపేదెవరు?" అన్నది లీల త్యాగరాజులు మాటల్లో వ్యంగ్యాన్ని గ్రహించలేక.

"పెద్దలంతా అంతే - అందమైన భార్యవున్న ప్రతీ మొగాడినీ గాడిదకింద తయారుచేసి ఆనందం పొందుతారు" అన్నాడు త్యాగరాజులు మరింత వ్యంగ్యంగా. లీల ఇప్పటికి భర్త ధోరణి గ్రహించింది. విసుక్కుంటూ;

"మళ్ళీ ఆరంభమైంది పాతధోరణి. హాయిగా బ్రతికే వాళ్ళని చూస్తే మీకు అసూయ" అన్నది.

"కాదు...ఇతర్ల జీవితపు విలువల్ని గడ్డిపరకల కింద చూసే వాళ్ళంటేనే నా కసహ్యం"

"ఎవళ్ళ జీవితపు విలువల్ని వాళ్ళు గడ్డి పరకలకింద చూస్తున్నారో కొంచెం చెప్పండి"

"ఎవరివేమిటి ! నీవీ నావీ కూడా"

"బాగుంది. మీ జీవితంలో విలువనీ సంతోషాన్నీ వాళ్ళేలా ఆపగలరో నా కర్థం కావటంలేదు."

త్యాగరాజులు పడకకుర్చీలో ఆనుకుని కూర్చున్నవాడల్లా లేచి, ముందుకువంగి సిగరెట్ అంటించి తాపీగా చెప్పటం ప్రారంభించాడు.

"వాళ్ళెవరూ ప్రత్యక్షంగా వచ్చి నీ సంతోషానికీ నా సంతోషానికీ అడ్డురారు. కాని తెరవెనుక వాళ్ళు చేసే పనులే-నిశ్శబ్దంగా మన జీవితపు విలువల్ని తారుమారు చేస్తాయి. ఏ మనిషినయినా ఊపిరాడకుండా బిగించి చంపాలంటే శరీరానికే బాధను కలిగించనక్కరలేదు. నా కష్టం, నీ కష్టం-కష్ట

పడే ప్రతిమనిషి కష్టం రూపాయలుగా మారి వాళ్ళదగ్గిరకి పోతున్నాయి. లీలా, ఇప్పుడు నీవు కట్టుకున్నచీర ఎలా తయారయిందో తెలుసా? బ్లాక్ మార్కెట్‌లో నీవుకొన్న ఈ చీరె స్వామి మిల్లులో తయారయిందే.- నీ డబ్బు సరాసరి షాపువాడి ద్వారా స్వామి జేబులోకి వెళుతోంది- ఇప్పుడయినా అర్థం అయిందా? లలిత చెక్కిళ్ళు గులాబీరంగుకి రావాలంటే నీ చెక్కిళ్ళు పాలిపోవాలి - కాని లీలా, నీవు మాత్రం ఇది అర్థంచేసుకోటంలేదు" అన్నాడు త్యాగరాజులు. లీల మాట్లాడలేదు. అతను చెప్పిన విషయాలతో ఆమె ఏకీభవించలేదు గాని ఏం సమాధానం చెప్పాలో మాత్రం ఆమెకి తోచలేదు—కొంచెంసేపు ఇద్దరిమధ్యా నిశ్శబ్దం పారాడింది.

"తలనెప్పిగా ఉంది లీలా-కాస్త నొక్కుతావా?" అన్నాడు త్యాగరాజులు. లీల అతని నుదుటిమీద చెయ్యివేసి "నుదురు చాలా వేడిగా ఉందే!" అన్నది ఆదుర్దాగా.

"పని ఒత్తిడి చాలా అధికంగా ఉంది లీలా! అంత కష్టమ రేంలేదు. కొన్ని క్షణాలు నీ మెత్తనిచేయి నానుదుటి మీద ఉంటే అదే తగ్గుతుంది"

"ఎందుకంత కష్టపడాలి - చెప్పండి?"

"దానికి నేనేం చేయగలను? ప్రతివాడూ దొంగలెక్కలు కట్టి మోసగించాలని చూడటం పరిపాటి అయిపోయింది. యీ బ్లాకుమార్కెట్ వాళ్ళని పట్టుకోవాలంటే కొంచెం కష్టపడాల్సి ఉంటుంది మరి"

"పోనీ వదిలేస్తే ఏమవుతుంది?"

లీల అన్నమాటకి త్యాగరాజులు తెల్లబోయి చూసి "ఏమిటీ! పన్నులు కట్టకుండా ప్రభుత్వాన్ని మోసం చేస్తూ ఉంటే చూస్తూ ఊరుకోమని సలహా ఇస్తున్నావా లీలా?" అన్నాడు.

"ఊరుకోవటం దేనికి! ఏదో కొంచెం డబ్బు తీసుకుని వదిలేస్తేసరి! ఇప్పుడందరూ చేస్తున్నపని అదేగా" అన్నదిలీల చేతిగోళ్ళని పరీక్షగా చూస్తూ.

త్యాగరాజులు ఉలిక్కిపడ్డాడు.

"ఏమిటి? ...నువ్వంటున్నది ఏమిటి లీలా?"అన్నాడు.

లీల అతని నివ్వెరపాటునిగ్రహించకుండానే "అందులో తప్పేముంది! ఇప్పుడందరూ అదేపని చేస్తున్నారు" అన్నది.

"లీలా...ప్రతివాడికీ ప్లేగువ్యాధి సోకుతుంది ఒక్కొక్కప్పుడు...అందరికీ సోకిందికదా అని ఆరోగ్యవంతుణ్ణి కూడా ఆ రోగానికి బలివ్వాలనటం క్షమించరాని నేరం. ఈ రోగం ఎంతదూరం పోతున్నదో నువ్వు ఆలోచించగలుగుతున్నావా? ఈ రోజున లంచం తీసుకుని వాళ్ళని వదిలివేస్తే ఏం జరుగుతుందో తెలుసా? బ్లాక్ మార్కెట్ పెరిగిపోతుంది. ధరలు ఆకాశం అంటుతాయి. దాని అర్థం-మన శత్రువుల చేతుల్ని మనమే బలపరుస్తున్నాం"

"సరే, మీ సిద్ధాంతాలు అలాగే ఉంటే మన బ్రతుకులూ ఇలాగే ఉంటాయి" విసుక్కుంది లీల.

"లంచాలు తీసుకుంటే బ్రతుకులు మారతాయను కోటం నీ భ్రమ!"

"బ్రతికిన నాలుగురోజులూ అయినా బాగాఉంటాం"

"లీలా... ఇప్పుడు నాతో గడుపుతున్న జీవితం నీకు బాగాలేదా!" అని జాలిగా ప్రశ్నించాడు త్యాగరాజులు.

"ఈ దరిద్రపు కొంపలో-ఈ వెధవ వాతావరణంలో నేను బ్రతకలేను" అని విసురుగా లోపలికి వెళ్ళిపోయింది లీల. త్యాగరాజులు తెల్లపోయినాడు—ఆమెలో ఇదివర కెప్పుడూ లేని అసంతృప్తి ఇప్పుడు ఏ కారణంవలన ఏర్పడిందో అతనికి అర్థం కాలేదు. దరిద్రపుకొంప— వెధవవాతావర ణం...

ఈరెండిటినీ ఆమె స్వర్గతుల్యంగా భావించింది. ఒకా నొకప్పుడు—ఏదో అదృశ్యహస్తం తనగుండెకాయుని పట్టి పిండివేస్తున్న ట్లనిపించింది, అతనికి—రెండుచేతులతో కణ తలునొక్కుకున్నాడు—ఎందుకో తెలియదు, అతనికి సుమతి జ్ఞాపకం వచ్చింది. స్త్రీవా నీవు త్యాగమూర్తివనుకున్నాను.. ఆవిషయంలో నేను పొరపాటు పడలేదు...నీవు చంచలుర వనుకోలేదు. ఆ విషయంలో మాత్రం పొరపాటు పడ్డాను— అనుకుని నిట్టూర్చాడు. త్యాగరాజులు—రెప్పలకింద దా కున్న అతని రెండు కన్నులూ అగ్నిగుండాల్లాగా మండి పోతున్నాయి.

చెప్పుల చప్పుడికి కళ్ళు తెరిచాడు. ఎదురుగుండా జగ న్మోహినిలా లీల ప్రత్యక్షమయింది!

"ఎక్కడికి!" అనవసరం అనుకుంటూనే ప్రశ్నించాడు త్యాగరాజులు.

లీల హేండుబాగ్‌లో ఏదో వెదుకుతూ సమాధానం చెప్పలేదు. త్యాగరాజులు చాల సహజమైన కంఠస్వరంతో;

"ఏమిటివాళ ఈ హడావిడి!" అన్నాడు.

"నే నివాళ త్వరగా వెళ్ళాలి." బేగ్‌లో వెదుకుతూనే సమాధానం చెప్పింది లీల.

"ఎక్కడి కేమిటి?"

"రేపు పతాకావిష్కరణోత్సవం — మీకు తెలియ దేమిటి? నేనూ, లలితా చందాలు వసూలు చెయ్యాలను కున్నాం"

"ఓ"

మరి ఇవ్వాళిటికి ఏహోటల్లోనయినా నాలుగు మెతు కులు..."

"అలాగేలే... మరి పాపను కూడా తీసుకెళుతున్నావా?"

"లలితా వాళ్ళ ఆయా ఉందిగా... సరే నేను కొంచెం ..పు పడుకుంటాను-కారువస్తే పిలవండి"

"కారు! ఎవరిది?"

అతని ప్రశ్నకి లీల సమాధానం చెపాల్సిన అవుసరం లేకపోయింది... కారు ఆగిన చప్పుడూ వెంటనే సాంబశివ రావు అడుగుల చప్పుడూ వినిపించింది. కొన్ని క్షణాల్లోనే సాంబశివరావు పూర్తి ఆకారం లోపలికి వచ్చింది. అతివిన యంగా రెండుచేతులు జోడించి "నమస్తే శ్రీమతీజీ!" అన్నా డతను.

"ఓ, మీరా మిస్టర్ సాంబశివరావు? సారీ, నేనింకా తయారుకాలేదు. మీరు కొంచెంసేపు మావారితో మాట్లా డండి—వీరే మావారు త్యాగరాజులు" అన్నది లీల.

ఇందాకటినుంచీ ఎదురుచూస్తూ తయారు కాలేదం టుందేమిటి? నాగరికతలో ఇదీ ఒకభాగం కాబోలు- అనుకు న్నాడు త్యాగరాజులు.

సాంబశివరావు త్యాగరాజులు వంక సాలోచనగా చూస్తూ;

"నమస్కారం త్యాగరాజులుగారూ! మీరెప్పుడన్నా ఇన్‌కంటాక్స్ ఆఫీసులో పనిచేశారా?" అన్నాడు. అతను లీలభర్త ఎవరో ఎప్పుడూ ఆలోచించలేదు; లలితకూడా చెప్పలేదు.

త్యాగరాజులు ప్రతినమస్కారంచేసి "అవును. ఇప్పుడు కూడా అక్కడే పనిచేస్తున్నాను" అన్నాడు.

"బహుశా 'ఎ' స్కేలు కాబోలు"

"అవునండీ"

"చూశారా, శ్రీమతీజీ మిమ్మల్ని పరిచయం చేయవా ల్సిన శ్రమ అక్కర్లేదు" అని నవ్వాడు. తెలివిగల త్యాగరా జులు ఆనవ్వు వెనకాల దాక్కున్న భీతిని కనిపెట్టి "ఓహో" అనుకున్నాడు.

లీలనవ్వి "నిన్న లలిత చెప్పినమాట నిజం, మీరొక టౌన్ డైరక్టరీ-అని... పోనీ మీరొక డిటెక్టివుగాని అవ కూడదూ!" అన్నది.

"మీ పొగడ్తకి నా ధన్యవాదాలు శ్రీమతీజీ... మరి మీరు వసూలుచెయ్యబోయే చందాల లిస్టులో నాపేరు కూడా ఉందా? నాది మంచిబోణీ అండోయ్."

"చందా ఇస్తారేమిటీ?"

"తప్పకుండా...ఏదీ ఆచందాల లిస్టూ, పెట్టె ఇలా పట్టుకురండి... ఇవ్వాళ మీకు బాగా వసూలవుతుందని ఆశీర్వదిస్తూ చందా యిచ్చుకుంటాను."

"మీరు చాలామంచివారు... వెళ్ళి పట్టుకొస్తా నుండండి" అని లోపలికి వెళ్ళింది లీల.

"దయచేసి కూర్చోండి. ఇంతవరకూ నిలబడే మాట్లాడుతున్నారు" అన్నాడు త్యాగరాజులు.

"థేంక్స్. మిస్టర్ త్యాగరాజులూ,నా జీవితంలో నేను కూర్చోటానికి పెట్టిపుట్టలేదు" అన్నాడు సాంబశివరావు.

"ఎందుకని?" తాపీగా సిగరెట్టు ముట్టిస్తూ ప్రశ్నించాడు త్యాగరాజులు.

"జీవితం నన్ను పరిగెత్తిస్తున్నది—నేనూ జీవితాన్ని ఉరకలెత్తిస్తున్నాను—ఎందుకంటే జీవితాన్ని మనం అలాగ నొక్కకపోతే జీవితమే మనల్ని అణగదొక్కుతుంది. అందుకే చాలా జాగ్రత్తగా ఉంటాను త్యాగరాజులుగారూ" అన్నాడు సాంబశివరావు- వెయ్యిమందిఉన్న సభలోలాగా మాట్లాడుతూ.

"జీవితం విషయంలో మీ జాగ్రత సంగతి ఏమోగాని మీ విషయంలో లోకం మాత్రం చాలా జాగ్రతగా

డాలి" సిగరెట్‌కి కట్టినకొడి విదిలిస్తూ అన్నాడు త్యాగరాజులు.

అందులోఉన్న వ్యంగానికి ఉక్కిరిబిక్కిరై "బాగా చెప్పారు సార్" అని ఊరుకున్నాడు సాంబశివరావు— ఇంతలో లీలవచ్చి,

"హలో సాంబశివరావుగారూ మీరిచ్చే చందాకి ప్రతిఫలంగా ఈ చిన్నిజెండా మీకోటుకు తగిలించనివ్వండి" అని అతని కోటుకి ఆ జెండా అలంకరించింది— గెలివినట్లుగా త్యాగరాజులువంక ఒకచూపు విసిరి "ఎంత అదృష్టవంతుడిని శ్రీమతీజీ... ఇదిగో నాచందా" అని అదివరకే తీసిఉంచిన వందరూపాయలనోటు లీలకి ఇచ్చాడు సాంబశివరావు.

లీల ఆశ్చర్యపడిపోయి "ఏమిటి! వందరూపాయల నోటా!" అన్నది.

"దీనివలన నేను అదృష్టవంతుడిని కావాలనీ, అయినానని అనుకుంటున్నాను శ్రీమతిజీ... కాకపోతే చెప్పండి మరేం ప్రమాదంలేదు"

"థేంక్స్ జీ, అరకప్పు టీ తీసుకురానా!"

"అరకప్పు టీతో సరిపెడదామనుకుంటున్నారా! పార్టీ కావాలి నాకు పాప పుట్టినరోజున పార్టీ ఇయ్యండి"

"కాని అదింకా నెలకికాని రాదు"

"నేను నిరీక్షించగలను - నిరీక్షించటంలో చాలా ఆనందం ఉంది శ్రీమతిజీ - సరే ఇక నా గోల ఆపుచేస్తాను. మిష్టర్ త్యాగరాజులూ! మరి వెళ్ళిరానా!"

"మరి టీ" అన్నది లీల.

"థేంక్స్ శ్రీమతిజీ, మీరింకా ఆలస్యం చేస్తున్నారేం? ఇక బయలుదేరండి మరి నే వెడతాను. టా టా... బై బై" అని వెళ్ళిపోయాడు అతను ..

త్యాగరాజులు తీరికగా మరోసిగరెట్ ముట్టించి "భలే ఏ దుకాణంలో ఏం దొరుకుతాయో అతనికి బాగా తెలుసు" అన్నాడు.

## 4

"సుమతీ! మామగారికి ఎలా ఉంది?"

పొయ్యి ఊదుతున్న సుమతి త్యాగరాజులు ప్రశ్నకి తలఎత్తి చూచి "రా త్యాగీ ...మార్పేమీ లేదు. బహుశా కొద్దిరోజులలోనే ఆయన వెళ్ళిపోతారు" అని మళ్ళీ పొయ్యి ఊదటం మొదలు పెట్టింది.

ఆజవాబులో ఉన్న నిర్లిప్తతకీ, స్తబ్ధత్వానికి ఆశ్చర్యమూ బాధా కూడా కలిగింది త్యాగరాజులికి. వాల్చిఉన్న నులక మంచంమీద చతికిలబడి సుమతివంక పరీక్షగా చూచాడు.

తలఅంతా రేగిపోయిఉంది— కట్టుకున్న తెల్లమల్లు చీర పూర్తిగా మాసిపోయిఉంది. పచ్చికట్టెలు మండక చాలాసేపటినుంచీ ఊదుతుండటంవలన కళ్ళూ ముక్కూ ఎర్రగా ఉన్నాయి.

ఆ యింటికున్న వసారాలోనే తడిక అడ్డంకట్టి అత్త మామలకు మంచాలు వేసింది సుమతి. ఆవసారా దాటిన

వెంటనే ఉన్నగదిలోనే ఒకనులక మంచం, దానికింద ఒక పెట్టె పక్కనే కట్టిన దండెంమీద రెండు చీరలూ ఉన్నాయి. అది సుమతి గది. అందులోనే కూర్చున్నాడు త్యాగరాజులు- అక్కడినుంచి వంటిల్లు స్పష్టంగా కనిపిస్తుంది. తిరగమోతల పెట్టెతోసహా బియ్యం పోసిన పెట్టెలోపెట్టి ఆ పెట్టెమీద తోమిన గిన్నెలూ చెంబులూ బోర్లిస్తోంది సుమతి.

ఆమెజీతం అరవై రూపాయలు. పది హేనురూపాయలు ఇంటిఅద్దెకుపోతేమిగిలిన నలభయిఅయిదు రూపాయలతోనూ మూడు పొట్టలు నిండాలి. సుమతి తన సంగతి ఎప్పుడూ లెక్క వేసుకోదు. మిగిలితే తింటుంది, లేకపోతే మానేస్తుంది. స్కూలులో మాత్రం ఒక అణా పెట్టి ముసలిప్యూను తెచ్చిన టీ తాగి నెలాఖరున రెండురూపాయలు యిస్తుంది. రూపాయి పధ్నాలుగుఅణాలూ టీవాడికి యిచ్చి మిగిలిన రెండుఅణాలూ ప్యూనుని తీసుకోమంటుంది—అందుకే మహదానంద పడి పోతాడువాడు.

ఉన్నదికాస్త ఉడకేసి అత్తమామలకుపెట్టి ఏచల్లో తాగిపడుకునే రోజులే ఆమె జీవితంలో ఎక్కువ. ఆమెకు జిహ్వాచాపల్యం లేదు—అసలేచాపల్యమూ లేదు. రెండు చోట్ల ప్రయివేటు చెబితే పదిరూపాయలు వస్తాయి. అవి ముట్టుకోకుండా అట్టిపెట్టి సంవత్సరాంతంలో అనూటఇరవై రూపాయలకి బట్టలుకొని తెస్తుంది ఆమె. ఒక సినిమాగాని ఒక పుస్తకంగాని ఆమెను ప్రలోభపెట్టదు.

పొయ్యి మండుతున్నది, కొంగు విప్పి మొహం తుడుచుకుంటూ వచ్చి గుమ్మంలో కూర్చుంది ఆమె.

"ఇదివరకటికన్నా చిక్కిపోయ్యావు" అన్నాడు త్యాగరాజులు ఏమనటానికీ తోచక.

"ఏమీలేదు. నీకళ్ళకి అలా కనిపిస్తున్నాను... లీలా పాపాయీ కులాసాగా ఉన్నారా? మొన్న ఆవిడ కారులో వెడుతున్నారు-పలకరించడానికి వీలులేకపోయింది" అన్నది సుమతి.

ఎందుకో ఆమె మాటకి సిగ్గుపడ్డాడు త్యాగరాజులు. పగలల్లా స్కూలులో చాకిరిచేసివచ్చి చిరుగులసంచీ చేతికి తగిలించుకుని కూరలకు వెడుతున్న సుమతీకీ, కన్నబిడ్డని భాగ్యవంతురాలైన స్నేహితురాలి ఆయాకి అప్పగించి ఊరి వాళ్ళకార్లలో చందాకి తిరుగుతున్న లీలకీ ఎంత తేడా?

ఈమె త్యాగంలో సుఖం లేదు—ఆమె స్వార్థంలో కష్టం లేదు. ఈమె పడుతున్న కష్టంలో ఆమె పదోవంతు పడటంలేదు. ఆ క్షణంలో ప్రపంచం అంటే అసహ్యము వేసింది త్యాగరాజులికి. ధర్మానికీ సత్యానికీ త్యాగానికీ ఫలితంలేని ఈ ప్రపంచం ఒక పెద్ద బందెల దొడ్డిగా కనిపించింది అతనికి.

తనసలు లీలని ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడో— భ్రమించి పెళ్ళిచేసుకున్నాడో తెలియని అయోమయ స్థితిలో పడిపోయినాడు.

"త్యాగీ—వచ్చినప్పుడు గ్రుక్కెడు కాఫీకూడా యివ్వలేని ఈ ఇంటికి ఎందుకు వస్తావో నాకు అర్థంకాదు...

సోదరులూ తండ్రీ భర్తా ఎవరూ లేని ఈ దౌర్భాగ్యురాలి మీద ఎందుకు నీకింత జాలి?"

సుమతి వేసిన ప్రశ్న అతనిని ఈ ప్రపంచములోనికి తీసుకువచ్చింది. కాని సమాధానం దొరకలేదు...దొరకని ఆ సమాధానపు తెరవెనకాల బరువుగా జరిగిపోయిన తన బాల్యం గుర్తుకు వచ్చింది అతనికి.

తను బాదమాకులు కోస్తుంటే సుమతి అవి వీరి బొత్తులు పెట్టేది. వినాయక చవితికి తను కలువపూలు తెస్తే ఇంటికి మోసేది - సవతితల్లి కొట్టిన దెబ్బలకి జడిసి తన దగ్గరకి పారిపోయివచ్చేది. తన తండ్రి చనిపోయి ఏడుస్తుంటే దగ్గరకి వచ్చి,

"ఊరుకో త్యాగీ, మా అమ్మ పోతే నేనేం చేశాను ? నయం, నీకు పిన్ని లేదు" అని ధైర్యం చెప్పింది. అదంతా మర్చిపోయి తను లీలని పెళ్ళిచేసుకున్నాడు. సుమతికి మహా ద్రోహం చేసిన సంగతి ఇప్పుడే తెలిసింది అతను - వణికి పోయినాడు. తను చేసిన పొరపాటుకి ఫలితంగా తన చిన్న నాటి ప్రియబాంధవి ఇప్పుడు ఇన్ని బాధలు పడుతున్నది. ఈ పాపానికిక నిష్కృతిలేదు.

"ఏమిటి త్యాగీ, ఆలోచిస్తున్నావు ?"

ఆమె ప్రశ్నకి త్యాగరాజులు సమాధానం చెప్పక ముందే ముసలి అత్తగారి పిలుపు విని లేచివెళ్ళింది సుమతి. అతనుకూడా ఆమె వెంటవెళ్ళి ఇద్దరు వృద్ధుల దగ్గరా కాసేపు కూర్చుని ఇంటిదారి పట్టాడు. పరధ్యానంలోపడి ఇల్లుదాటి

పది అడుగులు వేసి తిరిగి ఇంటికి వచ్చేసరికి లీల కుర్చీలో కూర్చుని ఘుమఘుమలాడుతున్నది. త్యాగరాజులు నిశ్శబ్దంగా మరో కుర్చీలో కూర్చుని బూట్లు విప్పుకోటం ప్రారంభించాడు.

"ఎక్కడికి వెళ్ళారు ?"

"సుమతిని చూడటానికి !"

లీల ఇంకేమీ ప్రశ్నించకుండా లేచి వెళ్ళిపోయింది. లీల తననూ సుమతినీ అనుమానిస్తున్నదని- తనకి ఇదివరకే తెలుసు. అయినా ఆ అనుమానం ఇదివరకు ఆహ్లాదాన్ని కలిగించేది; ఇప్పుడు అసహ్యాన్ని కలిగిస్తున్నది. అంతే భేదం.

బ్రతుకూ ఆలోచనలూ రెండూ బరువెక్కగా కుర్చీలోనే నిదురపోయినాడు అతను.

పతాక ఆవిష్కరణోత్సవం అయిపోయిన రెండు మూడు రోజులకి లీలా లలితా ఒకరినొకరు అభినందించుకోవటం ప్రారంభించారు.

"లీలా, నీవెంత చక్కగా చందాలు వసూలు చేశావంటే... చెప్పలేను" అన్నది లలిత.

"నీ కన్నానా ? నే నొప్పుకోను" అంది లీల మూతి సున్నాలాగా చుట్టి.

"నిజం లీలా నే నెప్పుడెళ్ళినా ఇన్ని చందాలు వసూలు కాలేదు. నువ్వూ నీ అందం... ఒక్కళ్ళుకూడా కాదనలేదు ఈ అందాల సీతాకోక చిలుకని చూచి."

"ఇందులో నే చేసిందేముంది ?"

"ఇందులో నువ్వు చెయ్యనిదేముంది- ఇన్నాళ్ళనుంచీ అనవసరంగా కాలం వృధాచేశావు - ఇప్పుడు చూడు ఎంత అందంగా ఆకర్షణీయంగా వున్నావో! నీలో చాలా మార్పు వచ్చింది లీలా" అన్నది లలిత.

ఆ మాటకి లీల నిట్టూర్చి "కాని ఇంట్లో మాత్రం శాంతిలేదు లలితా." అన్నది లీల - ఆ మాటకి లలిత ఖంగారుపడి;

"ఎందుకని? మీ ఇద్దరూ మాటా మాటా ఏమైనా అనుకోటంలేదుగద?" అన్నది.

"ఏం లేదుగానీ - నేనిలా హాయిగా ఉన్నందుకు దానికీ ఆయనకేవో చిరాకుగా ఉన్నట్టుంది-ఏదోలే పోనిద్దూ"

"ఇలాటివాటికి త్యాగరాజులుగారు వ్యతిరేకిస్తారను కోను. నీ జీవితాన్ని నువ్వు బాగుచేసుకుంటే మధ్యలో ఆయనకేమిటి బాధ?" అన్నది లలిత.

ఈ సంభాషణ పక్క గదిలోంచి వింటున్న స్వామి తనలో తనే నవ్వుకుని 'అతను వ్యాపారస్తుడూ బద్ధకస్తుడూ కూడా కాడు. ఆపైన మగవాడు' అనుకున్నాడు.

లలిత మళ్ళీ ప్రారంభించింది. "కొంతమంది చాలా విచిత్ర వ్యక్తులు లీలా! వాసిలీగారు తెలుసుకదూ? అతనూ అలాగే ఉండేవాడు. ఇంట్లోంచి భార్యని బయటికి రానిచ్చే వాడు కాడు. ఆవిడ వంటలక్కతో సమానం. పాపం ఆవిడ తెగించి నీలాగే బయటికి వచ్చినప్పుడు నానా ఆగం చేశాడు. ఇప్పుడు వాళ్ళేలా ఉన్నారో చూశావుకదూ! వాసిలీగారి

కంటే ఆవిడ సంపాదనే ఎక్కువ...అతను ఉత్త మామూలు పెద్ద గుమాస్తా!" అన్నది లలిత. లీల ఆశ్చర్యపోయి;

"మిసెస్ వాసిలీ ఎక్కడన్నా ఉద్యోగం చేస్తోందా ఏమిటి ?" అన్నది.

"నీకు తెలియదూ? మన సాంబులు దగ్గర ఉద్యోగం చేస్తున్నది. సాంబులుకి కావల్సిన పర్మిట్లూ అవీ ఆవిడే తెస్తుంది, చాలా తేలికైన ఉద్యోగంలే - నెల తిరిగేసరికి నాలుగైదొందలు చేతికి వస్తాయి." అని లలిత ఆవులిస్తూ జవాబు ఇచ్చింది.

"నాలుగైదొందలే !..... నెలకు నాలుగైదొందలు సంపాదిస్తున్నదంటావు-ఆవిడకి ఓనమాలు కూడా రావే !"

"నిజమే ! ఆవిడంత మొద్దవతారం సృష్టిలో ఎవరూ లేరు. అయితేనేమి? నాలుగుచోట్ల తిరిగి నాలుగుమాటలు నేర్చుకుంది. పెద్దతలకాయలతో పరిచయం ఉంది. వాళ్ళవలన ఏ పని కావాల్సినా చేయించగలదు."

"అదంతా తేలికకాదేమో లలితా"

"నిజంగా దానంత తేలికమరొకటి లేదు . అంతా అలవాటులో ఉన్నదనుకో. అయితే కొంతకాలం పడు తుంది. ఆ మాటకొస్తే సాంబులు పలుకుబడి వల్లనే పనిఅయి పోతుంది- ఆవిడ ఎక్కడకెళ్ళినా అతనిపేరు చెప్పగానే నిమి షాలమీద పని అయిపోతుంది — అంతగాకాకపోతే అతనే వెడతాడు- ఒక సంగతి చెప్పనా ! అలాటి మొద్దు వెడితేనే అయిపోయేపన్లు నువ్వెడితే ఇంకెంత తొందరగా అవు తాయో!"

లలిత అన్నమాటలకు నిట్టూర్చి,

"ఆఁ దానికంతటికీ అదృష్టమూ ఉండాలి, అవకాశమూ ఉండాలి" అన్నది.

"ఇప్పుడు నీకు అదృష్టమూ అవకాశమూ రెండూ వచ్చినయ్. నీకిష్టమైతే అలాంటి ఉద్యోగం. సరాసరి నీకాళ్ళ దగ్గరికే వస్తుంది. ఈ గడ్డురోజుల్లో నాలుగైదొందలంటే మాటలుకాదు. కాస్త మనదేశంలో ఆడవాళ్ళు పిల్లల్ని కనడం మానేసి ఆలోచిస్తే బాగుంటుంది. అదే ఇతరదేశాల్లో అయితే ప్రతి స్త్రీ ఏదో ఒక పనిచేస్తుంది. దానివల్ల హాయీ ఉంది, ఆదాయమూ ఉంది."

"నువ్వన్నది నిజమే. రిబ్బను ముక్కకి అర్ధణా కావాలంటే మొగుడిని అడగటం తప్పుతుంది" అన్నది లీల.

"సాంబులుకి నువ్వంటే తగని అభిమానం. నీవు నిశ్చయం చేసుకుంటే రేపీపాటికి నాలుగొందల రూపాయల జీతంతో నీకు ఉద్యోగం వస్తుంది ... టెలిఫోను మ్రోగుతున్నట్లుంది. ఇప్పుడే వస్తాను" అని అవతల గదిలోకి వెళ్ళింది లలిత.

లీల ఆలోచనలో పడింది. ఆడది ఉద్యోగం చెయ్యటం అనేది తన భర్తకి ఇష్టమే. ఉద్యోగం చేసే సుమతిని ఆయన ఎప్పుడూ పొగుడుతూ ఉంటారు. జీవనానికి పరమార్థం సుఖం. సుఖపడాలంటే డబ్బు ఉండాలి. ఆ డబ్బు మన కింత తేలికగా లభించేమార్గం లలిత సూచించింది—కృతజ్ఞతతో లీల మనస్సు నిండిపోయింది. లలిత రాగానే థ్యాంక్స్ చెప్పి;

"మరి నేను వెడతాను; చీకటి పడిపోయింది" అన్నది.

"సరే, కారులో వెళ్ళు-నీకోసం ఉంది కారు."

"అలాగే"

"టా టా"

"బై బై"

కారులో కూర్చున్న లీలకి ఆ కారు తనదైతే బాగుం ననిపించింది. మెత్తని ఆసీట్లమీద సిల్కు చీరెతో కూర్చుని తను ఏ దేవలోకానికో ఎగిరిపోతున్నాననుకుంది. ఆమె కారు దిగి వాకిట్లో అడుగు పెట్టగానే - త్యాగరాజులు పిలిచాడు.

"లీలా, బాంక్ ప్యాస్‌బుక్ చూశావా? తొమ్మిదివంద లకీ మూడు వందలే ఉన్నాయేమిటి ఆంధ్రాబాంక్‌లో?" అని సౌమ్యంగానే అడిగాడు. అయినా లీల భయపడింది. ఆ భయాన్ని సాధ్యమైనంతవరకు కప్పిపుచ్చుకోవాలని ప్రయ త్నిస్తూ;

"అవును ఖర్చు అయినాయి" అన్నది.

"ఆరువందల రూపాయలు ఖర్చా?"

"పాప పుట్టినరోజు పండగకి అయిపోయినాయి. ఏవో గుడ్డలూ అవీ కొన్నానుగాని అనవసరపు ఖర్చు నేనేం చెయ్యలేదు."

లీల సమాధానానికి తలపట్టుకుని కుర్చీలో కూర్చుండి పోయినాడు త్యాగరాజులు. కొన్ని క్షణాలయినాక;

"ఆ డబ్బు మా చెల్లెలి పెళ్ళికి దాచానని నీకు తెలి యదా లీలా?" అన్నాడు.

"బాగుంది. ఖర్చు వచ్చినప్పుడు బ్యాంకునుంచి తీయొద్దా ? జీతం ఒక్కటి చాలదాయె"

"లీలా జీతం సంగతి నీ కనవసరం" అని కర్కశంగా అన్నాడు త్యాగరాజులు. లీలకూడా రెచ్చిపోయి;

"ఏం ? అందులో ఏం తప్పుంది ? మీ జీతంతో బ్రతకలేమని మీకు తెలియదా ?" అన్నది.

"మనం అదివరకు అదే జీతంతో బ్రతుకుతూ ఉండే వాళ్ళం అన్న సంగతి మర్చిపోకు."

"మర్చిపోలేదు — ఆ లీల వంటయింటి కుందేలు గనక మీరు పెట్టింది తిని పడిఉంది."

"లీలా!"

"అబద్ధమా ? యీ పాడుకొంపలో ఏ ఒక్క అవసరం తీరకుండా వెధవ బ్రతుకు బ్రతికాను."

"పాడుకొంప ... ఒకప్పుడు ఈ పాడుకొంపే స్వర్గధామం"

"కావచ్చును. ఇప్పుడు కాదు కనుకనే నేను బ్రతకలేకపోతున్నాను. నా సంగతి నేను ఆలోచించుకోగలను."

త్యాగరాజులుకి ఎంత అణుచుకుందామన్నా కోపం ఆగలేదు.

"అవును. నీవేం ఆలోచిస్తున్నావో ! ఏం చేయబోతున్నావో నాకు బాగా తెలుసు ... ఈ పెదిమలకి రంగూ ఈ నైలాన్ చీరల శృంగారం..."

అతని మాట పూర్తి కాకుండానే "మిస్టర్ ఆ సంగతి మీ కనవసరం" అని అరిచింది లీల.

"ఇప్పుడు నీ కంఠస్వరంకూడా చురుగ్గానే ఉందిలీలా! లీలా! ఒకమాట అడుగుతాను కోపం తెచ్చుకోకు... నీస్నేహం తప్పుదారిన నడిచే మనుష్యులతోనా !" అన్నాడు త్యాగ రాజులు శాంతం తెచ్చుకుంటూ.

"ఆ తప్పుదారినపోయే మనుష్యులే మీకన్న నన్ను అభిమానిస్తున్నారు. లలిత పండల ఖరీదుగల చీరలు బహు మానం ఇచ్చింది. నే నెక్కడికి వెళ్ళాలనుకున్నా దానికారు సిద్ధంగా ఉంటుంది."

"అవి బహుమానాలు కావు"

"మరేమిటి ?"

"కూలి ఆయాలకీ డ్రైవర్లకీ భాగ్యవంతులు అలాగే టాక్స్ ఇస్తారు- అలాగే వాళ్ళచుట్టూ తిరిగేవాళ్ళకి కూడా - ఇస్తారు"

"అయితే ఇప్పుడు నేను వాళ్ళల్లో దానిని కాదం టారు - చూడండి ఇస్తేవాయినం పుచ్చుకుంటే వాయినం. నేనూ ఇస్తాను"

"నీవు ఇస్తావా ! ఎలా ఇవ్వగలవు!"

"ఎలాగా! ఎలా ఇవ్వగలవు' అని మీ ప్రశ్న. అంతేనా! మీరు ఇవ్వరు. ఇచ్చినా నేను దమ్మిడీకూడా పుచ్చుకోను. ఉద్యోగం చేస్తాను. అంతగా కాకపోతే నగలు అమ్మేస్తాను" అని ఉడుకుమోతుతనంగా జవాబు చెప్పింది లీల.

త్యాగరాజులు సిగరెట్టు వెలిగించి అతి తాపీగా "మొదట నగలమ్మివేస్తావు. తరువాత చీరలు, ఆపైన ఇల్లు! ఆ తరువాత నీ గౌరవం నా గౌరవం."

"ఇక ఆపండి. లేకపోతే ?..." అరిచింది లీల.

"లేకపోతే ?... మాట్లాడు లీలా; లేకపోతే ఏమిటి ? నన్నువదలి పోతానంటావు - అంతేనా ? ఇప్పుడు మాత్రం నీకెవరు అడ్డుపడ్డారు... నీవు కట్టిన చీర ఇతర్లది - నీ మనను లలిత ఇంటి తలుపువద్ద తారట్లాడుతున్నది - నీ అంతర్యాం సాంబులతో పార్టీలకి తిరగటానికి తాపత్రయ పడుతున్నది."

"కొంచెంసేపు ఊరుకోండి బాబూ, మీకు నమస్కారం చేస్తాను."

"ఊరుకోవటం...సరే అలాగే ఇక నేను చెప్పటానికి ఏమీలేదు...ఆలోచించుకో, సుమతి మామగారు పోయి నారట. మరి నేను వెడతాను" అని లేచాడు త్యాగరాజులు. లీల వ్యగ్యంగా నవ్వుతూ "ఓహో" అన్నది.

"ఏమిటి ?"

"ఆవిడ గారికి ఇవ్వటానికన్నమాట పాస్ బుక్ చూశారు."

"అవును"

"నేను చీరలుకొంటే మీకు నచ్చలేదు. ఆమెకి ఇవ్వటానికి నచ్చింది-అంతేనా ?"

"నీలాగా రంగులకీ చీరలకీ కాదు...మామగారి అంత్యక్రియలకు...సరే నీకు అర్థంకాదులే"

త్యాగరాజులు వెళ్ళిపోయిన తరువాత లీలకు అత నంటే కలిగిన అసహ్యం మరీ ఎక్కువయింది - తండ్రి చెపితే వినకుండా ఇతన్ని పెళ్ళిచేసుకున్నందుకు తనకీశాస్తి

కావాల్సిందే — "డబ్బులోపుట్టి డబ్బులో పెరగటంవలన నీకు డబ్బు విలువ తెలియటంలేదు ఇప్పుడు. కాని ఒకానొక రోజున ఈ ప్రపంచంలో అన్నిటికన్న ముఖ్యమైనది డబ్బు అని గ్రహిస్తావు" అన్నాడు తన తండ్రి. ఆ ఒకానొకరోజు ఇప్పుడు వచ్చింది.

ప్రపంచంలో అన్ని సుఖాలకీ మూలం డబ్బేననే సంగతి ఇప్పుడు తను గ్రహించ కలిగింది... కాని... ఆమె ఆలోచన పూర్తికాకుండానే సాంబశివరావు ఆ గదిలోకివచ్చి;

"హలో పార్టనర్" అన్నాడు.

"అదేమిటి?"

సాంబులు వస్తూనే అన్న ఆ మాటకి అర్థం తెలియక ఎదురు ప్రశ్నించింది లీల.

"పార్టనర్ అంటే భాగస్వామి... మనిద్దరం ఇవ్వాల్టి నుంచీ భాగస్వాములమని" అన్నాడు సాంబులు పేముకుర్చీ ముందుకు లాక్కొని కూర్చుంటూ.

"భాగస్వాములం... ఎల్లా?"

"ఏముంటుందీ, మామూలే. ఇతర్ల ఆదాయంలో నేనెలా భాగస్వామినో నా ఆదాయంలో మీరూ అలాగే భాగస్వామి అవుతారు. మరి కాంట్రాక్టు వ్రాసుకుందామా?"

"నాకేం అర్థం కావటంలేదు సాంబులుగారూ"

"అర్థం కానిది ఏముంది శ్రీమతి జీ! లలిత అంతా తరువాత చెప్తుతుంది. ముందు మీరీ కాగితంమీద సంతకం దయ చేయించండి"

"ఏమిటిది? అయిదువందల రూపాయల జీతమా? నేనేం పనిచేయాలి!" ఆశ్చర్యపోయింది లీల.

"వ్యాపార విషయాలు చూస్తూ ఉండాలి"

"వ్యాపార విషయాలు నాకు తెలియవు మిస్టర్ సాంబులూ" అన్నది లీల గాభరాపడుతూ. ఆ మాటకి సాంబులు చిరునవ్వు నవ్వి లాలనగా,

"ఈ ప్రశ్న ఒక జంతువుకి వేస్తే బాగుండేది, శ్రీమతిజీ ఫ్రెంచి ప్రేమ కథల్లో పగడాల పెదవుల రాజకుమారి..."

లీల ఒక విధమైన ఇంగ్లీషు సినిమాల స్వప్నలోకంలో జీవిస్తూ ఉంటుందని ఏనాడో గ్రహించిన సాంబశివరావు సరి అయిన టంకం అతికాడు. అది సరిగ్గా సరిపోయిందికూడా. ఆ మాటతో లీల పగలబడి నవ్వుతూ,

"మీరు తమాషా మనుషులు" అంది.

"అయితే ఆయాను. ఇప్పుడయినా ఈ రాజకుమారి ఈ దీనుడిని అనుగ్రహించి కాగితంమీద సంతకం పారేస్తే ధన్యుడిని అవుతాను"

"లేదు బాబూ, నాకు వ్యాపారం తెలియదు. సంతకం ఎలా చేయను!" అంది లీల మళ్ళీ మొదటి కొచ్చి.

సాంబులు కొద్దిగా విసుగు నటిస్తూ "అయ్యబాబోయ్ మీ కెలా తెలియచెప్పటం? ఈ పురుషుల ప్రపంచంలో అందమైన ఆడపిల్ల ఏ విషయమూ నేర్చుకోవాల్సిన అవసరంలేదు. ఇంత చిన్న విషయమే మీకు తెలియదు శ్రీమతిజీ... ఒక్క చిరునవ్వుతో మరొక కంటి చూపుతో వేరొక పెదవి విరు

పుతో సర్వ ప్రపంచాన్ని పాదాక్రాంతం చేసుకోగలదు స్త్రీ.
అదీకాక ఆమెకంటి ఎరుపు..."

"చాలు చాలు ఇంకా మీరిలా పొగిడేస్తూఉంటే నాకు కోపం వస్తుంది." అన్నది లీల పొంగివచ్చే సంతోషాన్ని ఆపుకుంటూ

"వద్దు వద్దు. కోపం తెచ్చుకోకండి ... దయచేసి ఈ కాగితం మీద మాత్రం సంతకం పెట్టండి."

"మిస్టర్ సాంబులూ ... నిజంగా నిర్మొగమాటంగా చెప్పాలంటే వ్యాపారం అంటే నాకు కొంచంకూడా తెలియదు - ఆపైన మా వారితో ఆలోచించికుండా ఏ పనీ చెయ్యను." ఖచ్చితంగా సమాధానం చెప్పింది లీల. సాంబశివరావు దారి మార్చుక తప్పలేదు.

"బాగుంది మీవారితో ఆలోచించవద్దని నేనన్నానా! మీ కిష్టం అయితే నేనే ఆయన అంగీకారం తీసుకుంటాను" అన్నాడు,

"వద్దు వద్దు. ఈ విషయంమీద మీరాయనతో మాట్లాడటం అంతమంచిది కాదు. ఆయన ఇష్టపడరు."

"ఏమిటి ఇష్టపడరు ? నన్నా కాదుగదా !"

"అదికాదు. కమీషన్లూ లంచాలూ ఆయన ఇష్టపడరు."

సాంబశివరావు నిట్టూర్చి "అది తెలుస్తూనే ఉంది. ఈ చీకటి గదీ, ఈ కంటి కుర్చీలూ ఇవే చెపుతున్నాయి ఆ సంగతి ... అతని స్వభావం చూస్తే త్వరలోనే శృంగేరీ సాములవారిలా మారేట్టుంది." అన్నాడు.

లీల నవ్వి "మీరు ప్రతి విషయం చాలా తేలికగా తీసుకుంటారు" అంది.

"నేను ఏ విషయాన్ని గురించి నవ్వుతానో ఆ విషయమే అన్నిటికంటే ఎక్కువగా నన్నేడిపిస్తుంది .... అది సరే, మీవారికి ఈ నిజాయితీ జబ్బు ఎన్నాళ్ళనుంచి శ్రీమతీజీ" అన్నాడు సాంబశివరావు యాష్ట్రే ముందుకు లాక్కుంటూ.

"అదొక ఆదర్శం అని ఆయన నమ్మకం."

"ఈ ప్రపంచంలో నాలాటి వాడికి ఆదర్శం ఒకటే.. అదేమిటంటే ? తను జీవించటం; ఇతర్లని జీవింపచేయ్యటం- నిజం చెప్పాలంటే త్యాగరాజులు గారికి బ్రతకటం తెలియదు. బ్రతుకు పడవ ఈ జీవనస్రవంతిలో నడుపుకుంటూ పోతున్నప్పుడు - తన పడవమీాద ఎంత వస్తుందో ఆలోచించాలిగాని - ఇతర్ల పడవలకి లాభమేంవస్తోందో; చిల్లులే ఉన్నాయో అని ఆలోచించడంకుద్ధ తెలివితక్కువా అనవసరమూనూ" సిగరెట్ పొడి విదుపుతూ అన్నాడతను.

"ఆయన అనేదేమిటంటే; ఎంతకాలమయితే ఈ అన్యాయం ... ..." లీల మాట పూర్తిగానివ్వలేదు.

"అంటే మీరుకూడా తాస్తూకూస్తూ ఆదర్శపు మస్తు మందు సేవించారన్నమాట శ్రీమతీజీ! అబద్ధాలు చెపితే ప్రాణం పోతుందనేది మీవారి ఉద్దేశ్యం అయితే ఇప్పటి కెప్పుడో నా ప్రాణం పోయి ఉండేది. మీవారి ఆదర్శం బాగానే ఉంది కాని జీవితంలో అతనేం అనుభవిస్తున్నాడు!

నాకేం తక్కువయింది ? అసలు సంగతి ఆలోచిస్తే నేనున్న చోట ఆనందం దీపకళికలా వెలుగుతూ ఉంటుంది. ఇందుకు మీరు నన్ను అసహ్యంగా చూచుకోగలరా చెప్పండి!" అన్నాడు సాంబశివరావు.

"లేదు ...నాఉద్దేశ్యంకూడా అదే. కాని ఆయనే..." అన్నది లీల పమిటకొంగు వేలికి చుట్టుకొంటూ.

"మీకు తెలుసా శ్రీమతీజీ ... మూడు తరాలనుంచి మా తాతలూ తండ్రులూ గౌరవంకోసం, ఆదర్శంకోసం సర్వస్వం పోగొట్టుకున్నారు. చివరకి గౌరవాదర్శాలు గంజి కూడా పొయ్యలేకపోవటం వలన ఆకలితో చచ్చారు. దాని వలన ప్రపంచంలో వస్తుందని వారనుకొన్న మార్పు ఏ కొంచెమూ రా లేదు-నేను మిగిలాను. ఆదర్శగౌరవాలలోనూ మా తండ్రి చితిలోను నా ఆత్మని తగలేసి విజయవాడ వచ్చేశాను. అలా వచ్చేసినందుకు నే నెన్నడూ విచారపడ లేదు – గౌరవాదర్శాలజోలికి మళ్ళీ నేను పోలేదు. ఆత్మను పోగొట్టుకోవడం మరేం ప్రమాదం కాదు శ్రీమతీజీ. కేవలం టాన్సిల్స్ ఆపరేషన్ చేయటం లాంటిది" అని నవ్వాడతను.

"నాకు అర్థమయింది సాంబశివరావు గారూ! మా నాన్నకూడా ఒక జడ్జీ. మా ఇల్లుకూడా ఒక రాజభవనంలా ఉంటుంది. ఆయనే ఈ ఆదర్శం పెట్టుకుంటే మేం ఆ రాజ భవనంలో ఉండగలిగేవాళ్ళం కాదు ........ కాని నేనేం చేయను ! నిస్సహాయురాల్ని" నిట్టూర్చింది లీల.

"నేను మీకు ఉద్యోగం ఇచ్చినంత మాత్రం చేత అది త్యాగరాజులుగారి గౌరవానికి ఎలాభంగం కలిగిస్తుందో నాకు అర్థం కావటంలేదు....... అదీకాక ఆయన ఆదర్శాల లాటివి నేనూ ఆలోచిస్తూ కూర్చుంటే మీకు అయిదువేల రూపాయలు ఇవ్వగలిగేవాడిని కాదు"

"అయిదువేలా ! ఎందుకు !" ఆశ్చర్యంతో అడిగింది లీల.

"ఎందుకంటే త్యాగరాజులుగారు అంగీకరించనిపని కోసం. త్యాగరాజులుగారు ఈ మధ్య ఒక వ్యాపారస్తుడి ఎకౌంటు పుస్తకాలు పట్టుకున్నారు. దురదృష్టవశాత్తూ ఆ పుస్తకాలతోపాటు ఒక నోటు పుస్తకంకూడా వచ్చింది. అందులో అతనికి ఒక గౌరవనీయురాలు వ్రాసిన ప్రేమ లేఖలూ అవీ ఉన్నాయట ....... ఇప్పుడు మీరు ఆ నోటు పుస్తకం నా కివ్వబోతున్నారు. కనుక అయిదువేలూ మీకు బహుమానం" ఆలోచించుకునే అవకాశం ఇవ్వలేదు అతను.

"ఎప్పుడు పట్టుకున్నారు ? నిన్ననా ?"

"అవును."

"అవి లోపల ఉన్నాయనుకుంటాను." లోభం ఆమెను లోపరుచుకుంది.

"త్యాగరాజుగారికి ఆ నోటుపుస్తకం సంగతి తెలియదు. అది నాకిచ్చి అయిదువేలూ తీసుకున్నందువలన ఏ ప్రమాదమూ రాదు సరిగదా; ఒక ఇల్లాలి కాపురం నిలబెట్టిన వారవుతారు."

"ఆయనకిది తెలిస్తే ఊరుకోరు... మీకు లాభం ఉంటే లోపలికి వెళ్ళి వెతుక్కోండి"

"నాకు లాభం ఏమిటి? నా కమీషన్ నాకు రాందే చిట్టికెన వేలు కూడా కదల్చను. మీరూ నాలాగే మీ కమీషన్ తీసుకోవచ్చును."

"నేనా... సరే ముందు మీరు వెళ్ళి వెతుక్కోండి" అన్నది లీల.

ఎందుకో ఆమెకు భయంవేసి ఒళ్ళంతా చెమటలు పట్టినాయి. నేను అపరాధంచేయటంలేదుగదా అనుకుని కాదని సరిపెట్టుకుంది ఆమె. ఏ క్షణాన్నయినా భర్త రావచ్చును. అంతలో ఈయన వెతుకుడు పూర్తికాదేమో! సాంబులు ఆమె భయాన్ని పసికట్టాడు.

"సరే అదలా ఉంచండి - అసలు మీకే ఈ వ్యవహారం అంత ఇష్టం లేదనుకుంటాను-అవునా ?" అన్నాడు.

"అయినా అయిదు వేల రూపాయలు నేనేంచేసుకోను"

విజయ గర్వంతో నవ్వాడు సాంబులు "భలే ప్రశ్న! అయిదు వేలతో ఇంతకన్న మంచి ఇల్లు అద్దెకి తీసుకోవచ్చును, చీరలు కొనవచ్చును - నెక్లెసులు-ఉంగరాలు"

"ఇవి ఆయనకు తెలియకుండా ఎలా దాయటం !"

"అందులో కష్టం ఏముంది ? అయిదు వేలూపెట్టి ఒక ముత్యాలహారం కొంటేసరి - మీరు రోజూ వేసుకోవచ్చును. త్యాగరాజులుగారు అడిగితే నకిలీ ముత్యాలహారం అని చెప్పవచ్చును, ఎందుకంటే; వాటికీ వీటికీ అట్టే తేడా ఉండదు కనుక."

"నిజంగా మీరు చాలా తెలివైనవారు"

"ఈ పాడు ప్రపంచంలో బ్రతకాలంటే విషానికి విరుగుడుగా విషాన్నే ప్రయోగించాలి శ్రీమతీజీ"

"సరే కానివ్వండి నేను ఇక్కడే ఉంటాను. మీరు త్వరగావెళ్ళి ఆ నోటుపుస్తకం వెతికి తెచ్చుకోండి."

"అచ్ఛా, శ్రీమతీజీ"

అయిదునిముషాలు అయిదుయుగాలుగా గడిచినాయి లీలకి. భయం_అభిమానం - ఆవేదన—అంతర్యంలో సంకుల సమరం—స్తిమితం... ఆ అయిదునిముషాలలో నిముషాని కొకటి చొప్పున ఆమెను ఆవేశించినాయి.

"హాలో పార్ట్‌నర్! నోటు పుస్తకం తీసుకువచ్చాను" అని కుర్చీలో కూర్చుని జేబురుమాలతో నుదురు అ కున్నాడు సాంబశివరావు—ఓడికొలోనా వాసన గుప్పుమ

"మిస్టర్ సాంబులూ, మీరు ఆ నోటుపుస్తకం కున్నందువల్ల వారికేం ప్రమాదం లేదుకదా!" బిక్క మొ అడిగింది లీల.

సాంబులు విరగబడినవ్వి "ప్రమాదం!... ఎందుకు, ఈ నోటుపుస్తకం ఇక్కడ ఉంటేనే ప్రమాదం వచ్చేది. ఇప్పుడు త్యాగరాజులుగారికి తలనొప్పి తగ్గింది. మరి మీ భాగం సంగతి?" అన్నాడు.

"తరువాత తీసుకుంటాలెండి" అంది లీల బరువు తగ్గినట్లు భావిస్తూ.

"ఎప్పుడు?"

"లలిత వివాహవార్షికోత్సవంకదూ, రేపు వారికి రెండు మంచి ఉంగరాలు కొనితెచ్చి పెట్టండి."

"విత్ ప్లెజర్ ... మరి నా కమీషన్ సంగతి ఏమిటి?"

"అది మీ పెళ్ళికి బహుమానం"

"భేష్ మరి కాంట్రాక్టు సంగతి? సంతకం చెయ్యాలా?"

ఆ విషయం తరువాత చెబుతాను" అన్నది లీల.

ఏక్షణంలో భర్త వస్తాడో అనేభయం ఆమెను వేధిస్తున్నది. సాంబులు ఇంక తర్కించకుండా వెళ్ళిపోయినాడు.

ఆమె అనుకున్నట్టుగా—ఆరోజు మరునాడుదయమూ కూడా త్యాగరాజులు రాలేదు. ఆసాయంత్రం లేతఆకుపచ్చ రంగుచీరలో పసిడి పడుచులా అలంకరించుకొని లలిత ...హ వార్షికోత్సవానికి వెళ్ళింది లీల. ఆమెనుచూచి ...బా బయటికివచ్చి, "ఓ లీలా... ఎంత అందంగా ...వ్?" అన్నది లలిత.

లీలనవ్వి "కాని మధ్యలో ఆపకు, చివరిదాకా పొగిడే...్" అన్నది.

"ఎందుకూ ఆపటం ఎంత బాగున్నావో తెలుసా? ఇంత అందమైన ఈచీర బ్లౌజు ... ఎంత బాగున్నాయి ... చెప్పలేను"

"నిజంగానే?"

"నిజంగానే ... అద్భుతం. యీకొత్తడిజైను నీవెక్కడ కొన్నావు?"

"నేను కొనలేదు- ఒకపెద్దమనిషి బహుమానం"

ఆ పెద్దమనిషెవరో చెప్పు - నేనుకూడా అడుగుతాను"
అంది లలిత గ్రహించినట్లు నటిస్తూ.

"ఇలాటి పన్లుచేసేది కేవలం ఒకానొకవ్యక్తిమాత్రమే
మన కమిషన్ ఏజెంటు"

"ఎవరు సాంబశివరావా?"

"అవును!"

"సాంబులుది బలేమంచి టేస్ట్"

"అవును మీ వివాహవార్షికోత్సవానికి అభినందిద్దా
మని వస్తే ఏవేవో కబుర్లలో పెట్టావు... స్వామి ఎక్కడ?"
అన్నది లీల నవ్వుతూ.

"ఎక్కడో కునికిపాట్లుపడుతూ ఉంటారు — ఎక్కడ
ఉన్నారో చూద్దాంపద... త్యాగరాజులుగారు రాలేదేం?"

"అనుకోకుండా కమీషనర్‌తో టూర్‌కి వెళ్ళాల్సి
వచ్చింది" అబద్ధం ఆడేసింది లీల.

మేడమీదకూర్చుని సిగరెట్ కాలుస్తూ కునికిపాట్లు
పడుతున్నాడు స్వామి.

"స్వామీ...స్వామీ..." అంది లలిత. ఆపిలుపులో
రెండుఅర్థాలు—ఒకటి అధునాతనులు పేరుపెట్టి పిలుస్తున్న
దని ఆమె నాగరికతకి సంకోచిస్తారు—రెండు ప్రాచీనులు
స్వామిఅనీ పౌరాణిక చలనచిత్రాల్లో నాయికలాగా పాతి
వ్రత్యం వెలగబెడుతున్నదని ఆనందిస్తారు.

ఆ పిలుపుకి తలతిప్పిచూసి "ఏమిటి లక్కీడార్లింగ్"
అన్నాడు స్వామి.

"అతిథులంతా వచ్చేస్తున్నారు. ఇంకా మీరు కునికి పాట్లు పడుతున్నారు— లీల మనల్ని అభినందించటానికి వచ్చింది."

"అప్పుడే! అయిదు వార్షికోత్సవాలు అయినా గడవాలి. హెన్రీఫోర్డు ఇరవయి అయిదవ వివాహవార్షికోత్సవంలో ఎవరో అతిథి ... మీ కళ్యాణం ఇంత సక్సెస్ కావటానికి కారణం ఏమిటని అడిగాడట ... ఫోర్డు నవ్వుతూ ఏముంది కార్ల తయారీలో అనుసరించిన పద్ధతే ... ఒకే మోడల్‌ని అంటిపెట్టుకుని ఉండటం అని జవాబు చెప్పాడట" అని తన హాస్యానికి తనే ఆనందిస్తూ తిరిగి కళ్ళు మూసుకున్నాడు స్వామి.

"బాగుంది ధోరణి. లీల మనల్ని అభినందిస్తున్నది" అన్నది లలిత.

లీల నవ్వుతూ "ఇదుగో మీ ఇద్దరికీ చిన్న బహుమానం" అని ఉంగరాలు వారికి ఇచ్చింది.

స్వామి కళ్ళు తెరచి ఉంగరాన్ని అందుకుని "ఓ చాలా సంతోషం" అన్నాడు.

"ఏమిటి లీలా, ఏదీ చూడనీ ... అబ్బ ఎంత బాగున్నాయి ఈ ఉంగరాలు" అని మురిసిపోయినట్లు నటించింది లలిత. అలాటివి ఆమెకి చాలా ఉన్నాయి.

"ఇందులో రాళ్ళు చాలా ఖరీదుగలవి" అన్నాడు. స్వామి ఉంగరాన్ని అటూ ఇటూ తిప్పుతూ.

"స్వామీ, మా లీల ఎంత అందంగా ఉందో దాని బహుమానం కూడా అంతే అందంగా ఉంది" అని ఒక చెణుకు విసిరింది లలిత.

"అవును మిసెస్ త్యాగరాజులూ, మిమ్మల్ని అభినందించనీయండి. మీరు చాలా అదృష్టవంతులైనవారు" అని కళ్ళు మూసుకునే అన్నాడు స్వామి చిరునవ్వు నవ్వుతూ.

లీల నవ్వుతూ "బాగుంది. మళ్ళీ ఇద్దరూ మొదటికి వచ్చారు" అన్నది. ఇంతలో సాంబశివరావు హడావిడిగా ప్రవేశించి—

"లలితా నేను తొందరగా వెళ్ళాలి, ఇది తీసుకో." అన్నాడు కంగారు పడిపోతూ.

"ఇదుగో, ఈ దేశద్రిమ్మరి దయచేశాడు." అన్న లలిత.

"లలిత ఇవాళ ఎందుకో అసూయగా కనపడుతున్నది. దైవం రక్షించుగాక" అని రెండు చేతులూ మోడ్చాడు, సాంబులు.

"మళ్ళీ మొదలు - రా లలితా మనం వెళ్ళిపోదాం" అన్నది లీల పెదవులు మొగ్గలాపెట్టి.

"లలితా ఆమెను తీసికెళ్ళకు. రెండు చేతులూ దరవాజాకి అడ్డంగా సాచి, మా ఇద్దరిమధ్యావచ్చిన వివాదం తీర్చిందే మాత్రం తీసికెళ్ళకు" అని గంభీరంగా అన్నాడు సాంబులు.

లలిత నవ్వుతూ "ఏం వివాదం ?" అన్నది.

"వ్యాపార సంబధమైన వివాదం. ఆవిడ కనుక నాకు సహాయం చెయ్యకపోతే నన్నూ, నా వ్యాపారాన్ని కుక్కలు కూడా వల్లవు"

ఓహో, జ్ఞాపకం వచ్చింది. అయితే లీలా, నీవెందుకు అతని దగ్గర పనిచేయనన్నావు ? రెండురోజులనించీ చెపుతున్నాడు" అన్నది లలిత గంభీరంగా మొహంపెట్టి.

"కారణం ఏమిటో కూడా ఆయనతో చెప్పాను." అన్నది లీల దిగులుపడుతూ.

"ఆ మహాకారణం నాకు కూడా చెప్పుతల్లీ - నీకు పని చేయటం తెలియదా ? త్యాగరాజులుగారు ఏమయినా అభ్యంతరం పెట్టారా ? ఇంకా ఏమయినా మరోకారణం ఉన్నదా ?... పని చేయటం తెలియకపోతే సాంబులు నేర్పుతాడు. త్యాగరాజులుగారి సంగతి నాకు వదిలేయి. సరేసాంబులూ, పార్టీ అయినాక నీ కంట్రాక్టుమీద తప్పకుండా సంతకం చేస్తుంది లీల-ఇక, సరేనా! ఇక మమ్మల్ని వెళ్ళనీ !" అన్నది లలిత.

"థేంక్స్ లలితా ! ఇద్దరూ వెళ్ళవచ్చును" అని గుమ్మానికి అడ్డుపెట్టిన చేతులు తీశాడు సాంబశివరావు.

"ఇద్దరమూ వెళ్ళక లీలను నీకు వదులుతా ననుకున్నావా ! పాపం ఎంత ఆశ" ! అన్నది లలిత నవ్వుతూ, మేడమెట్లు సాంతం దిగకుండానే.

"లలితా ఎందుకిలా చేశావు !" అన్నది లీల.

"ఏం ? నీకు డబ్బు అక్కరలేదా ? అయిదువందల రూపాయలంటే మాటలుకాదు. మీ ఆయన ఆదాయంతో

ఇవి కూడా కలిస్తే వేడినీళ్ళకు చన్నీళ్ళుగా మరింత సుఖపడ తారు. జన్మ అంటూ ఎత్తినాక ఉండటానికి మంచిఇల్లూ కార్లూ నౌకర్లూ వంటమనిషీ ఉండకపోతే ఎందుకు బ్రతికి! ఇక నువ్వీ వంటపని మానెయ్యాలి. ఆలోచించి చూడు- ఆ వాతావరణంలోంచి నాలుగురోజులు బయటికి రాగానే నీ మొహంలో ఎక్కడలేని కళా వచ్చింది. స్వామికూడా ఎంతో మెచ్చుకున్నారు. నీలాటి చదువుకున్న ఆడవాళ్ళు ఆఫీసులో పని చెయ్యకపోతే - పల్లెటూరిపిల్లలు వచ్చి చేస్తారనుకుంటున్నావా!"

"కాని ఆయన..."

"ఆయన ... ఏమిటి ఆయన? ఏం మనుషులురా బాబూ, ఆదాయం వస్తున్నా అర్థాంగినిపనిచేయనీయరుగదా! వాళ్ళు మాత్రం బాగానే ఉంటారు. భార్యలకష్టం వాళ్ళకెందుకు! యీ బంధంనుంచి విడిపించుకునే హక్కు మనకు పూర్తిగా ఉంది లీలా" అన్నది ఉద్రేకంగా లలిత. ఆ చెప్పే పద్ధతి చూస్తే ఒప్పుకోవాలనిపిస్తుంది ఎవరికైనా. లలితలో అది ప్రత్యేకత. కొందరు కొందరు ప్రకృతినించి కొన్ని వరాలు తెచ్చుకుంటారు - లలితకూడా ఒక వరం తెచ్చుకుంది. ఆ వరం బాగా మాట్లాడటం. కాని లీలబెంగ ఇంకా తీరలేదు.

"అది సరే, సాంబులుతో పనిచేయుడానికి ఆయన ఒప్పుకోరు మరి" అన్నది.

"సాంబులుతో పనిచేస్తే ఆయనకేమిటి మధ్యఅధ్యం తరం! ఒక్క కేసు తెచ్చినా దానిమీద అతనికి పాతికవేలు ఆదాయానికి తక్కువ ఉండదు. సాంబులు వెర్రివాడు కాదు"

"నీవు చెప్పింది నిజమే. అతను బిజినెస్‌మాన్ - ఆ సంగతి నాకూ తెలుసు."

"అంతేకాదు. ఇచ్చిపుచ్చుకోడాల్లో మహోఖచ్చితం. నా చిన్నకారు ఉంది చూడు- అది అతను ఇచ్చిందే, కమీషన్ కింద"

"లీల ఆశ్చర్యపోయి కారు కమీషనా ?" అన్నది.

"అవును. అతను చెప్పిన పనేదో చేశాను—మర్నాటి సమయానికి మా యింటిముందు కారు ఉంది. కావాలంటే అతని గుమాస్తాకూడా కారుకొనగలడు... పిచ్చిదానా, అతని దగ్గర నువ్వెంతపైకి వస్తావు?" అని లీల తల ప్రేమగా నిమిరింది లలిత—లీల యిక లొంగిపోక తప్పలేదు.

"ఇదంతా నీ ఉపకారమే లలితా" అన్నది.

"నో...నో మరీఅంత యిదిగా అనకు; పదపోదాం" అని లీల భుజంమీద చెయ్యివేసింది లలిత.

ఆ జవరాళ్ళ చెంగావికొంగుల కళకళలు కన్నుల్కి జిగేలు మనిపించినయ్...అది వెండి జరీ కాదు.

## 5

త్యాగరాజులు వెళ్ళేసరికి—మృతుడైన మామగారి అచేతన పాదాలు ఒడిలో పెట్టుకుని నిశ్చైతన్యంగా కూర్చుని ఉన్నది సుమతి. ఆమె కన్నులు పూర్తిగా పొడారిపోయి

నయ్. పక్క-నే రోగిష్టి, వృద్ధురాలూ అయిన అత్తగారు నిశ్శబ్దంగా పడిఉంది. అనాథలూ ఆశోపహతులూ అయిన ఆ స్త్రీలిద్దరికీ ఏడిచేందుకు కూడా ఓపిక లేదు. ఏడవాలనే కోరిక కూడా లేదేమో! ఎందుకంటే మృత్యువు వలన ముసలాయన సుఖపడి పోయినాడు. సంవత్సరంనుంచీ మృత్యువు ఆయనకోసం కాచుకుని ఉంది .. రాక రాక వచ్చిన ప్రియురాలులా ఆయనని ఈనాటికి తన కౌగిల్లోకి తీసుకుంది. ఆ కౌగిల్లో సుఖమేగాని దుఃఖంలేదు-తన కౌగిల్లో దుఃఖమేగాని సుఖం లేదు.

సరిగ్గా ఇదేభావం స్ఫురించకపోయినా యిలాటిభావమే అజ్ఞానురాలైన ఆ వృద్ధురాలి మనసులో కాకాడింది. కనే ఆమె ఏడవడంలేదు- కాకపోతే ఒకందుకే ఆవిశ పడుతున్నది. రాత్రి ఆయన ప్రాణాలు పోయినయ్. ఎప్పుడు పోయినయ్యో ఎవరికీ తెలియదు ... ప్రాణాలుపోయేటప్పుడు ఏమయినా చెప్పాలనుకున్నాడేమో అది వినలేక పోయినానే అని ఆమె కుమిలి కుమిలి దుఃఖిస్తున్నది.

అత్తగారు పడుతున్న ఆవేదనలో పాలు పంచుకోవటం కన్న మామగారి అంత్య క్రియలు ఎలా పూర్తి అవుతాయా అన్న ఆవేదన ఎక్కువగా ఉంది సుమతికి. తన జీతం అయిపోయి అప్పుడే పది రోజులు అయింది. ఇంట్లో ఒక్క బియ్యపు గింజకాని, ఒక అణా డబ్బులుగాని లేవు. తాకట్టు పెట్టటానికి విలువైన వస్తువులూ లేవు. 'భగవంతుడా నన్ను ఎలా తెల్లవారుస్తావు ఈ పరిస్థితినుంచి ?' అని ప్రార్థించింది

ఆమె. కాని ఆ ప్రార్థన ఎవరు వింటారు? ఎవరికి కావాలి ఆ గోల? ఏ మహా రచయిత గేయ కుసుమాలతోనో—ఏ మహా గాయకుని రాగ సుమాలతోనో ఆకర్షింపబడుతూ ఆలయంలో కూర్చుని గర్వంగా ప్రపంచ పర్యవేక్షణ చేస్తున్న భగవానుడికి మాత్రం వినిపిస్తుందా ఆ పేదరాలి కన్నీటి వేదన!

సరిగ్గా అదే అనుకున్నాడు త్యాగరాజులు...అతన్ని చూసి—బిగుసుకుపోయిన మామగారి పాదాల్ని క్రిందబెట్టి ఎదురుగా వచ్చింది సుమతి. ఆమె కన్నులలో ఒక్క చుక్క నీరుకూడా లేదు. రాత్రి నిద్ర లేక పోవటంవలన కాబోలు—ఆమె మొగం వాడిపోయివుంది.

"త్యాగీ, అంతా అయిపోయింది...ఇకముందు ఏం చెయ్యాలి!" అన్నది ఆమె. ఆ వాక్యంలో వ్యథగాని బాధ లేదు. ఒకే ఒక నిర్లిప్తత—అర్థరహితమైన స్తబ్ధత నిండి ఉన్నది.

మనుషులు ఇలా ఎందుకవుతారు? — అనుకున్నాడు త్యాగరాజులు. ఆ విషయాన్ని గురించి ఆలోచించేందుకు ఇప్పుడు టైములేదు.

"రాత్రి అనగా పోయిన మనిషిని ఇంకా ఎంతసేపు అట్టిపెట్టుకుంటాం, తీసుకుపోయే యేర్పాట్లు చేస్తేసరి" అన్నాడతను. అతని కంఠస్వరం అతనికే ఆశ్చర్యం అనిపించింది.

"త్యాగీ!" పేలవంగా నవ్వింది సుమతి.

"ఏం సుమతి, ఏమిటి సందేహం?"

"ఏంలేదు. మామగారిని పంపిచేయక తప్పదు....కాని నా దగ్గర ఒక్క రాగిదమ్మిడీకూడా లేదు త్యాగీ" అన్నది ఆమె.

త్యాగరాజులు అదిరిపడ్డాడు. 'ఈమెకి ఇంత ఆత్మాభిమానం దేనికిఇచ్చావు భగవంతుడా అనుకున్నాడు..

"ఫరవాలేదు సుమతీ, ఆఏర్పాట్లు నేనుచేస్తాన్లే" అని సుమతి మామగారి అంతిమ యాత్రాభారం తన భుజ స్కంధాలమీద వేసుకున్నాడు త్యాగరాజులు. కాని ...అప్పుడు మరోకొత్త సమస్య ఎదురయింది సుమతికి.

"కర్మ ఎవరు చేస్తారు త్యాగీ?" అన్నది.. అది విని అత్తగారు గొల్లుమన్నది. త్యాగరాజులు కూడా ఇంత మటుకూ ఆవిషయం ఆలోచించలేదు. పుత్రవిహీనుడైన ఆ అభాగ్య బ్రాహ్మణుడికి కర్మఎవరు చేస్తారు !...ఈ దిక్కుమాలిన సంఘంలో స్త్రీలకి కర్మాధికారంలేదు... లేకపోతే పదిమంది ఉత్తమ పుత్రులపెట్టు సుమతి. ఆమెనంక చూశాడు త్యాగరాజులు.

"పోనీలె త్యాగీ... ఇంకా ఇప్పుడుకూడా కర్మనిష్టుకు వేళ్ళాడటం తప్పేమో !" అన్నది సుమతి. ఆ మాటకి త్యాగరాజులు సమాధానం చెప్పలేదు; మెదలకుండా వెళ్ళి స్నానంచేసివచ్చి అగ్నిహోత్రం దగ్గిర కూర్చున్నాడు. సుమతి కూడా ఇహ మాట్లాడలేదు. కృతజ్ఞతాభివందనంచేసి స్నానానికి వెళ్ళింది.

శవం లేచేసరికి పన్నెండయింది. ఇంత యథావిధిగా కర్మ జరగటంచూసి ముసిలావిడకూడా కొంతసేపు తన దుఃఖాన్ని మర్చిపోయింది. పుత్రశోకాతుర అయిన ఆ వృద్ధమాతకి త్యాగరాజులు ఉనికి ఎంతో శాంతి నిచ్చింది. తన కుమారుడే చేస్తున్నాడు కర్మ. సుమతి తన కోడలు..

క్షణంసేపు కోడలి నుదుట సిందూరరాగం దర్శించగలిగింది ఆమె. ఇదేదో ఒక మధుర స్వప్నం– ఇదేదో ఒకఅసంభవం తన అదృష్టంచేత సంభవంగా మారింది.

ముసలాయన శవానికి నమస్కరించి విరుచుకు పడి పోయింది ఆ ఇల్లాలు. సుమతి ఆమెను పొదివి పట్టుకుని లోపలికి తీసుకుపోతూ 'పతిని ఇక చూడను అనుకున్నప్పుడు–యుగయుగాలుగా స్త్రీ ఇలా ఎందుకవుతోంది? ఈ బంధంలోని వైచిత్ర్యం ఏమిటి? దీనినుంచి నేను వంచితను దేనికయాను? ఈ అపూర్వానుభవంలోని వ్యథతప్ప మాధుర్యం అనుభవించని స్త్రీజన్మ ఇంత ఖాళీగా దేనికి ఉంటుంద' అనుకొంది ఆమె.

ఎండలోపడి శ్మశానానికి వెళ్ళివచ్చాడు త్యాగరాజులు. అతనికళ్ళు తిరిగిపోతున్నాయి. పొద్దుటినుంచి తడిగుడ్డలతో నానటంవలన జ్వరం వచ్చినట్లు ఉంది... ఆకలికూడా వేస్తున్నది. కర్మ చేయటంవలన తనకి మైల. ఏ హోటల్లోనయినా నాలుగు మెతుకులు తినవచ్చును. కాని కర్మభ్రష్టత అతని అంతరాత్మకే విరుద్ధం. అలాగేబజారువెళ్ళి కావల్సినవి తెచ్చి పడేశాడు అతను.

రెండు దొండకాయలు వేయించి చారుపెట్టి నాలుగు మెతుకులు త్యాగరాజులు విస్తట్లో పెట్టేసరికి సాయంత్రం అయిదయింది. అత్తగార్ని లేపి కాస్త చారూ అన్నంపెట్టి తనుకూడా రెండు మెతుకులు తిన్నది సుమతి.

ఆ రాత్రి ముగ్గురూ గాఢంగా నిద్రపోయినారు... చిత్రం ఏమిటంటే, ఆ ప్తులు మృతులైననాడు వెర్రినిద్ర పడు

తుంది మనిషికి. ఆవేదనా దుఃఖం మొదలైనవన్నీ ఒక గమ్యానికి చేరుకున్న తరువాత ఆనందించిన శ్మశాన ప్రశాంతతలో ఒక మాదకత ఆవహిస్తుంది—అందుకేనేమో శవదహనం అయిన తరువాత వెర్రినిద్ర పోతారు మనుషులు.

# 6

"నిన్నంతా ఏమయ్యారు ?" మండిపడుతూ ప్రశ్నించింది లీల. త్యాగరాజులు సమాధానం చెప్పలేదు. లీల అదే ప్రశ్నని రెట్టించింది.

"విసిగించకు లీలా, సుమతిమామగారు పోయినాడు. నిన్ననల్లా అక్కడున్నాను. అయినా నువ్వా ఇంట్లో లేవుగా" అన్నా డతను పడకకుర్చీలో కూర్చుంటూ. కూర్చున్న అయిదారు క్షణాలకిగాని ఆ గదిలో వాతావరణం మారినట్లు అతను గ్రహించలేదు. గ్రహించిన తరువాత అతని ఆశ్చర్యానికి మేరలేదు.

"లీలా, ఏమిటిదంతా ?" కఠినంగా ప్రశ్నించాడతను.

"ఏమిటి ?"

"ఈ సోఫాలూ, రేడియో ఇవన్నీ ఏమిటి ?"

"ఇప్పుడీగది బాగుందికదూ... ఈ బీరువా చూడండి"

"కొత్తబీరువా, కొత్తచీర... లీలా ఇవన్నీ ఎక్కడివి?" కోపంవలన అతని స్వరం ఒణికింది...

"ఆగండి మరి. ఒరేయ్ అప్పారావూ, అయ్యగారికి కాఫీ తీసుకురా" అన్నది ఆమె చాలా హుందాగా.

"ఎవడీ అప్పారావు?"

"కొత్త నౌకరు"

"ఏమిటిదండా లీలా?"

"ముందు విశ్రాంతి తీసుకోరాదూ? నిన్ననల్లా నానా అవస్థా పడ్డారు! బూట్లు విప్పనా?"

"వద్దు లీలా. ముందు చెప్పు-ఎవరిచ్చారివన్నీ?"

"ఎవరూ ఇవ్వలేదు. ఇవన్నీ మీలీల కొన్నది."

"ఎక్కడ కొన్నది నా లీల?"

"బజారులో"

"లీలా, ఆ విషయం తెలుసుకోలేనంత అజ్ఞానంలో ఏడవటం లేదు నేను...నీకు డబ్బు ఎక్కడిది?"

"ఎక్కడిదేమిటి, నాదే... నేనిక ఉద్యోగం చేస్తాను"

త్యాగరాజులు అదిరిపడి "ఉద్యోగం!" అన్నాడు. అతని ఆశ్చర్యాన్ని చూచి భయపడ్డది లీల.

"మీరు లేకుండా ఒప్పుకునే దాన్ని కాదుగాని, లలిత బలవంత పెట్టింది."

"ఎక్కడ-నీ ఉద్యోగం?"

"సాంబులు దగ్గిర"

"లీలా!"

"ఎందుకలా మండి పడతారు! మొదట నేనుచెప్పేది వినండి."

"అంతవరకూ వచ్చిందన్నమాట"

"ఒకప్రక్క చెబుతున్నానుగా!" అని విసుక్కుంది ఆమె.

"సరే చెప్పు...ఎట్లా? ఏ విధంగా? ఎంత డబ్బుకి సాంబులుకి తమ సేవ విక్రయించారు?"

లీల చురుగ్గా అతనివంక చూసింది.

"చెప్పు లీలా, నీ ధర ఎంత?"

"ఎందుకంత చులకనగా మాట్లాడుతారు? మీ సుమతి ఉద్యోగం చెయ్యటంలేదూ?"

"ఆమె పేరు ఎత్తే అర్హతకూడా నీకులేదు...సరే చెప్పు అతను ఎంత ఇచ్చాడో"

"నెలకి అయిదువందలు"

"ఫరవాలేదు. నాకంటే పెద్దజీతమే... మరి ఆ నోట్ బుక్ కి ఎంత?"

త్యాగరాజులు హఠాత్తుగా వేసిన ప్రశ్నకి లీల ఖంగారుపడి "నోట్ బుక్! ఏ నోట్ బుక్?" అన్నది.

"ఎకౌంట్లతో బాటు వచ్చిన నోట్ బుక్"

"నాకు నోటుబుక్కూ తెలియను, ఏమీ తెలియదు"

"నువ్వు అబద్ధం ఆడుతున్నావని నీ మొహమే చెబుతోంది"

"ఏం? నిజం చెప్పాలనే నిర్ణయం ఏమయినా ఉన్నదా ఏమిటి? "ధైర్యం తెచ్చుకున్న లీల వెటకారంగా అడిగింది.

డ్రాయరులాగి ఒక జేబురుమాలు తీశాడు అతను. "దీని సంగతికూడా నీకేం తెలియదు కాదూ?" అని రెట్టించాడు.

లీల ఖంగారుపడిపోయి "జేబురుమాల... ఏ జేబు రుమాల?" అన్నది. ఆమె గుండెల్లో రైళ్ళు పరుగెత్తు తున్నయ్.

"ఈ జేబురుమాలమీద పేరు కుట్టే ఉన్నది"

"అయితే దానికీ నాకూ ఏం సంబంధం? ఏమిటి మీరనేది" డబాయించింది లీల.

త్యాగరాజులు స్థిరంగా నవ్వి "అనేదేమిటి? ఏ రోజున పుస్తకం పోయిందో, ఆ రోజునే ఈ జేబురుమాలు టేబిలుమీద చూశాను. నా ఉద్దేశ్యం - సాంబశివరావు ఆ పుస్తకం దొంగిలించాడని. అందుకే 'సాంబులు వచ్చాడా' అని నిన్ను అడిగాను - నువ్వు రాలేదన్నావు. నీవు అబద్దం చెప్పావు అయినా సరే నిన్ను అనుమానించలేదు నేను. ఆధారంలేందే నేరం ఆరోపించను నేను. ఈ రోజు దానికి సరిఅయిన ఆధారం కనిపిస్తోంది... లీలా ఇటుచూడు-ఈఇంట్లో వున్న ప్రతివస్తువూ-నీ శరీరంమీద వున్న ప్రతివస్తువూ నోట్ బుక్ సాంబులుకి నువ్వు అమ్మటానికి సాక్ష్యం పలుకు తున్నాయ్. ఇంతకీ ఎంత ముట్టింది తమరికి?"

లీల ఒణికిపోతూ "నాకేం తెలియదు... నేనేం తీసుకో లేదు" అన్నది.

త్యాగరాజులు అసహ్యం వ్యక్తపడేట్లు ఆమెవంక చూస్తూ "లీలా, నీలోంచి అన్నీపోయినాయి.... కాని మాతృత్వం ఇంకా మిగిలే ఉందని నా ఆశ. బేబీమీద పట్టేసి చెప్పు—నిజంగా నీకేం తెలియదూ?"

లీల మాట్లాడలేదు.

"అయితే అంతా నిజమేనన్నమాట. నాఆదర్శాల్నీ సిద్ధాంతాల్నీ నా భార్యే నా ఇంట్లోనే అమ్మేసింది. నీ పిచ్చి త్యాగరాజులూ, ఇకనీకేం మిగలలేదు" అనిలేచి కుర్చీకి తగిలించి ఉన్నకోటు భుజంమీద వేసుకున్నాడు త్యాగరాజులు.

లీల భయపడి "నేను మీ దగ్గిరేం దాచలేదు. ఏమీ మోసం చెయ్యలేదు... ఈ వాతావరణంనుంచి మిమ్మల్నీ, నన్నూ కూడా తప్పించాలని చూశాను. ఆలోచించండి, అది మన ఇద్దరికీ సంబంధించిన ప్రయత్నం... మీరు ప్రతిరోజూ ఉదయానే వెళ్ళి రాత్రికిగాని రారు. రోజంతా ఈ ఇంటి చాకిరీతో నాకు సరిపోతుంది. రోజులూ, మాసాలూ, సంవత్సరాలూ గడిచినా ఏ విధమైన మార్పూ రాలేదు. అనేక బాధలు... అనేక సమస్యలు... అనేక కోరికలు మనల్ని పీడిస్తున్నాయి. దీనితో విసుగెత్తి మార్పు కావాలనుకోటంలో తప్పేముంది?" అన్నది.

"అందుకని నా శత్రువుకి సహాయం చేశావు. నీకు తెలుసు లీలా...నీ బాధలకీ నీ కోరికలు తీరకపోవడానికీ ఎవరు కారకులో వారికే సహాయం చేశావు. నాకష్టార్జితంతో నాకొచ్చే ఆదాయంతో నీకు కొంతసుఖాన్ని, సంతోషాన్ని ఇస్తూనే ఉన్నాను. కాని స్వామిలాటివాళ్ళు ధరల్ని పెంచి నా ఆదాయాన్ని మరింత తగ్గించివేస్తున్నారు. వాళ్ళు అడ్డు రాకుండా ఉంటే స్వాములూ - సాంబశివరావులూ స్వార్థం కోసం సాంఘిక వ్యవస్థని తారుమారు చేయకుండా ఉంటే-

నీవూ నీలాటివాళ్ళూ ఇంకొంచెం సుఖపడేవాళ్ళు. ఇప్పుడు నువ్వేం చేశావో తెలుసా? ఈ హింస ఆపటానికి నాకు సహాయం చెయ్యటానికి బదులు హంతకులకే సహాయంచేయ టానికి నడుం బిగించావు"

"పిళ్ళు హంతకులా? గడ్డపారలు ఎగిరిపోతుంటే గడ్డి పరకలు నిలుస్తాయా? ఒకవేళ మీరు నిలవగలరేమో నాకు తెలియదు. జీవితంలో నాకు సుఖం కావాలి. అందుకే ఈ అవకాశం ఉపయోగించాను. అలా ఉపయోగించినందుకు సంతోషిస్తున్నాను కూడా. ఎప్పుడూ అంతే నేను...నా ప్రేమనీ హృదయాన్నీ ఎంతమంది చెప్పినా వినకుండా మీకు అర్పించాను. దానికి నేనెన్నడూ విచారించలేదు. ఆ స్థితి ఎప్పటికీ రాకుండా ఉండాలనే నా కోరిక."

త్యాగరాజులు నవ్వి "నీవు నన్నెప్పుడూ ప్రేమించ లేదు లీలా. ప్రేమించానని భ్రమించావు. నీవు ప్రేమించేది ఆడంబరాన్ని...ఒకవేళ ప్రేమిస్తే స్వామికోటు వేసుకొని సాంబులు హాట్ పెట్టుకొని కారులోంచి దిగి కాస్మా పాలిటన్ క్లబ్బుల్లో తిరిగే త్యాగరాజుల్ని ప్రేమిస్తావు. కాని నేను ఆ త్యాగరాజుల్ని కాను...అయే ఆశకూడా లేదు" అన్నాడు.

"మీరు ఆ త్యాగరాజులు కానక్కరలేదు —అందుకు మిమ్మల్ని బాధపెట్టను. అయినా కుటుంబ పోషణలో పాలు పంచుకోటం తప్పుకాదు"

"అవును. నన్నిక బాధపెట్టవు. ఎందుకు పెడతావు? నిన్నునీవు అమ్ముకుని అయిదువందలు సంపాదిస్తున్నావుగా!" సహనాన్ని పోగొట్టుకున్న త్యాగరాజులు మాట మిగిలాడు.

"అలాటి మాటలనటం దేనికి? నన్ను నేను అమ్ముకోలేదు. మీరందరూ చేసినట్లే కాలాన్నీ పనికిఅమ్ముకున్నాను" అన్నది లీల. ఆమె సమాధానం అలా ఇవ్వకపోతే తనన్న మాటలకి తప్పకుండా పశ్చాత్తాప పడేవాడు త్యాగరాజులు. ఇప్పుడిహ వెనుదియ్యతల్చుకోలేదు.

"ఏంపని చేస్తావు నువ్వు? నీకు వ్యాపారం తెలియదు. టైపురాదు - లెక్కలు అసలే రావు...ఏ పని చేస్తావని అయిదొందలు నీకు? కేవలం నీ అందమైన శరీరానికి"

లీల రెండుచేతులతో మొగము కప్పుకుంది.

"అవును లీలా! అధర నీఅందానికే... అది ఎరగా ఉపయోగించి కొందర్ని తనవలలోకి లాక్కుంటాడు సాంబులు. డబ్బు యివ్వటానికి బదులు నీ చిరునవ్వునీ పెదవి ఒంపుల్నీ ఎరగాయిచ్చి కొనుక్కుంటాడు వాళ్ళని."

లీల చేతులుతీసి "నా ప్రేమకీ మీపేరుకీ భంగం రాదని, రానీయనని హామీ ఇస్తున్నాను-సరా?" అన్నది.

"ప్రేమమీదా, పేరుమీదా ఇక మాట్లాడకు... అవి నీవి కావు. ఏనాడో సాంబులుకి తాకట్టు పెట్టావు...నీవు నాకు భార్యగా ఉండటానికంటె ఆ లంచాల తండ్రికి కూతురుగా ఉండటానికే తగిపోయినావు."

"మీరు మానాన్నని గురించి ఏమీ అనకండి"

"ఎందుకని? మీనాన్నకి ఆ సుగుణం ఉంది. ఆసంగతి అందరికీ తెలుసు."

లీల మండిపోయి "ఛీ, మీతో బ్రతకటం నరకంఅయిపోయింది" అన్నది కాలు నేలకేసి కొడుతూ.

"ఇప్పుడు మాత్రం ఏమయింది. నీ బ్రతుకును నీవు బాగుచేసుకో వచ్చును."

"అయితే నన్ను వదిలేస్తానని భయపెడుతున్నారన్న మాట!"

"బలహీనులయితే భయపడేవారుగాని నీకేం భయం! ప్రస్తుతం నీవు చాలా ఉన్నత స్థితిలో వున్నావు."

"అయితే యింట్లోంచి వెళ్ళ గొడతావా!"

"ఎంతమాట ! నేనే వెళ్ళిపోతాను..."

"ఇది మీ యిల్లు"

"నా యిల్లు...ఎవరన్నారు నాయిల్లని ! యీ ఫర్నిచర్, ఈనౌకరు, నీనెక్లెసు, చీర, రవిక, ఆ ముత్యాలహారం వీటిల్లో ఏ ఒకటైనా నాది ఉన్నదా? యీ యింట్లో నేను పరదేశిని లీలా"

"అయితే ఏమిటి మీ ఉద్దేశ్యం...నన్ను విడిచి వెడతారా?" భయం భయంగా అడిగింది లీల.

"అవును. అదే నా ఉద్దేశ్యం...నా నీడకూడా నీకు కనిపించ నివ్వను."

"అయితే నా బ్రతుకును నడివీధికి ఈడుస్తారన్న మాట"

"అవుసరమైతే"

"మీకు హృదయంగాని న్యాయంగాని లేదు" రెండు చేతులతో కళ్ళుమూసుకుని ఏడవటం ప్రారంభించింది ఆమె.

"అవును లీలా, నేనీక్షణంలో హృదయం లేని వాడినే. ఎందుకంటే, మన ఉద్దేశాలు ఒకదానికొకటి పరమ శత్రువు

లయిపోయినాయి. ప్రతివాడూ ఒక ఆశయంతో జీవితం ప్రారంభిస్తాడు. ఆ ఆశయాన్ని వాడు ప్రాణప్రదంగా ప్రేమిస్తాడు. ప్రస్తుతం నా ఆశయానికి నీవు బద్ధ విరోధివి. మన ప్రస్తుతమార్గాలు పూర్తిగా విడిపోయినాయి—మన సిద్ధాంతాలుకూడా పూర్తిగా వేరు. నాకేది సంతోషం ఇస్తున్నదో అదే నీకు దుఃఖాన్ని కలిగిస్తున్నది. కొత్తదనంలేని అసహ్యపు బ్రతుకు బ్రతుకుతూ నాఆశయాల బలిపీఠంమీద నీసౌఖ్యాన్ని బలిచెయ్యమని నిన్నిక నిర్బంధ పెట్టదలుచుకోలేను" అని నిట్టూర్చాడు అతను.

"మిమ్మల్నింకా ప్రేమిస్తూనే ఉన్నాను."

"అది పొరపాటు లీలా, ప్రేమ దీపకళికలాంటిది. ఆ చిన్న దీపకళిక తాలూకు బ్రతుకూ కాంతీకూడా దాన్ని వెలిగించిన వారిమీద ఆధారపడి ఉంటుంది. రెండుచేతులూ అడ్డుపెట్టి రక్షించుకుంటూ ఉంటేనే అది నిలుస్తుంది - నిజమే. మొదట్లో మనప్రేమ ఉజ్వల దీపకళిక. ఇప్పుడు మనప్రేమ కొడిగట్టిన దీపం. వస్తా లీలా, సుఖంగా ఉండు."

మాటల సందర్భంలో కుర్చీమీద పడేసిన కోటుని తిరిగి భుజంమీద వేసుకొని అంధకారంలో విలీనమయిపోయినాడు త్యాగరాజులు. లీల కొన్ని క్షణాలకి తేరుకొని దీపం వేసింది. ఆ దీపం కళికకాదు; నూరుకొవ్వొత్తుల వెలుగుగల విద్యుచ్ఛక్తిదీపం—ఈవ్యామోహం ప్రేమకాదు తగ్గటానికి, స్విచ్చి ఆర్పివేస్తే తప్ప. సాంబశివరావు త్యాగరాజులు కాడు...స్విచ్చి ఆర్పివెయ్యటానికి...ఫరవాలేదు... అనుకుంది ఆమె.

# 7

గోపాలరావుగారు ఒకవిధంగా అతి నిరాడంబరుడనే అనవచ్చును. తనతో అవసరమున్నవారు ఏదైనా తెచ్చి ఇస్తే పుచ్చుకోటం తప్పని ఆయన ఏనాడూ అనుకోలేదు. మహత్తరమైన ఆనందంతో పిత్రార్జితాన్ని స్వీకరించినట్లే- స్థూలకాయాన్నీ దానితోపాటు వాతపుజబ్బునీకూడాహాయిగా తీసేసుకుని అనుభవించేస్తున్నాడు.

తన ఏకపుత్రిక లీల తన ఇష్టానికి విరుద్ధంగా వివాహం చేసుకుంటానని అన్నరోజున ఆయన ఒకనిట్టూర్పు విడిచి "చేపపిల్లని నీళ్ళఅవతల పడవేయ కూడదు తల్లీ! భాగ్యానం తుడి ఏకపుత్రిక కూడా చేపపిల్లలాటిదే" అన్నాడు.

ఆ మాటకి లీలనవ్వి "అదేమిటి నాన్నా, డబ్బుకీ ప్రేమకీ ముడిపెడతావు ?" అని ఎగరగొట్టిపారేసింది. ఆయన వచ్చే నిట్టూర్పుని బలవంతంగా అణచుకుని మెదలకుండా ఊరుకున్నాడు.

భార్యా వియోగం కలిగిన తరువాత దూరపుబంధువు రాలైన బాలవితంతువు ఒకావిడఆయనకు వండిపెడుతున్నది; వరసకి మరదలు అవుతుంది. ఆమెపెట్టిన అన్నం వేళకింత తింటూ సంపాదించిన లక్షన్నర రూపాయల ఆస్తి చూసు కుంటూ ఎవరైనా ఇంటికివస్తే తన నడుంనొప్పిని గురించి నిర్విరామంగా చర్చిస్తూ నిశ్చింతగా కాలం గడిపివేస్తున్న గోపాలరావుగారికి జీవితం అశాశ్వతం అనే చింత ప్రారంభ

మయింది. కేవలం ఆ కారణంవల్లనే ఆయన భగవద్గీత పారా యణ చేస్తున్నారు.

ఇవ్వాళ ఏడుగంటలకి పుస్తకం ముందువేసుకొని కూర్చున్న స్థూలకాయుడైన బావగారు పదిగంటలు దాటినా కదిలే ధోరణిలో కనిపించక పోయేసరికి అన్నపూర్ణమ్మకి విసుగెట్టింది. అప్పటికే ఒకటి రెండు తడవలు పడమటింట్లోకి వచ్చి తొంగిచూసి పోయిందావిడ. ఇప్పట్లో కదిలే ధోరణిలో లేడాయన.

"ఏం బావగారూ, కప్పీలూ [క్రేన్లూ] తీసుకు వస్తేగాని కదలరా ఏమిటి?"

బావగారు సమాధానం ఇవ్వలేదు. బడే గులాం ఆలీఖాన్ హిందూస్థానీ గాత్రసంగీతం అంటే ఆయనకి ఎంత ఇష్టమయినా భగవద్గీతని మాలోకోస్‌లో పారాయణ చేయటం మూడుగంటలసేపు ఆవిడగనుక సహించకలిగింది.

"ఏమండోయ్"

"ఏమటీ?" సమాధిలోనుంచి బయటపడి ప్రశ్నించారు బావగారు.

"ఇక తిండీ తిప్పలూ ఏమీ అవసరంలేదా ఏమిటి?"

"ఏది శాశ్వతం అన్నపూర్ణా... సరే వడ్డించు వస్తున్నాను" గోపాలరావుగారు ఈ సమాధానంయిచ్చి తనమహాకాయాన్ని లేవదీసే ప్రయత్నంలో వుండగా వాకిట్లో బండీ ఆగింది. ఎటూకానివేళ హఠాత్తుగా ఊడిపడ్డ కూతుర్ని సాదరంగా ఆహ్వానించి మనుమరాల్ని అందుకోటానికి ప్రయ

త్నించారు ఆయన. ఆ పసికూన రాలేదు. తల్లిని గట్టిగా కౌగలించుకుంది. అన్నపూర్ణమ్మ ఇవతలకివచ్చి బావగారిని కోప్పడుతూ—

"అలాటి వెర్రివేషాలు వెయ్యకండి; పిల్ల దడుసుకుంటుంది. తెలియకడుగుతాను బావగారూ, భగవద్గీత మానేసి ఉదయాన్నే ఒకమైలు పరిగెత్తి కూడదండీ" అనినవ్వి లీల వంక తిరిగి "ఒక ఉత్తరమన్నా వ్రాయకుండా వచ్చావేమమ్మా" అన్నది.

తన పినతల్లి హాస్యం అంటే లీలకి చాలా యిష్టం. అయినా కూడా ఈ రోజు తనున్న పరిస్థితిలో నవ్వలేకపోయింది. పినతల్లి తండ్రినిఆడే పరిహాసాలకు లీల విరగబడి నవ్వేది. ఈ రోజు నవ్వకుండానే—

"ఊరికినే పిన్నీ... వెధవ రైలు అరగంటలేటు" అంటూ దొడ్లోకి నడిచింది లీల. గోపాలరావుగారు, అన్నపూర్ణమ్మా ఒకరినొకరు ప్రశ్నార్థకంగా చూసుకున్నారు.

ఆయింట్లో అన్నపూర్ణ స్థానం విచిత్రమైనది. దిక్కులేక ఆయింట్లోచేరిన ఆదీన వితంతువు అంటే నౌకర్లకి మాత్రమేకాదు, లీలకీ గోపాలరావుగారికూడా భయమే. ఆమెకి ఆయింట్లో అడ్డులేదు. అలాఅని ఆ అధికారాన్ని ఆమె ఏనాడు దుర్వినియోగం చెయ్యలేదు. ఏదో ఒకపూట ఇంతపిండి తింటుందని అందరూ అనుకోవటమేగాని ఆమె తినటం ఇంతమటుకూ ఎవరూ చూడలేదు. ఆమె నిగ్రహం అద్వితీయమైనది. అయితే ఏం? లోకంలో ఆమెకీ మంచి పేరులేదు. ఒంటరిగా బావగారి పంచనబడి ఉన్న బాల

వితంతువుల గురించి లోకులు మామూలుగా అనుకునే మాటల్నే ఇప్పుడూ అంటున్నారు.

"మనస్సుల్లో ప్రేమని నేను చెడుఅనుకోను బావగారూ! కాని అదే ప్రధానమనే విషయాన్ని గురించి నేను నమ్మను. ప్రేమ అద్వితీయమైనదని అనటం ఈ రోజుల్లో ఫాషనై పోయింది..." అన్నది ఆమె.

"సరే అమ్మాయి... ఇప్పుడీమాటలు దేనికన్నట్లు?"

"మీబుర్రలో ఉన్నదంతా ఉత్తమట్టి బావగారు! ఎలా ఉద్యోగముచేసి యిన్ని లంచాలు కొట్టారోగాని" అని నవ్వింది అన్నపూర్ణ.

"ఎలాగంటే... అక్కడ అన్నపూర్ణలు లేరుగనుక. సరే, కలలోలా అమ్మాయి ఎందుకు వచ్చిందంటావు?"

"ఇల్లాలా అనిపిలిస్తే మీకొంప ఏం మునిగింది? అంత మాత్రం చేతనే అది నా ప్రాతివత్యానికి సర్టిఫికెట్ అయి పోయిందా బావగారూ?... కాస్త నన్నూ పతివ్రతంటే మీ సొమ్మేం పోయింది?" అని నవ్వసాగింది అన్నపూర్ణ...

ఆమె పరిహాసాలు ఆయనకి అలవాటే అయినా ఈ రోజు మాత్రం అవి ఆయన్ని ఆకర్షించలేక పోయినాయి.

"కాదు అన్నపూర్ణా, ఏదో జరిగి ఉంటుంది" అన్నాడాయన.

"ఈ బ్రతుకులో సుఖమూ దుఃఖమూ అనేవి సత్యమైనవికావు; శాశ్వతమైనవీ కావు బావగారూ! ఇక మీరు లేవండి-నాలుగు మెతుకులుతిని ఆ మహాకాయాన్ని మంచం

మీదికి జేరేశారంటే చాలు ఏ సమస్యా మీకు ఉండదు" అని వంటింట్లోకి దారితీసింది ఆమె.

ఆ సాయంత్రం టీ సమయంలో కథంతావిని "నువ్వు చేసింది మంచిపని కాదమ్మా" అన్నాడు గోపాలరావుగారు. పాశ్చాత్య నాగరికత జీర్ణించుకుపోయిన తనతండ్రి...మనసు లేని మనువుకన్నా విడాకులే ముఖ్యమని వాదించే తన తండ్రి...స్వయంగా ఒక అక్రమ సంబంధం ఇంట్లోనే ఉన్న తనతండ్రి...ఇలా అనటం చూసి స్తంభీకరించి పోయింది లీల.

తనతండ్రికి, పినతల్లికి ఏదో ఉందనే అనుమానం లోకాని కందరికీ ఉన్నట్లే ఆమెకీ ఉన్నది. ఆ అభిప్రాయం వల్లనే ఆమె సాహసం వృద్ధిపొందింది...తనకి లోకువఅయిన తండ్రి హఠాత్తుగా ఇలాఅనేసరికి కళ్ళు చీకట్లు కమ్మాయి లీలకి. కొంచెం సేపటివరకూ ఆమె ఏమీ జవాబు చెప్ప లేదు. గోపాలరావుగారి పైపులోంచి వస్తున్న పొగకన్నా తేలికగా తను తేలిపోయినట్లుగా ఉంది లీలకి.

"నువ్వు అనేది ఏమిటి నాన్నా! ఇష్టంలేకపోయినా కాపురం చెయ్యాలనా!" అన్నది చివరికి.

ఒక్కసారి గట్టిగా పైపుపీల్చి "తొందరపడకూడ దమ్మా! ఆసంగతి పెళ్ళికిముందే చెప్పాను 'చేపపిల్లని నీళ్ళ అవతల పడెయ్యకూడదుతల్లీ' అని. నువ్వు వినలేదు. తొందర పడ్డావు. మళ్ళీ యిప్పుడూ తొందర పడుతున్నావని నా [redacted]ద్దేశ్యం."

"నీ ఉద్దేశ్యం ఎవరికి కావాలి నాన్నా ! — ఇంతకీ నన్నేం చెయ్యమంటావు ?"

"పెద్దవాడిని అలా అనకూడదు. అంటానికి మీాపిన్ని ఇక్కడ లేదు" అని తన జోక్ కి తనే నవ్వటం ఆరంభించాడాయన.

"నీకు నవ్వెలా వస్తోంది నాన్నా"

"ఏం చెయ్యమంటావు తల్లీ... బాధలూ కష్టాలూ అనుభవిస్తున్నప్పుడు ఏదో ఒక అపరిచిత హస్తం నాకు గిలిగింతలుపెట్టి నవ్విస్తూ ఉంటుంది ... పడకపోవటం అనేది సృష్ట్యాదినుంచీ వస్తున్నదే. ఈ సంవత్సరం చలి అంతగా లేదు" అని పైపు పీల్చడం ప్రారంభించాడాయన.

"మీాకు మట్టిమెదడు బావగారూ!"

"మరే"

పైపు పీల్చడంలో హాయిని అనుభవిస్తూ ఒప్పుకున్నాడు ఆయన. అందుకే ఆయనంటే యిష్టం అన్నపూర్ణకి. పసివాడిలా స్వచ్ఛమైన ఆయన నడవడి, కూర్చుంటే లేవలేని ఆయన స్థూలకాయమూ ఆ ప్రౌఢవితంతువుకి ప్రేమాస్పదాలైనాయి. అందుకు ఆమె ఏమీా సిగ్గుపడదు. దాచుకోవాలనికూడా అనుకోదు... మరదలు అన్నమాట యింతసేపటికి అర్థంఅయి-

"ఎందుకని మట్టిమెదడు మరదలుపిల్లా?" అన్నాడు.

"ఇది వేసవికాలం కనుక" అన్నది అన్నపూర్ణ.

"ఓ, ఐసీ" అని తిరిగి పైపుపీల్చడం ప్రారంభించాడాయన.

"పిన్నీ, నువ్వు ఏమంటావు" అన్నది లీల.

"అర్థంలేని ఆత్మార్పణఅంటే నాకు నమ్మకమూ విలువ లేదు లీలా! అయినాకూడా ఎందుకనో నువ్వు చేసినపని అంతమంచిది కాదనే అనిపిస్తోంది" అన్నది అన్నపూర్ణ—లీల మాట్లాడలేదు.

"ఆత్మార్పణ అనేవాక్యంలో బహుప్రాచీనమైన పారమార్థిక తాత్పర్యం ఉందని మనం నమ్ముతున్నాం. ఆ నమ్మకం తలకెక్కినవారికి లోకభయం జాస్తి. కాని లీలా, ఈ నమ్మకం నాకులేదు దానివల్ల ఆడదానికిగాని మొగవాడికిగాని సుఖం ఉన్నదా, లేదా, అనికూడా ఆలోచించం మనం. అదే మహాసత్యమని మనసంస్కారం చెవిమెలేసి వప్పిస్తుంది."

"బాగుంది పిల్లా...ఇంతకూ నీ అభిప్రాయం?" నవ్వటం ఆరంభించారు గోపాలరావుగారు.

"మానవుడి మానవత్వాన్ని పిండేసి డిప్పల్ని పారేయ్యాలని ప్రయత్నించేవారు 'వ్యర్థ' అంటే ఏమిటో తెలియనివారే బావగారూ"

"ఇంద్రియాల్ని జయించటం మాటేమిటి?"

"అసలు ఇంద్రియాలే లేని మీకూ నాకూ ఆ సమస్యే లేదు బావగారూ"

"ఛా... ఛా" అని తిరిగి పైపు పీల్చటం ఆరంభించాడాయన. లీల వైపుకి తిరిగి;

"వ్యామోహం వేరూ ప్రేమ వేరూ నమ్మా...వ్యామోహంలోపడి వివాహం చేసుకున్నావు ...వ్యామోహం లోనే పడి వివాహవిచ్ఛేదంకూడా చేసుకోవటం అంతమంచి కాదని నా ఉద్దేశ్యం" అన్నది అన్నపూర్ణ.

లోలోపల ఉడికిపోతున్నది లీల. వ్యామోహంలో పడి ఇన్నాళ్ళనుంచీ లోకాపవాదాన్నికూడా లెక్క చెయ్యని తన పినతల్లినోటివెంట నీతి సూత్రాలు రావటం చాలా ఎబ్బెట్టుగా కనిపించింది ఆమెకి. కానీ ఎదురుచెప్పే ధైర్యం లేకపోయింది.

"అది కాదు పిన్నీ!"

"సమాధానం అనవసరం. నీ జీవితం నీది. సలహా ఇచ్చేహక్కు నాకుగాని, బావగారికిగాని లేదు. అదీగాక నువ్విక్కడ ఉండబోవటంలేదు. రేపో, మాపో ఉద్యోగంలో జేరాలి. నిజంగా నా సలహాయే పాటిస్తే ఇక్కడే ఉండిపో. త్యాగరాజుల్ని మీ నాన్నగారు తీసుకువస్తారు" అన్నది అన్నపూర్ణ.

లీల ఆలోచించటం ప్రారంభించింది. నిర్జీవమైన ఈ ఇంట్లో నాన్న మహాకాయాన్ని అనుక్షణం దర్శిస్తూ బ్రతకటం ఆమెకు ఎంత మాత్రం ఇష్టంలేదు. విలాసమయ జీవితంవైపు ఆమె ఊహలు తేలిపోతున్నాయ్. సాంబశివ రావు ఇచ్చే అయిదువందల రూపాయలతోనూ ఆమెకి హాయిగా గడుస్తుంది. వెళ్ళటానికే నిశ్చయించుకుంది లీల.

"లీలా, ఒకమాట ... పిల్లని దిగివిడిచి వెళ్ళు. నువ్వు ఆఫీసుకి వెడితే దాన్నెవరు చూస్తారు?" అన్నది అన్న

పూణా. లీల అభ్యంతరం చెప్పలేదు. నాలుగయిదు రోజుల తరువాత విజయవాడ వచ్చి ఆఫీసుకు వెళ్ళింది లీల. సాంబశివరావు చిరునవ్వులో ఈ మధ్య జరిగిన ప్రతి విషయాన్నీ మర్చిపోగలిగింది ఆమె.

## 8

“త్యాగీ, ఈ రాత్రి గడవదు” అన్నది సుమతి.

ధ్య ఆఇంటిచుట్టూ కమ్ముకొన్న మృత్యుశీతలచ్ఛాయలు మరింత దట్టమయినయ్. ముసలాయనపోయి నెల ు కాలేదు.... ముసలావిడకూడా మూటాముల్లే సర్దు సు ప్రయాణానికి సిద్ధమైకూర్చుంది. బయట కురుస్తున్న వాన తాలూకు శబ్దంలో యమభటులు మోసుకొస్తున్న పల్లకీ వారింటిముందు ఆగిన సంగతి సుమతీ, త్యాగరాజులూ కూడా గమనించలేదు.

“సుమతీ....” ఆయాసంతో పెగుల్చుకుని పిలిచింది అత్తగారు.

“ఏం అత్తయ్యా!”

ఆమె మాట్లాడలేదు. తన సుదీర్ఘమైన ప్రయాణానికి గంట కొట్టారు ఇప్పుడే ... శక్తి బిందువు లన్నిటినీ కూడ తీసుకొని సుమతి చేతిని త్యాగరాజులు చేతిలో ఉంచింది ఆ వృద్ధురాలు. వాకిట్లో యమభటులు పల్లకీ పై కెత్తారు.

ప్రకృతే చిత్రమైనదను కుంటే, యవ్వనం అంత కంటే చిత్రమైనది. త్యాగరాజులు ధర్మబుద్ధీ వుదారస్వభావం

మొదటినుంచీ సుమతియెడల శ్రద్ధకలుగ చేసినై. కాని ఇంత భయంకరమైన పరిస్థితిలో ఆమెతోసహా ఇరుక్కోవాల్సి వస్తుందని అతనెన్నడూ ఊహించలేదు. భారతీయధర్మం, నీతి, ఆచారం, కర్మఅంటే త్యాగరాజు చాలా గౌరవిస్తాడు. అయినా దీర్ఘకాలిక నైరాశ్యం వలనా విసుగువలనా వాటి మీద గౌరవం కొద్దిగా ఇప్పట్లో నీరసించింది అతనికి.

కేవలం ఆ కారణంచేతనే ఆమె చేతిలోఉన్న తన చేతినివెనక్కి తీసుకోలేకపోయినాడుఅతను. జీవిత గ్రంథంలో విచిత్ర ప్రకరణాలుకొన్ని హఠాత్తుగా వచ్చి తమని పఠించ ప్రార్థిస్తూ తేవిణీ వేసుకుని కూర్చుంటే.... చదువుతామని చెప్పటానికి భయం వేస్తుంది. ఇంతకాలమూ ధర్మం ,అని విశ్వసించిన విషయాలు ఉత్త అర్థరహితం అని ఆ ప్రకర ణాల్లో ఉంటుందని మనకి ముందే తెలుస్తుంది. అందుకే అవి చదవటానికి భయం.

క్షణంక్రితమే తన అరవయివేళ్ళ చైతన్యాన్ని ఉప సంహరించుకుని విశ్వాంతరాళంలో కలిసిపోయిన ఈ వృద్ధు రాలు ఎంతచిక్కు తెచ్చిపెట్టింది ! ఉద్దేశ్యం స్పష్టంగానే ఉంది... అయినా దానికి మరోవ్యాఖ్యానానికి ఆస్కారం ఉన్నది.

"ఆమె పోయింది కిందికి దింపుదాం పట్టు త్యాగీ" అన్నది సుమతి. అతనిచేతిలోంచి తనచెయ్యి వెనక్కి తీసు కుని ఇద్దరూకలసి చిరుచాపమీద ఆమెని పడుకోబెట్టారు. చిరిగిపోయిన తెల్లదుప్పటిని ముఖంమీదికిలాగి తలవైపుదీపం వెలిగించింది సుమతి.

బయటవాన తగ్గలేదు. మరింక హెచ్చింది ఆ మృత శరీరం పక్కన నిశ్శబ్దంగా కూర్చున్న ఆ యువతీయువకుల అంతర్యాలలో దుఃఖంలేదు సరిగదా—రాగతరంగిణీ చంచల తరంగాల చిరుసవ్వడులు ఇప్పటికప్పుడే ప్రారంభమయినయి. అదే యవ్వనంలోని చిత్రం అది ప్రవహించటం ప్రారంభించిందా; కింక నేమున్నదీ చూసుకోదు. శవాలు—కన్నీళ్ళు నిట్టూర్పులు— అమంగళాలు ఏవీ దాన్ని అంటవు— ఏవీ దాని ప్రవాహానికి ఆనకట్ట కట్టలేవు. ఉధృతమైన దానిఉరవడికి సర్వప్రపంచమూ విస్తుబోయి చూడటంతప్ప ఏమీ చెయనూ చేయదు.

జీవితం – ఇంతటి సత్యం క్షణంలో శూన్యంగా ఎలా పరిణమించిందో అనేవిషయాన్ని గురించి ఇప్పుడు ఆలోచించటం లేదు సుమతి. ఇన్నాళ్ళు ఆమె ఆలోచిస్తున్నది నిజంగా అదే. కాని కొన్ని నిముషాల కిందట ఆమె స్త్రీత్వం మేలుకొంది...చాలాకాలంగా నిద్రాణమైన నారీత్వం ఒక్కసారిగా మేలుకోటం చాలప్రమాదం... స్త్రీత్వపు అవసాన సమయం అదే అవుతూ ఉంటుంది అప్పుడప్పుడు.

"సుమతీ!"

"ఏం త్యాగీ!"

"ఆడది ఒంటరిగా బ్రతకాల్సిరావటం చాలా దౌర్భాగ్యం సుమతీ. ఇకముందు నీసంగతి ఏమిటి?"

"ఆ సంగతి ఆలోచించేభారం అత్తగారు నీకు అప్ప చెప్పారుగా" నీరసంగా నవ్వింది సుమతి.

"ఈ దేశపు మగవాళ్ళు దుర్మార్గులు సుమతీ! బాధ్యత దగ్గరికి వచ్చేసరికి పారిపోతారు."

"అలా అనటం దేనికి! ఈ దేశపుస్త్రీలు తెలివితక్కువ వాళ్ళు. అంతభారంతోనూ మగవాడినెత్తిన విరుచుకు పడ తారు. ఇకనాకు ఖర్చేముంది.. ఉన్న ఉద్యోగంతో నాపొట్ట వెళ్ళిపోదూ!" అంది సుమతి.

"మీ అత్తగారు అలా అనికాదు చేతిలోచెయ్యి..."

"దాన్ని గురించి మాట్లాడద్దు ... నా జీవన కాలం అయిపోవచ్చింది. ఈఅయిపోవటాన్ని గురించి అందరూ ఆలో చించరు. భర్తతోనూ పిల్లలతోనూసుఖపడేవారూ సౌందర్య మాధుర్యంలో మునిగితేలేవారూ అయిన ఆడవాళ్ళు తమ జీవన కాలం ఎప్పుడయిపోతుందో కూడా ఆలోచించరు- ఆలోచించే అవసరమూలేదు. అదృష్టహీనన్నై భవిష్యత్ కంతటికీ నీళ్ళొదులుకుని మాబోటి నిర్భాగ్యులు దాని మంటల్నీ ఘోరనైరాశ్యాన్ని చాలాకాలం అనుభవిస్తారు. కొంత కాలానికి ఆమంటలకీ బాధలకు మనసుతోపాటు స్త్రీ త్వంకూడా మాడిబొగ్గయి ఊరుకుంటుంది. ఆవికృతపదార్థం అప్పుడప్పుడు తలఎత్తటం జరుగుతుంది. కాని త్యాగీ, అది వెంటనే నిద్ర పోవటం చాలా అవసరం"

త్యాగరాజులు కొంచెంసేపు స్తబ్ధుడై కూర్చున్నాడు. శవం కదిలితే బాగుండు ననిపించింది అతనికి.

"దీనికి సమాధానంచెప్పే శక్తి నాకులేదు సుమతీ! పరులకోసం త్యాగం చెయ్యటమనేది నీకు అలవాటు త్యాగ

ములో ఆదర్శంఉండదని అందరూ అనటంవలన కొందరు త్యాగం జేస్తారు గాని దానిలో ఆనందాన్ని చూసి కాదని నా అభిప్రాయం. అదీగాక అర్థరహితమైన త్యాగానికి విలువ మాత్రం ఏముంటుంది" అన్నాడు నెమ్మదిగా.

"హిందూ సంస్కృతిలో ఉన్నఆత్మార్పణ, త్యాగం ఇది అద్భుతమైనది త్యాగీ! త్యాగంతో సిద్ధి పొదటమే మనకి ఆదర్శం. ఈమార్గంలోనే బ్రాహ్మణ వితంతువులు జీవితాన్ని గడపుకుంటూ వస్తున్నారు"

"కాని సుమతీ, ముక్తి-సుఖం ఈ రెండుదొరకవు దాని వల్ల. ఆచారం కావటం వలన అదే అనుసరించాలని ఏమీ లేదు. ఒకప్పుడు సహగమనం ఇంతే! అగ్నిలోదూకే ఆడదానికి అదిచందనంలా ఉండటానికి కొన్ని కబుర్లు చెప్పేవారు. ఇంతటి కఠోరవైధవ్యం అనుభవించటంలో ఆనందం ఉందని భ్రమని కల్పించకపోతేఎలా మరి?"

"అలా అంటే ఎలా? వితంతువుల భర్తవియోగ స్మృతిని అర్థంలేని ఆత్మనిగ్రహమని ఎవరూ అనరు. మన గర్వం తాలూకు వేళ్ళు అందులోనే నాటుకుని ఉన్నాయి."

"జీవనసుఖాన్ని నాశనంచేసే నిగ్రహంలో మహాత్మ్యం ఉంటేమటుకు దానివల్ల ఏమంతప్రయోజనం సుమతీ? నిగ్రహాధిక్యత బ్రతుకుని మొద్దుబార చేస్తుంది." అన్నాడు త్యాగరాజులు. అతని మనసు వాదనకి అనుకూలంగాలేదు.

"అది కేవలం నీ వాక్యాల నిర్మాణం త్యాగీ! మోహవాంఛలను పట్టుకుని వేళ్ళాడినంతకాలం మానవుడు

పరాజయం పొందుతూనే ఉంటాడు. అందుకనే ఆ మార్గంలో తృప్తిలేదు — ముక్తిలేదు"

"అర్థంలేదు. వాంఛలుతీరవు అసంతృప్తి ఉంటూనే ఉంటుంది. వాటికే ఇలా అంటారు 'భోగంలో తృప్తిలేదు; మోహంలో వాంఛ లేద'ని - వాంఛా ప్రవాహం అసలు జీవన కోశాల్లోనే ఎడతెగకుండా ప్రవహిస్తూ ఉంటుంది."

"కావచ్చునుగాని దాన్ని జయించాలి గదా"

"ఎప్పుడూ ఎవరూ దాన్ని జయించలేదు సుమతీ! విషాదాన్ని ఎదుర్కో-లేక ఎందులో నయినా పరిచస్తే విషాదాన్ని జయించట మవుతుందా? దానివల్ల తృప్తిలేదు; సుఖమూ లేదు."

సుమతి నిశ్చలంగా జవాబు ఇచ్చింది. "కనీసం ఆ భ్రమతో అయినా బ్రతకాలి త్యాగీ! ఇప్పుడు సూర్యుడు లేడు. అంతమాత్రం చేత సూర్యుడు సత్యంకాదని అన లేము. అంధకారం ఉన్నది కనుక అంధకారమే శాశ్వత మనీ అనుకోలేం"

"కాని అంధకారంలో ప్రభాతంకోసం — మండు ఎండలో చంద్రకాంతి కోసం మానవుడు తాపత్రయపడుతూ ఉంటాడు. సౌందర్యానికీ వైరాగ్యానికీ అనుక్షణం సంఘర్షణ తప్పనూ తప్పదు. చంద్రకాంతిమీద విశ్వాసంతో వేసవి మధ్యాహ్నం గడటపటం అతనికి అలవాటు" అన్నాడు అతను.

ఆ ఇద్దరి ఆలోచనలూ ఒకే మార్గంలో ప్రయాణిస్తు న్నాయేమో అనిపిస్తుంది. ఆమె దృష్టిలో జీవితానికి శూన్యం

తప్ప మరో అర్థంలేదు. అతని దృష్టిలో జీవితం అంటే అనుభవం తప్ప మరోటి కాదు. కాని అధర్మమార్గంలో ఆ అనుభవం పొందాలని అతను అనుకోడు. ఆమె అదృష్టాన్ని ఒప్పుకోదు. అంతర్యానికి ఆమె జోలపాడుతుంది. అందు కనే ఆమె భవిష్యత్ నిరాటంకమైనది. అసలు లేనేలేదు. ఆమె ఆనందంకూడా అంతే. అది అలసిపోదు. మగవాడి దయా ధర్మభిక్షలమీద ఆధారపడి వాడు నట్టేట్లో ముంచా డని ఆమె విచారించదు. "జీవితం పెద్ద సమస్య ఎప్పుడూ కాదు త్యాగీ! అవసరాలు పరిమితమైతే బ్రతుకు చాలా తేలిక ... సరే కొంచంసేపు నిద్రపోతాను" అన్నది సుమతి.

వాళ్ళిద్దరూ శవానికి దగ్గరలోనే వెన్ను వాల్చారు. శవం తలగట్టున ఉన్నదీపం కాక మరో కిరసనాయిలు దీపం వెలుగుతున్నది. ఆలోచనలు, వాదనలుఅన్నీ మసగవేయటం ప్రారంభించినయ్. కాని చిత్రమేమిటంటే ఇద్దరిమనసుల్లోనూ ఒకే సమయాన ఒకే ప్రశ్న రేగింది.

'ఇందాక కలిసినచేతులు ఇప్పుడు ఎందుకు కలవటం లేదు ?'

## 9

"శ్రీల దగ్గరనుంచి ఉత్తరం వచ్చిందా అన్నపూర్ణా!" అని గుమ్మం దాటుతూనే అడిగారు గోపాలరావుగారు.

"లేదు బావగారూ" అని పడమటింట్లోంచే సమా ధానం ఇచ్చింది ఆమె.

"నువ్వుగాని రాణివాసపు స్త్రీవా ఏమిటి? లోపలి నుంచే సమాధానం ఇస్తున్నావు? పాప నా కాళ్ళను చుట్ట వేసుకొంది. దాన్ని ఇయ్యి" అన్నారాయన. ఒంగి పిల్లని తీసుకోటం అంతటి ఉదాత్తకాయానికి చాలా అసంభవమైన విషయం.

అన్నపూర్ణ లోపలనుంచి వచ్చి పిల్లని ఆయనకి అందించి "లోకం వృథాగా అనుకుంటుందిగాని మిమ్మల్ని ఏ ఆడదీ ప్రేమించలేదు" అని నవ్వింది. గోపాలరావు అతికష్టంమీద మెడ తిప్పి–

"ని మాటకి తాత్పర్యం ఏమిటి?" అన్నారు.

"గోపాలరావుగారని పేరుపెట్టి గొప్ప తప్పు చేశారు మీ నాన్నగారు. గోవర్ధనరావుగారని పెట్టాల్సింది."

"అది సరే... లీల దగ్గరినించి ఉత్తరం..."

"తిండికీ బట్టకూ చింత లేదు—కాల్చుకుతినే మొగుడు లేడు... సంఘం మీవంకా నావంకా కళ్ళురిమిచూసినట్లు ఆమెవంక చూడదు. పైగా అది నాగరికత. సంపూర్ణ స్వతంత్రురాలు అది" అన్నది అన్నపూర్ణ.

"అలాగే కనిపిస్తోంది" అని తన మహాకాయాన్ని పడక కుర్చీలో వాల్చాడు ఆయన.

"రూప యవ్వనాలు చెడ్డవి బావగారూ! అవి ఎంత చెడ్డవంటే, ఏ దారీ లేనప్పుడు గోదారిలోనయినా దూకుతాయి. నన్ను చూడరాదూ చూస్తూ చూస్తూ..."

"సరే ఆపు... ఎప్పుడేం ఉపద్రవం విరుచుకు పడు తుందో తెలియకుండా ఉంది. బెజవాడనుంచి మా ప్లీడరు

గారు ఒకాయనవచ్చి... పోనీలే" అని మనుమరాల్ని ముద్దు చెయ్యటం ఆరంభించాడు ఆ వృద్ధుడు.

"ఇంతకూ సంగతి ఏమిటి?"

"అమ్మాయి ఎవరినో ......సరేలే అన్నపూర్ణా ఇప్పుడీ చర్చదేనికి? అల్లుడుకూడా అంతేనట. నా ఆస్తి అంతా పిల్ల పేరపెట్టి నిన్ను గార్డియనుగా వీలు రాస్తాను"

అన్నపూర్ణ వంగి గోపాలరావుగారి కళ్ళల్లోంచి నీళ్ళు రావటం స్పష్టంగా చూసింది. తన కొంగుతో ఆ కన్నీళ్ళని తుడిచి చాలాసేపు మెదలకుండా కూర్చుని ఉండిపోయింది.

"ఈ దేశంలో పుట్టిన తరువాత ఎప్పుడో ఒకసారి కన్నీళ్ళుపెట్టక తప్పదు బావగారూ–నేనే చూడండి! అత్తవారింట్లోనూ పుట్టింట్లోనూకూడా స్థానంలేకుండా చేసుకున్నాను" అంటూ ఉండగానే దుఃఖం ఆమె మాటని అడ్డివేసింది.

"నువ్వేమీ బాధపడకు అన్నపూర్ణా! తండ్రి బాధ్యతకు విరుద్ధంగా ఏదీచెయ్యకుండా చూస్తూఉండు. నేనీ అన్యాయాన్ని జరగనివ్వను."

కొంగుతో కళ్ళుతుడుచుకుని "మీరు జరగనివ్వక పోవచ్చును కాని అమ్మాయి పెద్దది; స్వతంత్రురాలు" అన్నది అన్నపూర్ణ.

కోపాన్ని ఆపుకోలేకపోయారు గోపాలరావుగారు. ఈ ప్రశ్న ఆయనని చాలాసేపటినుంచి వేధిస్తూఉంది. అన్యాయం జరగకుండా ఆపటం ఆయనకు ఏవిధంగాగానూ సాధ్యంకాదు.

"అవును...ఆ స్త్రీలో చిల్లిగవ్వ దానికి దక్కనివ్వను. ఇంతవరకూ నా శాంతాన్నేగాని కోపాన్ని ఎరగ రెవరూ" అన్నాడాయన.

"బాగుంది...ఆ కోపాన్ని మొదటనే లీలమీద ప్రయోగిస్తారా ఏమిటి?"

"అవును. హద్దూ అదుపూలేని ఆ దౌర్భాగ్యురాలికి అంతేకావాలి" అన్ని కొన్ని క్షణాలు ఊరుకొని-

"తల్లిలేని పిల్లని ఎలాపెంచానో, ఎలా పెద్దదాన్ని చేశానో దానికి తెలుసు. ఇనాళ్ళూ వాత్సల్యమే చూపించాను...ఇప్పుడు కర్తవ్యంఅంటే ఏమిటో తెలియపరుస్తాను. మొగవాడినైకూడా భార్యపోతే బిడ్డని ప్రాణప్రదంగా పెంచాను. స్త్రీ అయికూడా భర్త బ్రతికుండగానే భోగలాలసచేత బిడ్డనికూడా వదిలింది నా కూతురు. ఈ పాపం దేనికి జరిగింది? ఈ పాపవృక్షం తాలూకు బీజం ఈ జన్మలోదేనా? రేపే వీలు వ్రాసేస్తాను వాళ్ళకి - చిల్లిగవ్వ దక్కనియ్యకుండా"

"ఇది నిజమో అబద్ధమో తెలుసుకోకుండా ఎందుకలా తొందరపడతారు?... అయినా మీ వీలునామాకి అది భయపడకపోతే?"

"అప్పుడు దాని ఫలితం అనుభవిస్తారు. మహామహా దాంపత్యానికే దిక్కులేకుండా పోయింతర్వాత వ్యామోహం మాత్రం ఎంతకాలం అఘోరిస్తుంది?"

"నిజంగా అలాగే చేస్తారా?"

"అవును"

అన్నపూర్ణ సమాధానం చెప్పలేదు.

"సమాధానం చెప్పు!" అని గద్దించారాయన.

"ప్రపంచంలో అందరి అభిప్రాయాలూ ఒక మాదిరిగా ఉండవు బావగారూ! నేనేం సమాధానం చెప్పను!"

"అంటే"

"తెలివి తక్కువవాళ్ళని తెలివిగలవాడు శిక్షిస్తే అందులో గొప్పతనం ఏముంది?"

గోపాలరావుగారి మానసిక వ్యధకి అంతులేకుండా ఉంది "నేనింత దుర్మార్గుడిని అవటం దాన్ని చెడుదారినుంచి రక్షించటానికేగా!" అన్నాడాయన.

"చెడునించి రక్షించకపోగా, ఆ చెడుని మరింత పటిష్ఠం చేస్తున్నారు మీరు. చెడునుంచి తిరిగి రావటానికి మిగిలిఉన్న ఈ ఒక్కదారీ మీరు మూసివేస్తే ఆ చెడులోనే ఆమె శాశ్వతంగా ఉండిపోక తప్పదు. మీ మగజాతి స్త్రీ విషయంలో చేస్తూవస్తున్న పెద్ద పొరపాటు ఇదే. మీరు కూడా అదే పొరపాటు చెయ్యకండి. ఇంగ్లీషులో ప్రాడిగల్ సన్ కథ మీకు తెలిసే ఉంటుంది... దారి మూసివెయ్యకండి బావగారూ, లీల తిరిగి వస్తుంది" అన్నది అన్నపూర్ణ.

గోపాలరావుగారు కాతర దృష్టితో అన్నపూర్ణకేసి చూస్తూ చాలాసేపు ఉండిపోయారు. ఆయన ఒక్కమాట కూడా మాటాడలేదు. కండరాలతో మూసుకుపోయిన కళ్ళనుంచి అశ్రుధారలు అవిరామంగా ప్రవహించినయ్. కొంచెంసేపు ఇలాగే గడిచినతరువాత పొట్టమీద కూర్చున్న పసిదాని తల నిమురుతూ—

"తిరిగి వచ్చేదారి ఇప్పుడు వుంది అన్నపూర్ణా! నా కూతురు మొగుడిని వదిలిపెట్టిందనే విషయం నా చెవిన పడకూడదు" అన్నారు.

"అది అధర్మం బావగారూ! తప్పు తెలుసుకున్నప్పుడు దిద్దుకోటానికి అవకాశం ఉంచటమే ఉత్తమ మానవధర్మం. తప్పులు చేస్తూ ఉంటేగాని ఏది ఒప్పో తెలియదు. ఇలాగే యుగయుగాలుగా మానవుడు తనని తాను దిద్దుకుంటూ వస్తున్నాడు. దారి ఉంచాలి, అదే మన ధర్మం" అన్నది అన్నపూర్ణ.

గోపాలరావు గారికి అన్నపూర్ణ బోధనలు ఆట్టే తలకెక్కలేదు. లీల ఆయన కన్న కడుపు కాకుండా ఉంటే, పద్ధతి మరో విధంగా ఉండేది.

"లేదు అన్నపూర్ణా, ఈవిషయం చాలా అన్యాయం. ఇది ఆపటానికి మార్గంలేదా!" అన్నా రాయన.

"లేదు బావగారూ! స్వయంగా మీరే నేరంచేయుటం వలన నైతికంగా ఆమెని ఆజ్ఞాపించే హక్కు పోగొట్టుకున్న వారయ్యారు. ఆ స్థితిమొస్తు రాదని బెదిరించినా ప్రయోజనం లేదు"

"నేరం సంగతి నీకే బాగా తెలుసు. సరే పోనీ ఆగోల. ఆమె చేస్తున్నది సంప్రదాయానికే విరుద్ధం"

"సంప్రాదాయమంటే ఏమిటి? ప్రస్తుతం ఈసంధి యుగంలో ఎవరిసంప్రదాయాలు వారికేగాని పూర్వంఉన్నట్లు జాతికంతా ఒకే సంప్రదాయం కాదు"

"అలాకాదు. ఎప్పటికో ఒకనాటికి ఆమె తనతప్పును తెలుసుకుంటుంది-అప్పటికంతా మించి పోతుంది. ఆతర్వాత ఆమె పది కాలాలపాటు బ్రతకాలి గదా! తండ్రిగా ఆమె సుఖంకోసం ఆమెను శాసించటం తప్పుకాదేమో!"

"కాదు నిజమే...ఆమె వినాలికదా మరి! తప్పు తెలుసుకున్న రోజున ఆమె తిరిగివచ్చి 'నాన్నా' అంటే... 'అమ్మా ఫరవాలేదు, నేనున్నాను' అందురుగాని. ఇక దాన్ని గురించి ఆలోచించి మతిపోగొట్టుకోకండి" అన్నది అన్నపూర్ణ. చాలాసేపు గోపాలరావుగారు ఆలోచించారు. సమాధానం చెప్పటానికి విసుగనిపించింది. అయినా కొంచెం సేపటికి—

"తండ్రి దృష్టితో చూస్తుంటే లీల భవిష్యత్తు అగమ్యంగా ఉంది. ఆనాడూ అది నామాట వినలేదు. అయినా అది చేస్తున్నది ధర్మసమ్మతమైన పనిగనుక ఆమోదించాను. ఈనాడు అలాకాదు అన్నపూర్ణా—దాని బ్రతుకు వ్యామోహంలోపడి తలకిందులవుతుంటేకూడా చూస్తూ ఊరుకోవటమే నా ధర్మం అంటావా!" అన్నారు.

"నేను తల్లినైతే అంతే చెసేదాన్ని. భవిష్యత్తుని గురించి వ్యధపడటం ఎలాగూ తప్పదు. అయినా ఈ విధంగా అడ్డుపడటంలో అర్థంలేదు."

"దిక్కుమాలిన వ్యామోహంతో హితాహితజ్ఞానం పోగొట్టుకుంది. అది ప్రేమకాదు, వ్యామోహం. దానినుంచి లీలని రక్షించాలి" అని ఉద్రేకంగా అన్నారు ఆయన.

"ప్రేమకీ వ్యామోహానికీ గణితం కడితే ఎలాగ? మోహం క్షణికమే కావచ్చు. ఆ క్షణమే చాలు - బ్రతుకు నంతా వెలిగించటానికి" అన్నది అన్నపూర్ణ.

ఈసారి గోపాలరావుగారు నిజంగానే ఆశ్చర్యపడ్డారు. అన్నపూర్ణ చాలా చదివిందని ఆయనకి తెలుసుగాని ఇంత చదివిందని ఆయనకి తెలియదు.

"విదేశాల్లో విడాకులు అలవాటు. అది వారికి సర్వ సామాన్యమైన విషయం. ఆ కొలత బద్దతోనే మన సంఘానికికూడా కొలతలు నిర్ణయించాలటే అది తెలివి తక్కువే అవుతుంది, ఒప్పుకుంటాను —కాని బావగారూ, మొద్దు జీవితం గడపటంమాత్రం జీవన వికాసానికి తోడ్పడు తుందంటారా?" అన్నది అన్నపూర్ణ.

"మన దేశంలోసంఘవ్యవస్థఉన్నతమైనదిఅన్నపూర్ణా! బాధ్యత వధూవరులమీదకన్న తల్లిదండ్రులమీద ఎక్కువగా ఉంటుంది."

"లీలకి అది అవసరంలేదు. ఆమె వెతుక్కుంటున్నది ఒక రకమైన నిషాని. అది త్యాగరాజులు ఇవ్వలేక పోయి నాడు. అందుకే ఇలా జరుగుతున్నది. కాని ఆ నిషా ఉత్త అర్థరహితమని తెలుసుకున్న రోజున ఆమె ధర్మ పథంలో తిరిగీ అడుగు పెడుతుంది; సాక్షిగా ప్రయాణిస్తుంది. ఇప్పుడు బలవంతాన ఆమెను ధర్మపథంలోకి లాక్కువస్తే మళ్ళీ పారి పోవచ్చును."

"అయితే ఈ దరిద్రపు వ్యవహారం ఇలా సాగనివ్వ టమే మంచిదని నీ అభిప్రాయమా ?"

"ఒకవేళ నిజంగానే లీల మరోవ్యక్తిని ప్రేమిస్తున్న ప్పుడు అది దరిద్రపువ్యవహారంఅని ఎలాగ అనుకోగలం బావ గారూ ?"

"అదేగా నేను ఏడిచేది ? అది ప్రేమేమిటి నా మొహం ! అదోమత్తు. అది త్వరలోనే దిగిపోతుంది."

"మత్తుమాత్రమేనా దిగిపొయ్యేది ? ఈ పాడు ప్రపంచంలో యదార్థమైన ప్రేమకూడా ఒకొక్కప్పుడు దిగిపోతూ ఉంటుంది. అందుకే కొన్ని దేశాల్లో పెళ్ళిళ్ళు అలా క్షణ భంగురాలై పోతున్నాయి. అందుకు విచారం మాత్రం దేనికంటాను ?"

"కావచ్చును. మరి భారతీయ వికాసం జీవిత పర్యంతం భగ్నం కాదు. మరి దాని సంగతి ఏమిటి ?"

"అది అర్థంలేని రాగమాదకత కాదు - లెక్కల ప్రకారం కట్టిన ఒక ప్రాజెక్టు. లెక్కల్లో అంచనా తప్ప వంతవరకూ జీవన ప్రవాహం సాగిపోతూ సంఘ కేదారాల్ని సస్యశ్యామలం చేస్తూ ఉంటుంది. మనదేశంలో పెళ్ళిళ్ళు వ్యక్తికి సంబంధించినవి కాదు - సంఘానికి సంబంధించినవి. ప్రాశ్చాత్యులలో అలా కాదు. వ్యక్తి సంబంధం... ప్రేమ కూడా వ్యక్తి సంబంధమే. లీల చేసుకున్న పెళ్ళి వ్యక్తి సంబంధమైనదే. అందుకే విచ్ఛిన్నమయింది."

"అంటే, ప్రేమ వివాహం విచ్ఛిన్న మవుతుం దంటావా ?"

"తప్పకుండా. ప్రేమ అనేది వైల్డ్ ఫైర్. ఇంట్లోకి రాని చంద్రకాంతి. ఆ నిషాని నిషాగానే ఉండనియ్యకుండా వివాహ పంజరంలో బిగిస్తే ఎప్పుడో ఒకప్పుడు ఎగిరి పంజరం ఖాళీ అవక తప్పదు. పంజరాన్ని నింపటానికి తిరిగీ ప్రయత్నం చేస్తుంది అంతర్యం. అదే అవినీతి మన సొసైటీలో."

"మరి ప్రేమనీ పెళ్ళినీ కలపకపోవటం మాత్రం అవినీతి కాదా ?"

"కావచ్చును... మనిషి ఎప్పుడూ రెండు మూ రకాల జీవితం జీవిస్తూనే ఉంటాడు. తండ్రిగా, భర్త కొడుకుగా, ఉద్యోగిగానూ—అలాగే ప్రియుడుగాకూడా స్తాడు. అందువల్ల సొసైటకి ప్రమాదం లేదు; అతని నిషాకీ తృప్తి కలుగుతుంది. వివాహాన్ని సంఘ సంబంధంగానే ఉంచకుండా వ్యక్తి సంబంధంగా మార్చటమే నేటి యువతీ యువకులు చేస్తున్న పెద్ద పొరపాటు" అన్నది అన్నపూర్ణ. తెల్లబోయి ఆమెవంక చూడటం ప్రారంభించారు గోపాల రావుగారు.

"నా కొకటే భయం. లీల తిరిగ పెళ్ళి చేసుకుంటుం దేమో నని" అన్నది తిరిగి ఆమె.

"అది సరేగాని త్యాగరాజులు మాటేమిటి ?"

"అదేమిటి ?"

"అతనుకూడా మరో అమ్మాయితో ఉన్నాడట... సుమతిని ఎరుదువుగా -ఆమె."

"ఎరుగుదును...కాని ఆమె పిరికిది. ఆదర్శపు మత్తు మందు అధికముగానే సేవించింది. ఏ విధమైన ప్రమాదమూ ఆమె వలన రాదు. భయం అంతా లీలతోనే" అన్నది ఆమె. కొంచెంసేపు ఎవరూ మాట్లాడలేదు.

"సరే లేవండి- ఇకమీరు భోజనం చేద్దురుగాని, పిల్ల నిద్రపోయింది" అని ఆయన పొట్టమీద పడుకున్న పిల్లని లేవదీసింది అన్నపూర్ణ. పడమటింటిదాకా వెళ్ళి అక్కడ ఆగి-

"ఇదికూడా ఆడపిల్లే అయింది బావగారూ! అదే నా ...ారం. పైగా తల్లిప్రేమకీ తండ్రిప్రేమకీకూడా వంచితు ...లు" అని తిరిగి సాగిపోయింది ఆమె.

# 10

క్లబ్ వార్షికోత్సవం జూన్ పదవ తేదీ అవటం వలన ఆరోజున ఫ్యాన్సీడ్రెస్ డాన్స్ ప్రోగ్రాం పెట్టారు. లీల లైలా వేషం వెయ్యాలని నిర్ణయించుకుంది.

విజయవాడ నగరంలో చూడాల్సినవి కొన్ని ఉన్నాయ్. ఒకటి కృష్ణవేణీనదికి మణిమేఖల అయిన కృష్ణా బారేజి. ఇది దాటుతుంటేనే విజయవాడ తన మెరుపులతో భ్రమింప చేస్తుంది.

రెండవది కనకదుర్గాదేవి ఆలయం. ప్రపంచ పర్య వేక్షణ చేస్తున్న ఆ జగన్మాత దృష్టి కొండ అడ్డు ఉండటం వలనకాబోలు; విజయవాడమీద అట్టే ప్రసరించటం లేదు.

మూడవది బిజినెస్‌బజార్ స్టాక్ - ఎక్స్‌ఛేంజి -అంటే అది ఒక వ్యాపారకూడలి. అక్కడ కొన్ని బలమైన రాబందులు బలహీనపు జంతువులకి మిగిలిఉన్న కొద్దిపాటిరక్తమూ పీల్చేసే స్థలం. లక్షలకొద్దీ యివ్వటా తీసుకోవటం— టెలిఫోనుమీద పదివేలరూపాయల ధాన్యంకొని అయిదు నిముషాల తరువాత అమ్మివేసి అమితమైన లాభం రాబట్టటం- బంగారపు అచ్చులు ఇటుక రాళ్ళలాగా తూచి ఇనప్పెట్టెల్లో పెట్టటం అక్కడచాలా సర్వసామాన్యమైన విషయం.

పెద్ద పెద్ద పొట్టలమీద గోధుమవన్నె సిల్కులాల్చీలు మెరిసేస్థలం. బండవేళ్ళకి రవ్వల ఉంగరాలు అలంకరింపబడేచోటు. అనర్హులకి అదృష్టం పట్టేప్రదేశం. విజయవాడ నగరపు సర్వసౌభాగ్యం చిటికెనవ్రేలి ఉంగరం అమ్మి కొనగలవారు వారు.

నాలుగవది క్లబ్బు. సభ్యమానవులకు నాగరిక సంచారస్థలం. ఈ క్లబ్బులో రోజుకొక వింత పుడుతుంది. రోజూ ఒకక్రొత్త ఆట ఆడుతారు. బ్రిడ్జి రమ్మిలాటి ఆటల్లో వేలకి వేలు ప్రవహించి పోతూఉంటాయి. ఇంకో మాదిరిగా చెప్పాలంటే క్లబ్బులోని మనుషులకీ విజయవాడ నగరపు ఆంధ్రత్వానికీ ఏ విధమైన సంబంధమూలేదు. తినేతిండి దొరలతిండ్లు-ఇచ్చే బిల్లులు బేకరీలకి-త్రాగటానికి బ్రాందీ విస్కీ-షాంపేనులు అంత ఎక్కువగా కాకపోయినా కొంతవరకు ఫరవాలేదు. జింజర్‌బీర్ యిత్యాదులు సెలయేళ్ళై ప్రవహిస్తాయి. ఇంగ్లీషువాద్య సంగీతంకి అనుగుణంగా బాల్‌రూమ్‌డాన్సులు మహాజోరుగా సాగుతుంటాయి.

దుబ్బుతలల మగవాళ్లూ — క్రాపు చేయించుకున్న ఆడవాళ్ళూకూడా అక్కడ కనుల పండువ చేస్తూ ఉంటారు. ఆ విచ్చలవిడికి నాగరికత అనీ కల్చర్ అనీ పేర్లు! లిఫ్‌స్టిక్‌తో రాగరంజితాలైన అధరాలు — రూజ్‌తో మందార మొగ్గలైన బుగ్గలు — క్రీములతో చంద్రవంకలైన ఫాలతలాలు- ఈవెనింగ్ ఇన్ లండన్ సెంట్లు — మాదకతకి మొదటి మెట్లు. ఆ క్లబ్బులో అన్నీ జరుగుతాయ్.

గేంబ్లింగ్, హంబగ్, పాలిటిక్స్, కమీషను వ్యాపారం, ఫ్రీ లవ్,

విడాకులు — ఇలాటివి కావలసినన్ని.' లలితతోపాటు ప్రప్రథమంగా ఆ క్లబ్బులో పాదం మోపిననాడే అందర్నీ ఆకర్షించింది లీల. అయితే ఒక వారంకిందట గిరినందిని ఆ క్లబ్బులో మెంబరయింది. ఆమెకి చాకిలెటీ అని మరో పేరు పెట్టాడు, చరిత్రాత్మకంగా ఆమెగారి మాజీ ప్రేమికుడైన మనోహర్‌దాస్ టికమ్‌దాస్. చాక్లెట్‌లాగా తియ్యగా రుచిగా ఉండటంవలన ఆమెకి చాకిలెటీ అనే నామకరణం చేశాడు అతను. చాకిలెట్ క్లబ్బులో ప్రవేశించిన రోజున క్లబ్బంతా, అల్లకల్లోలమైపోయింది. ఈ కల్లోలం ఆమె అందగత్తె అని కాదు — విలాసవతీ అనీ కాదు-గొప్ప నాట్యగత్తె అనీ కాదు. కేవలం అండర్‌వేర్ మీద నైలాన్ వలిపం ధరించినందుకు.

క్లబ్బులో ఆమె అడుగుపెట్టీ పెట్టగానే మగవాళ్ళంతా తన్మయులైపోయినారు. దిక్కుమాలిన ఆంధ్రదేశానికి

అనాగరికతకు నడిబొడ్డయిన విజయవాడలో చాకిలెటీ బ్యూటీ వేయి హృదయాల్లో దీపం వెలిగించింది.

కొంతమంది గయ్యిమని ఈలలు వేస్తే మరికొంతమంది చప్పట్లు చరిచారు. వండర్‌ఫుల్, ట్రెమెండస్, మార్వెలస్ మొదలైన వాక్యాలు పూలగుత్తుల్లావచ్చి తగిలితే బుకేకట్టి చేతిలో పట్టుకుని ముందుకు నడిచింది, చాకిలెటీ సుందరి. శ్రీ సభ్యరాంద్రుమాత్రం నిమ్మకాయరసం నాలికమీద పెట్టుకున్నట్లు మొగాలు చిట్లించి – 'ఛీ, ఛీ భారతీయ సంప్రదాయానికి ఎంత విరుద్ధం' అని పైకి అన్నారు. మర్నాడు ముత్యాలు కుట్టిన అండర్ వేర్ ఎక్కడ దొరుకుతుందో ఎంక్వయిరీ చెయ్యాలని ఎవ్వరికివారే నిర్ణయించుకున్నారు.

సరే చాకిలెటీ క్లబ్బులోకి రావటం నటేశ్వరంతో వచ్చింది – వెళ్ళటం మాత్రం మాజీ జమీందారు సింహాద్రి అప్పారావుతో రాత్రి ఒంటిగంటకి వెళ్ళిపోయింది. క్లబ్బు ఆవరణలో మాజీ జమీందార్ బేబీ ఆస్టిన్ నిలుచునిఉంది. అతిప్రేమగా ఆమెభారం మోస్తూ నడిపించుకు వెళ్ళాడతను.

అక్కడనే ఒక చెట్టుకింద నల్లని ఆంగ్లో ఇండియను యవ్వనవతి – ఒక భిక్షుకి నిలబడిఉంది. ఆమె ఎక్కడినుంచి వచ్చిందో ఎవరికీ తెలియదు. చాకిలెటీ క్లబ్బులోకి వచ్చిన నాడే ఆమెకూడావచ్చి చెట్టుకింద కాపరం పెట్టింది. ఆమె మాట్లాడే భాష చిత్రంగా ఉంటుంది. త్యేంక్యూసార్... నమస్తే సాబ్ – దండాలు మేడమ్ ఇత్యాదయః – ఆమె పేరు బ్రౌంటీ స్వీటీ అని అనటం క్లబ్బు ఫ్యూన్లు విని అందరికీ చెప్పారు. ఇప్పుడు అక్కడవున్న మైలురాయిమీద కాలు

అనించి చీకటి చాటున కిలకిల లాడుతున్నది - బ్రాంటీ నడుం చుట్టూ ఎవరిదో చెయ్యి ఆమె పెదవులమధ్య తాజ్‌మహల్ బీడీ ఉన్నయ్యి. ఆ దృశ్యం చాకిలెటీ కంటపడింది.

బ్రాంటీకూడా చాకిలెటీని చూసింది. నిర్లక్ష్యంగా తల తిప్పి బీడీ దమ్ములాగి కారులైట్ల కాంతిలో కళకళలాడి పోయింది ఆమె.

చేతిలో చెయ్యి వేసుకొని కారులో కూర్చుని జమీం దారు నుద్దేశించి "షేమ్ లెస్ వుమన్" అన్నది. చాకిలెటీ; పోతున్న కారు వంక ఎక్కిరింపుగా చూచి పక్క నున్న లారీ డ్రైవరు భుజంతట్టి "షేమ్ లెస్ వుమన్" అన్నది బ్రాంటీ.

వారం రోజులయినా తిరక్కుండానే క్లబ్బులోని సభ్య మహిళలు ముత్యాలుకుట్టిన అండర్‌వేర్స్ ధరించారు. దాని వలన చాకిలెటీ గర్వం పెరగటమే కాకుండా దౌర్భాగ్య పురుషజాతి సౌభాగ్యానికి పరిమితి అంటూ లేకుండాపోయింది. అంతేకాదు, ఆ మర్నాడే చాకిలెటీ బాబ్ చేయించుకుంది కూడా. సాయంత్రం క్లబ్బులోకి వెళ్ళేసరికి మనోహరదాస్ బ్రహ్మానందపడిపోయి- .

"బ్రతికించావు డార్లింగ్! ఆ చేంతాడు జుట్టుకి స్వస్తి చెప్పేశావు" అన్నాడు.

"అదికాదు డియర్! ఈ పాడు జుట్టుని గంట దువ్వు కోవాల్సివస్తున్నది-టైమ్‌వేస్ట్" అన్నది ఆమె.

ఆ రాత్రి చాకిలెటీ మనోహర్‌తో నృత్యం చేస్తున్న సమయంలోనే - చెట్టుకింద నిలబడ్డ బ్రాంటీ తన బాబ్డ్

హెయిర్‌ని దుర్భావనతో నొక్కులు తీరుస్తూ 'వెధవజుట్టు మొత్తం తీయించేస్తే హాయి' అనుకుంది.

అప్పుడే - మిస్టర్ మనోహర్, శ్రీరామదాస్, శివకామసుందరం, నటుడు కురంగేశ్వరరావు, మిస్టర్ డేవిడ్ ఇలాటి భక్తులతో చాకిలెటీ బయటకు వచ్చేసరికి నటుడు కురంగేశ్వరరావు కొత్త కారు నిలబడి ఉంది. చాక్‌లెటీ ఒయ్యారంగా వెళ్ళి అతని కారులో జేరబడ్డది.

మిస్టర్ డేవిడ్ నిరాశాతప్త స్వరంతో "కురంగ్, నీవెప్పుడూ అదృష్టవంతుడివే" అని నిట్టూర్చాడు.

కురంగేశ్వరరావు నడక గర్వంతో మరింత ఠీవిగా సాగింది.

మిస్టర్ మనోహర్ సిగరెట్ కేస్ చాకిలెటీకి అందిస్తూ "సిగరెట్ తీసుకో డియర్" అన్నాడు.

చాకిలెటీ సిగరెట్ అందుకునేసరికి శివకామసుందరం లైటరుతో దాన్ని వెలిగించాడు.

వెలిగించిన సిగరెట్‌నుంచి గట్టిగా పొగపీల్చి అటు కేసి చూసింది చాకిలెటీ.

అక్కడా అదే దృశ్యం.

బాబ్ చేసిన తలతో నోట్లో బీడీతో డ్రయివర్లు-వంటవాళ్ళు - బట్లరులు - ఇత్యాది మహా భక్తులతో పరివేష్టితురాలై కిలకిలా నవ్వి చప్పట్లు చరుస్తున్నది బ్రౌంటీస్వీటీ.

చాకిలెటీకి ఆ దృశ్యం అసహ్యంగా కనిపించింది. తనని ఆమె ఎక్కిరిస్తున్నట్లుగా అనిపించి. తన చేతిలోని సిగరెట్‌ని

విసిరికొట్టి కురంగేశ్వరరావు వంక తిరిగి "లెటజ్ గో" అన్నది.

పడిపోయిన సిగరెట్‌ని తీసుకుని ఒక దమ్ములాగి ఒయ్యారంగా ఒళ్ళువిరచి విసుగ్గా చూచింది, బ్రాంటీ. జనం అంతా తెల్ల మొహాల్తో జారుకున్నారు.

"పదవే డియర్, దొరగారు ఊళ్ళోలేరు. కారు మన చేతిలో వుంది - పోదాం పా" అంటూ బయలుదేరాడు మిలిటరీలోనుంచీ వచ్చి డ్రైవరుగా పనిచేస్తున్న యదు.

వారం రోజులు తిరగక మునుపే కురంగేశ్వరరావంటే తిక్కరేగింది చాకిలెటీకి. అతడిని వదిలిపెట్టి స్టాక్ బ్రోకరు సింహాచలంతో నేస్తం కలిపింది ఆమె.

దొరగారు కాంప్‌నుంచి రావటంతో యదుమీద మోజుపోయింది బ్రాంటీకి - అతడిని వదలిపెట్టి ఖాన్ సాహెబ్ గారి వంట వాడితో స్నేహం కలిపింది ఆమె.

క్లబ్ లోపల చాకిలెటీ ప్రేమికులు దినదినాభి వృద్ధి చెందుతున్నారు; క్లబ్బుబయట చెట్టుక్రింద బ్రాంటీకి ఆరాధకులు జాస్తి అవుతున్నారు. ఆమె దర్బారు, ఈమె దర్బారు కూడా జోహుకుం గాళ్ళతో నిండి ఉన్నది.

క్లబ్బులో రన్ మోర్ లో వందరూపాయలనోట్లు ఒడ్డుతున్నది చాకిలెటీ - క్లబ్బు బయట పులిజూదంలో నయాపైసలు ఒడ్డుకున్నది బ్రాంటీ. ఆమె వేష భాషలుకూడా పూర్తిగా మారిపోయినాయి. ఇప్పుడు చాకిలెటీకి నకలుగా తయారయింది.

ఇలాఉండగా జూన్ పదవతేదీన లైలా వేషం వెయ్యనే వేసింది చాకిలెటీ. లీలకాస్తా తెల్లబోయింది, ఆ వేషానికి. చాకిలెటీ వేషం ముందు తనది పేలవంగా ఉంది.

లైలా వేషంలో చాకిలెటీ క్లబ్బులోకి వచ్చేసరికి అక్కడఉన్న సభ్యపురుషులంతా ఆశ్చర్యపోయి, ఈలలు వేశారు. కొందరి నోటినుంచి 'వికితావుల లీలా మన జాలినా చాలుగా, నీవే నేనుగా' అనే పాటకూడా బయటకి దూకింది.

ఒక ప్రక్కనుంచి ఎవరో అరిచారు: "లైలా నీముం బలాదూర్"

"ఆవేషం భానుమతికన్నా నువ్వువేస్తే చాలా బాగుం డేది" ఆ వాక్యాలకి పర్షియన్ పద్ధతిలో లైలా లాగే సలాం చేసింది చాకిలెటీ. చప్పట్లు మారుమోగి పోయినాయి.

రెండునెల్లనుంచీ బిజినెస్ టూర్ వెళ్ళిన సాంబశివ రావు ఈ ఉదయమే తిరిగివచ్చి లీల లైలా వేస్తున్నదని తెలుసుకుని తను మజ్నూవేషం వేసుకుని క్లబ్బుకి వచ్చాడు.

తీరాచూస్తే చాకిలెటీ మరో లైలాగా తయారైంది అక్కడ. ఆమెను గురించికూడా అతను ఇందాక విన్నాడు.

సరాసరి ఆమె దగ్గరికి వెళ్ళి "మీరు లైలా అయితే నేను ఖయిస్ని. అసలు నామధేయం సాంబశివరావు" అని చేయి నొక్కాడు.

"ఓహో మీరేనా, మిలియనీర్ సాంబశివరావు!" ఆనందంతో అడిగింది చాకిలెటీ.

"అయితే మీరేనా రాణీ ఆఫ్ ది క్లబ్!" అని ఆమె చేతిని మరోసారి నొక్కాడు సాంబశివరావు. ఆ స్పర్శతో నూతనానుభూతి పొందింది చాకిలెటీ.

"షల్ వుయ్ డాన్స్ లైలా?" అని జవాబుకోసం ఆగకుండా చాకిలెటీని డాన్స్‌ఫ్లోర్‌లోకి లాక్కు పోయినాడు సాంబశివరావు. లీల తెల్లబోయింది. అంతరాంతరంలో ఏనాడూ వాంఛించని సాంబులు మరో స్త్రీతో అంత సన్నిహితంగా ఉండటం చూసి అసూయపడటం ప్రారంభించింది. ఇదిచూసిన లలిత తనలో తనే నవ్వుకుంది. భారత దేశపు పతివ్రతలు సాంబశివరావు బిజినెస్‌కి పనికిరారని ఆమె ఏనాడో గ్రహించింది.

అయినాగాని సాంబులు లీలకి జీతం ఎందుకిస్తున్నాడో అర్థంకాలేదు. "ఊరికినే యివ్వటం లేదు - ఆమె అతనికి పెట్" అన్నాడు స్వామి. 'బహుశా అదే నిజం అయివుంటుంది; ఈ మధ్య వాళ్ళిద్దరిమీదా చాలా పుకార్లు రేగినయ్. ప్రేమపాత్రుడు చేతిలోంచి జారిపోయినట్లే' అనుకుంది లలిత.

లీల అతన్ని ఏనాడూ ప్రేమించ లేదన్న విషయం ఆమె ఊహకికూడా అందదు. ఈ వాతావరణంలో సక్రమ సంబంధం కలిగిన స్త్రీపురుషులు ఎవరైనా ఉంటే వారిని వెలి వేస్తారు - చిత్రంగా చూస్తారు. అందుకే ప్రతివాళ్ళు ఇష్టమున్నా లేకపోయినా అలాగే నటిస్తారు. కొన్నాళ్ళకు అది అలవాటయి మరికొన్నాళ్ళకు నిజంకూడా అవుతుంది.

ఇప్పుడీ చాకిలెటీ క్లబ్బునంతటినీ ఏకఛత్రంకింద పరిపాలిస్తున్నది.

బయట చెట్టుకింద కూడా బ్రాంటీ ఆరాధకుల గుంపా కొలువుతీరి వుంది. వాళ్ళల్లో మరో నూతనుడు చేరాడు. అతను సినిమాల్లో కత్తియుద్ధంచేసే స్టంటురాముడు. ఇవ్వాళ సాయంత్రమే అతనా గుంపుని రెండుసాయలు చేసి జొరబడి "పిల్లా కమ్ హియర్" అన్నాడు. ఒయ్యారంగా వెళ్ళింది బ్రాంటీ.

"వాటీజ్ యువర్ నేమ్"

"బ్రాంటీ స్వీటీ"

"నైస్" అని దానిచేతిని తన చేతిలోకి తీసుకున్నాడు అతను.

క్లబ్బులో డాన్స్ జోరుగా సాగిపోతున్నది. అక్కడ స్త్రీ పురుషులు లైలాని ఖయిస్ని ఈర్ష్యగా చూస్తున్నారు. మరో లైలా సంగతి ఎవరికీ పట్టలేదు. ఇంతలో మరోకొత్త ట్యూన్ వాయించటం ప్రారంభించారు బ్యాండువాళ్ళు. అది అందరికీ సుపరిచితమైనదే. అందులో ఒకరు అందుకున్నారు:

'ఓ మైసార్, కమ్ కమ్ కమ్
ఓమైసార్ ఐ లవ్ యు'

మిగిలిన జనమంతా ఆస్వరములో స్వరాలు కలిపి అరవటం ప్రారంభించారు. చప్పట్లు జోరుగా సాగుతున్నాయి. క్లబ్బు కిటికీలలోంచి ఆ సంగీత స్వరాలు వీధిలోకి ప్రవహించి చెట్టు కింద కొలువై ఉన్న బ్రాంటీ బృందం చెవుల్లో పడ్డాయి.

వెంటనే అందుకున్నాడు స్టంట్ రాములు -

'ఓమైసార్, కమ్ కమ్ కమ్

ఓమైసార్ ఐ లవ్‌యు'

'జిందగీమె ఏక్ బార్ ఆనా సింగపూర్' స్వరం కలిపింది బ్రాంటీ. ఆమె స్వరంలో స్వరంకలిపి రిషావాలాలు, జట్కావాళ్ళు, జేబు దొంగలు, హోటలు క్లీనర్లు, అందరూ పాడుతున్నారు.

'జిందగీమె ఏక్ బార్, ఆనా సింగపూర్'

క్లబ్బులో ఈ స్వరం ప్రవేశించింది. అనుకోకుండానే హమ్ చేసింది. చాకిలెటీ. ఆమె స్వరంలో స్వరం కలిపి లఘాధికార్లు డాక్టర్లు, ప్రొఫెసర్లు, వ్యాపారస్తులు, నటులు అందరూ పాడుతున్నారు.

'జిందగీమె ఏక్ బార్, ఆనా సింగపూర్'

క్లబ్బు లోపలా బయటా అంతా కూడా ఒకే ఒక ఉద్రేకం ప్రవహిస్తున్నది. ఒకేస్వరం, ఒకే తాళం, ఒకేలయ!

'జిందగీమె ఏక్ బార్, ఆనా సింగపూర్'

తాము ఎందుకలా నృత్యం చేస్తున్నారో, నృత్యం చేస్తున్న ఆపాదాలు తమని ఏ అంచుకి నడిపిస్తాయో తెలుసుకునే స్థితిలోఅక్కడెవరూ లేరు. ఆవేశంతో ఆవేగంతో ఆత్రతతో ఒకరి నొకరు కౌగలించుకొని ఒకరి అరచేతిలో మరొకరి చూపుడు వేలు గుచ్చుకుంటూ నృత్యం చేస్తున్నారు. లోపలాబయటా అంతాఒకేవాంఛ, ఒకేదాహం, ఒకేతృష్ణ!

క్లబ్బు బయట స్టంటు రాములు బ్రాంటీని చూసి "నాతో ఉండిపో" అన్నాడు.

క్లబ్బులోపల చాకిలెటీ సాంబుల్ని ఉద్దేశించి "యస్ డియర్, అలాగే" అంది.

* * *

"అది కాదు లీలా, నువ్వు మరింత హుషారుగా ఉండాలిగాని ఇలా నీరు కారిపోతే ఎలా?" అన్నది లలిత.

లీల మనసులో అర్థరహితమైన అసూయ ఏదో చెల రేగుతున్నది.

నిజం చెప్పాలంటే మానసికంగా వంధ్య లీల. శారీర కంగా గట్టిది. ప్రతి స్త్రీకూడా అంతేనేమో! స్త్రీ తన కృత్రి మపు తెలివి తేటలతో మగవాడిని దిగ్భ్రాంతుడిని చేస్తుంది. కాని అతడి తెలివి తేటలకి అనుక్షణమూ భయపడు తూనే ఉంటుంది. ఆ తెలివి తేటలతో తన నెక్కడ కాదం టాడో అని పూర్తిగా తనదైన వెన్నెలని ఎండగా మార్చ టానికి ఆమె ప్రయత్నిస్తూ ఉంటుంది. ఎండ అతనిది గనుక, మగవాడు తనని మరచిపోకుండా ప్రయత్నించటమే ఆమె జీవితధ్యేయం.

తమాషా ఏమిటంటే స్త్రీని మరచి పోవటమే అతని జీవితధ్యేయం. ఆమెను విస్మరించి సృజనాత్మకమైన ఇతర వ్యాపృత్తులలో కలసిపోవాలని అతని ఉద్దేశం. ఎంతముందుకు సాగినా కృషిని గురించిన ప్రయత్నం కృషికన్నా తక్కువ గానే ఉంటుంది.

స్త్రీకి ఫలశృతి క్రియలో అయితే; పురుషుడి ఫలశృతి ఆలోచనలో.

మగవాడి మోహం స్త్రీ శరీరానికి తృప్తి నిస్తుంది. ఆమె మనసులో ఉండే అసంతృప్తి అలాగే మిగిలి పోతూ ఉంటుంది. ఆమె అంతర్యంలో ఎప్పుడూ ఒక భయం నిండి ఉంటుంది. తను ప్రేమించని - దగ్గరలేని సమయాల్లో పురుషుడు తనచేతిలోంచి జారిపోతాడని.

తనతో సుఖం పొందని వేళల్లో మగవాడు తనబారి నుంచి జారిపోయి పౌరుషపు ప్రాకారంలో ఉండిపోతున్నాడని ఆమె బాధ. కానీ అక్కడికి వెళ్ళేశక్తి మాత్రం ఆమెకు ఇవ్వలేదు. అంతేకాదు, మగవాడు ఏది ఆలోచిస్తున్నాగాని మరో స్త్రీని గురించేనేమో అని ఆమె భ్రమిస్తూ ఉంటుంది. అందులో లీలలాంటి ఆడవాళ్ళకి మరోరకం ఆలోచనలూ భావనలూ ఉంటాయనికూడా అర్థం చేసుకొనే తెలివితేటలు ఉండవు. తాత్విక వేదాంత జీవిత సమస్యలు వాళ్ళ మేధస్సుకి అతీతం.

సౌందర్యం అంటే తమదే. తమలోని సౌందర్య రసాస్వాదనలోనే మగవాడి జీవితం ధన్యం అవుతుంది. ఇలాంటి ఊహాలు లీలకికూడా ఉన్నాయి. అందుకే చాకిలెటీతో సాంబులు నృత్యం చేస్తే అసూయపడింది. నిజానికి సాంబులుకీ తనకీ మధ్య ఏవిధమైన మోహమూ లేదు.

"చాకిలెటీ అసలు పేరేమిటి ?" అన్నది లీల. లలిత ప్రశ్నకి అది సమాధానం కాదు. అయినా లలిత సమాధానం ఇచ్చింది:

"గిరినందిని"

లీల సమాధానం చెప్పలేదు. ఆమె అహంకారం చాలా దెబ్బతిన్నది. కొన్ని రోజులనుంచీ త్యాగరాజులు కబురుకూడా తెలియటం లేదు. పాప ఎలా ఉందో ఉత్తరం లేదు. అకర్మణ్యుడూ స్థూలకాయుడూ అయిన తండ్రికికూడా బహుశా తనమీద కోపం వచ్చే ఉంటుంది.

ఇందర్ని ఎదిరించి తను పొందగలిగింది ఏముంది? ఓటమి తప్ప ... చివరికి మిగిలింది ఏమీ లేదు.

పువ్వులు త్వరగా వాడిపోతాయి.... ప్రేమా అనురాగం రెండూ కూడా అంతే. అందుకని చెప్పి కాగితం పూలతో అలంకరించుకోలేము.... కాని అలంకరించుకునే వారు కొందరు లేకపోలేదు.

నిజం చెప్పాలంటే ఏ సంతోషమూ స్థిరమైనది కాదు, అస్థిరత్వం. ఆసంతోషం కొద్ది కాలమే కావచ్చు కాని అది అసత్యమూ కాదు- ఆ రోజులే జీవితంలోని మధువాహినులు అయితే-ఆ మధువాహినినే నిరంతరం ప్రవహింపచేద్దామని ప్రయత్నిస్తే అది భ్రమే అవుతుంది - ఆ వాహినిఇంకిపోతుంది. అందుకనే పెళ్ళిలోశాశ్వతత్వం ఉ మోగాని; మాధుర్యంలేదు. భరించలేని శాశ్వతత్వప్రసం రెండు వాళ్ళకీతగిలించుకుని మాధుర్యం కుంటిదై పోతున్నది.

ఒకప్పుడు త్యాగరాజుల్ని తను అమితంగా ప్రేమించింది. ఆ ప్రేమకోసం తండ్రిని ఎదిరించింది. ఆరోజున అది నిజంగానే ఒక మధువాహిని. ఈ రోజున దాని చిహ్నాలు కూడా మిగలలేదు. ఎక్కడున్నది ఈ పొరపాటు?

సీతా సావిత్రి మొదలైనవారు ఏ సూత్రంతో తమ ప్రేమని ఉజ్వల జ్వాలిగా మలుపుకో గలిగారు? ఆ రహస్య మేమిటి? లీల నిట్టూర్చింది. ఇందాకటి నుంచీ లలిత ఆమెని పరీక్షిస్తూనే ఉంది.

"ఏమిటి ఆలోచిస్తున్నావు లీలా?" అన్నది, కొంగు వేలికి మెలి వేసుకుంటూ.

"హల్లో శ్రీమతీజీ, నమస్తే!"

హఠాత్తుగా ప్రవేశించిన సాంబుల్ని చూసి లలిత సంకోచిస్తే లీల ఖంగారు పడింది. అతని రాకవల్ల ఆమెకు సంతోషం కలుగలేదు.

"లీలాదేవీ, నా మీద కోపం వచ్చిందా? క్షం తవ్యుడిని."

"చాకిలెటీ కదిలిందా?" లీల తరఫున ప్రశ్నించింది త.

"నాన్సెన్స్! ఈ ఆడవాళ్ళు సృష్టి కర్తలు. ఆమె ...ు వదలక పట్టుకు కూర్చుంటుందా! నేను ఎవరి సొత్తునీ ...దు" అని అక్కడఉన్న సోఫామీద జార్లపడ్డాడు సాంబులు.

"అంటే నీ ప్రేమా, అభిమానం అంతా నటన అన్న మాటేగా!" లలిత మళ్ళీ రెట్టించింది.

"నటన దేనికవుతుంది? ఆ సమయంలో అదినిజమే"

"అదెలా?"

"అదంతే లలితా! నీ తోటలో పూసేపూవు ఒక రోజుకే వాడిపోతుంది; నీ ఇంట్లో ఉన్న బండరాయి శాశ్వతంగా పడిఉంటుంది. అంతమాత్రంచేత బండరాయి మెళ్ళోవేసుకోవు. పూలహారమే వేసుకుంటావు – కారణం?"

లలిత మాట్లాడలేదు. సాంబులు చెప్పటం ఆరంభించాడు:

"అంతర్యం ఉక్కు—తోతమూరయింది. ఆసంగతి తెలుసు కోటానికీ ఒప్పుకోటానికీ, కూడా మనం భయపడతాం. సాత కాలు పెట్టి ప్రామిసరీనోట్లు వ్రాయటానికి అంతర్యం మనిషీ కాదు; ప్రేమానురాగాలు అప్పూ అవవు. పుష్పం అంటే తెలియకపోతే ఆ బండరాయినే పట్టుకు ప్రాకులాడక తప్పేదీ కాదు. నాకు పుష్పసౌరభం తెలుసు. అందుకే బంధనంఅనే బండరాయిని పట్టుకునినేను వ్రేలాడను" అని జేబురుమాలతో నుదురు తుడుచుకున్నాడతను.

"ఆడవాళ్ళు తమ సర్వస్వం అనుకుంటున్న బంధనం గురించి నీవు యిలా అనటం బాగులేదు" అన్నది లలిత.

"స్త్రీల భోగవస్తువులైన మగజాతిలో వాడినికాను నేను" అని నవ్వాడు సాంబశివరావు.

"నిన్ను పొందటం ఎంతతేలికో, పోగొట్టుకోవటం కూడా అంతే తేలిక" అని వెక్కిరింపుగా అంది లలిత. ఇంత సేపూ ఒక్కమాటకూడా మాట్లాడలేదు లీల.

"లీలాదేవిగారికి నామీద కోపం రాలేదుగద" అన్నాడతను. ఆ మాటకు లీల మొగం తిప్పుకుంది. ఆమె కన్నుల

నించి నీరు జలజలా రాలింది. సాంబులు ఆశ్చర్యపడి ఆమె పక్కన కూర్చుని ఆమెచేయి తనచేతిలోకి తీసుకున్నాడు. చెయి లాక్కోబోయింది లీల. అతను వదలలేదు. గట్టిగా పట్టుకుని "చూడండి శ్రీమతీజీ - అప్పుడప్పుడు తూటిపువ్వు కూడా అందంగానే ఉంటుంది. కోయ్యాలనిపిస్తుంది. కోస్తాంకూడా. కాని అది తూటిపువ్వు మాత్రమే - కలువపువ్వు కాదు" అన్నాడు.

లీల మాట్లాడలేదు.

"ఈ రకమైన మనస్తత్వం మంచిది కాదు శ్రీమతిజీ! స్త్రీకి స్వాతంత్ర్యం అనే సిద్ధాంతం ఇదిగో, ఇలాగే ఉంటుంది. స్వాతంత్ర్యం అరిచినందువల్లా, కేకలు పెట్టినందువల్లా రాదు-లా ప్రకారం సమర్థించుకున్నందువల్లా రాదు; సభల్లో నిలబడి మగవాళ్ళని శాపనార్థాలు పెట్టినంత మాత్రంచేతా రాదు. స్వాతంత్ర్యం ఒకరు ఇచ్చేది కాదు. స్వంతసిద్ధంగా అది రావాలి; ఆత్మవైశాల్యంతో దాన్ని అంది పుచ్చుకోవాలి"

ఎవరూ మాట్లాడలేదు.

"నేను లోకదృష్టికి డబ్బుగల నీచుడిని... కాని నా దృష్టికి బ్రతక నేర్చినవాడిని. ఈ ప్రపంచంలో ఎలా బ్రతకాలో నాకు బాగా తెలుసు; లలితకీ తెలుసు; చాకిలెటీ అనబడే గిరినందినీకి తెలుసు; ఫుట్‌పాత్ డాన్సర్ ఆబ్రాంటీకీ తెలుసు. ఒక్క మీకే తెలియదు శ్రీమతిజీ! దానికి కారణం చెప్తున్నాను వినండి. మాకు వివాహం- కట్టుబడి ఉండటం మీద నమ్మకంలేదు. ఏదీ శాశ్వతమైనదని మేం అనుకోం.

ఈ బ్రతుకులో ఏది...ఎప్పుడు...ఎంత దొరికితే అంతా తీసుకుని మా సంచిలో పారేసుకుంటాం; దొరకని దానికోసం విచారించం; ఇంకా దొరకలేదే అని బాధపడం —దొరికి జారిపోయినదాన్ని గురించి ఆలోచించం. కాని, మీరలా కాదు. ప్రేమ, వివాహం, ప్రాతివ్రత్యంవీటిమీదమీకునమ్మకం ఉంటుంది. కొంతకాలానికి పై పొర ఊడిపోయేసరికి బాధపడతారు. ఇదొక సంధియుగం శ్రీమతీజీ! బ్రతికితే ఇల్లాలుగా భర్తకి వండిపెడుతూ, పిల్లలకి నీళ్లుపోస్తూ మధ్యాన్నంపూట తలుపేసుకుని ఆంధ్రప్రభ చదువుకుంటూ బ్రతికేయాలి; లేదా చాకిలెటీలాగా మగవాడి చాంచల్యాన్ని కవ్వించి డబ్బు చేసుకోవాలి. ఈ రెండు పద్ధతుల్లోనే సుఖముంది. మీకు ఈ రెండు పద్ధతులూ చేతకాదు. అందుకే త్యాగరాజులతో విసుగుపొందారు; నన్నూ విసుక్కుంటున్నారు."

అని స్పష్టంగా చెప్పేసి సిగరెట్ ముట్టించాడు సాంబశివరావు.

"మిమ్మల్ని నేనెందుకు విసుక్కుంటాను ! నాకు హక్కేముంది ?" అన్నది లీల గొంతు పెగుల్చుకుని.

"మళ్ళీ హక్కు అంటున్నారు... ఈ ప్రపంచంలో ఒకరిమీద ఒకరికి హక్కు ఏమిటి శ్రీమతీజీ ! అలా ఉండాలనుకోవటమే పెద్ద పొరపాటు."

# 11

"ఒకరిమీద ఒకరికి హక్కేమిటి త్యాగరాజులూ—అలా ఉండాలనుకోటమే మనం చేస్తున్న పొరపాటు" అన్నది సుమతి.

త్యాగరాజులు సమాధానం చెప్పలేదు. అతని మనసులో లీలా, పాప, తల్లి, చెల్లెలు, మామగారు అందరూ తిరుగుతున్నారు మానవ సహజమైన వ్యక్తిగత మమత అతన్నిపట్టి పీడిస్తున్నది. పైగా ఈ రోజే తల్లి దగ్గరనుంచీ—మామగారి దగ్గరనుంచీ రెండు ఉత్తరాలు ఊడిపడ్డాయి.

'కోడలు ఒకచోటా నీవొకచోటా ఉన్నారని విన్నాను అది ఎంతనిజం' అని వ్రాసింది తల్లి. 'ప్రేమ వివాహం ఇంత గాలిబుడగ అని నేనూ అనుకోలేదు. నా కూతురు మనస్తత్వం అర్థంచేసుకోలేక దాని గొంతుకోశావు. నీ కూతురు నా దగ్గర పెరుగుతున్నది. ఒకసారి వచ్చిపో—' అని మామగారు వ్రాశారు. ఇవన్నీ ఇలా ఉంచి క్షణక్షణానికీ సుమతిమీద తన లాలస అధికమవుతోంది. ఇది ఇలాగే జరిగి నిజంగా లీల విడాకులిస్తే సుమతిని పెళ్ళిచేసుకుందామనే ఆశ అంతర్గతంగా పట్టి పీడిస్తున్నది. సుమతి ఆంతర్యంలో ఏముందో అసలే అర్థంకావటంలేదు.

భార్యను వదిలిపెట్టి వితంతు వివాహం చేసుకోటం ధర్మపథం తప్పటంకాదుగద! అనే వ్యథ మరింత బాధపెడుతోంది అతన్ని. ఏది ఏమయినా ముందు సుమతి మనసు తెలుసుకోవాలి. ఆ ప్రయత్నంలోనే ఒక వ్యక్తిమీద మరొక

వ్యక్తికి ఉండే హక్కును గురించి సుమతిని ప్రశ్నిస్తే పై సమాధానం ఇచ్చింది.

"మరి హక్కు లేకపోతే బాధ్యత ఉండదు; బాధ్యత లేకపోతే సుఖముండదు. మొత్తం సాంఘిక వ్యవస్థే తారు మారై పోతుంది. ఇప్పుడు నీ సంగతే తీసుకో సుమతీ! నీ బాధ్యత వహించేవారు ఎవరయినా ఉంటే నీమీద హక్కు కూడా కావాలనుకుంటారు" అన్నాడు త్యాగరాజులు. ఆ వేళ ఏదో సెలవరోజు — అతనికి కావలసినంత తీరిక.

"అంటే అత్తగారు చేసిపోయిన తెలివి తక్కువపని కొనసాగించాలను కుంటున్నావన్నమాట. అప్పుడు నువ్వు సంఘ విద్రోహి వవుతావు త్యాగీ" అన్నది సుమ, అడ కత్తెరతో వక్క కత్తిరిస్తూ. త్యాగరాజులు సమాధానం ఇవ్వలేదు.

"నేను ఎన్నాళ్ళ గానో చెప్పాలను కుంటున్నాను... ఇరుగూ పొరుగూ ఇప్పటికే గుసగుసలాడు కుంటున్నారు— దీనికో పరిష్కార మార్గం ఆలోచించా లని" మరో వక్క పట్టుకు మనిపించింది ఆమె. త్యాగరాజులు తలఎత్తి ఆమె వంక చూచాడు.

ఆనాడే తలంటి పోసుకోటం వలన జుట్టు గజిబిజిగా చిక్కుపడి తిలక విహీనమైన ఆమె ఫాలతలానికి కోటి సిందూరచ్ఛాయల సౌందర్యాన్ని సంతరించి పెడుతోంది. ఒక విధమైన పేదతనం ఆమెను దయనీయురాలుగా కనిపింప చేస్తున్నది. మరో విధమైన నిరాడంబరత, ఇంకో రకమైన

సంస్కారం ఆమెను పవిత్రురాలిగా ప్రకటిస్తున్నాయి. ఆ ఆకారానికి త్యాగరాజులు ముగ్ధుడయి పోయినాడు.

ఆ సంధ్యా స్వప్నవిరహి నిజంగానే ముగ్ధుడయిపోయి తనకు తెలియకుండానే తన మనఃప్రాణాలతో కలిగిన కదలిక తాలూకు స్వరూపం ఏమిటో అవగతం చేసుకోలేక పోయి నాడు. నెమ్మది నెమ్మదిగా రక్తసంధ్య జాగృత మవు తున్నది. ఆ రక్తారుణ సంధ్యాచ్ఛటలు తెరచిఉన్న కిటికీ లోంచి ఇంట్లోపడి బెంగాలీ ఉత్తరీయం పరచినట్లు ఇల్లం తటనీ రాగరంజితం చేస్తున్నాయ్.

గడగడా వణికి పోయినాడు త్యాగరాజులు. కాని సంస్కారవంతుడైన విద్యాధికుడతను. అంత భయంలోకూడా అతని బుద్ధి తలెత్తుకుని నిలబడే ఉంది. తలఎత్తి సుమతి వంక చూశాడు.

'ఈమె ధర్మమే ఈమె సౌందర్యం... అలాగే నా ధర్మమే నా అభ్యుదయం అవుతుందా?' అనుకున్నాడతను.

సుమతి మనసులోగూడా ఏవో ఆలోచనలు సుడితిరుగు తున్నాయ్. తరుణీ జీవితంలోని పూర్వానురాగాలకి సంబం ధించిన సుఖ సంతోషాలు తనకేమీలేవు - బాధలూ బరు వులూ మృత్యుస్మృతి వేదనలూ తప్ప. ఇప్పుడు తను నిజం గానే ఇతన్ని ప్రేమిస్తున్నది. కాని ఆ ప్రేమని తనే దాచు కోవాలి. ప్రేమిస్తున్నట్లు కనీసం అతనికికూడా తెలియ నివ్వకూడదు.

ప్రేమ కోసం ధర్మచ్యుతిని అలంకరించటమనే వ్యక్తి గత స్వార్థంలోంచి సార్వజనీన జీవన దర్శన ప్రాంగణంలో

అడుగు పెట్టటమే తన విధి. అప్పుడే బ్రతుకులోని విషణ్ణత తనని అంటదు. త్యాగం తాలూకు ప్రదీప్త ప్రసన్నప్రభలో తన అంతర్యంకూడా ఒక దీపకళికగా మారుతుంది.

ఆమె మనోలోకం నుంచి ఎవరో చెప్పినట్టయింది : 'ఈశ్వరత్వమే మానవుని చైతన్యంలోనుంచి తనని తాను ప్రకాశింప చేసుకోగలుగుతుంది. భగవంతుడు సంగతి అలా ఉంచితే దైవత్వం మాత్రం సందేహించ తగినదికాదు. జరిగిన ప్రతిమంచి పని దివ్యమే' సుమతి నిట్టూర్చింది.

"నాలో రకరకాల దౌర్బల్యాలున్నాయి. కాని ఇతర్ల కెన్నడూ అన్యాయం చెయ్యను. నా స్వార్థంకోసం త్యాగరాజుల్ని ఆకర్షించి లీల కాపురానికి నీళ్ళు తోడటం నాకు ధర్మంకాదు. తన సంగతి...తను ప్రేమించింది, ప్రేమిస్తుంది. అది అంధప్రేమ అయితే ఫరవాలేదు. అధర్మ ప్రేమ కారాదు. ఎందుకు ప్రేమిస్తున్నాను-అనే ప్రశ్న ఉదయించనే ఉదయించరాదు. అది అంతే- ఇక ఏది స్వధర్మమో అది శరీర పతనానంతరం కూడా బ్రతికే ఉంటుంది."

"అర్థంలేకుండా నిన్ను నువ్వు విమర్శించుకోకు సుమతీ! మనం చేసేది ఏమీలేదు" అన్నాడు త్యాగరాజులు.

సుమతి తన ఆలోచనల్నించి తేరుకుని త్యాగరాజులు ముఖం వంక చూచింది.

"ఇతర్ల బాధల్ని చూసి ఎవరు కన్నీరు పెడతారో, వారు మహాత్ములు. కాని అర్థం లేకుండా లేనిపోని అపరాధాలు నెత్తిన వేసుకుని బాధపడటం దౌర్బల్యం. దానికి ఆశ్రయం ఇవ్వకు."

సుమతి తల ఎత్తి చూసింది. అతని ముఖం చూడగానే ఆమెకు కన్నుల నించి నీరు తిరిగింది. త్యాగరాజులు కేమయిందో తెలియదు. లేచి వెళ్ళి ఆమె దగ్గర కూర్చొని సాదరంగా ఆమెను దగ్గరకు తీసుకున్నాడు. ఆమె విడిపించుకోటానికి ప్రయత్నించలేదు.

"నీ తప్పులేదు—నా తప్పు అంతకన్నా లేదు. తప్పంతా లీలది. నువ్వేమీ అవినీతిగా కాని, చట్ట విరుద్ధంగా కాని ప్రవర్తించటంలేదు. నీతో స్నేహం నాకు హక్కు. అలా అని హద్దులు దాటి మనం ప్రవర్తించలేదు. వివాహం అనే బండ బాధ్యతనుంచి అంతర్యం ఎలాగూ తప్పించుకుని తన మార్గంలో తను ప్రేమిస్తూనే ఉంటుంది. అదిదాని హక్కు."

సుమతి కన్నులవెంట రాలిన నీరు త్యాగరాజులు చేతిమీద రాలింది.

"నువ్వేడుస్తున్నావా సుమతీ! నువ్వు నన్ను విశ్వసిస్తున్నావనే ఆశిస్తున్నాను. మనం చేసేది అన్యాయంకాదు. వివాహం తవ్విన నూతిలోనే ప్రేమ నిలవుంటే అది చెడిపోతుంది. ప్రవహించకపోవటం వలన దాని గుణం దెబ్బతింటుంది. అన్ని న్యాయశాస్త్రాలూ చూశాను నేను. వివాహం అయినంతమాత్రంచేత ప్రేమ జన్మించదు. ప్రేమించి వివాహం చేసుకున్న తరువాత ప్రేమ ఉంటుందనే నమ్మకం లేదు. వివాహం అనే బాధ్యత కేవలం కర్తవ్యపాలనకోసం ఏర్పడింది. లీలని ప్రేమించాను—పెళ్ళికూడా చేసుకున్నాను. తరువాతకూడా ఏ నియమంతో నిన్ను ప్రేమిస్తున్నానో ఏమిటో నాకు బొత్తిగా అయోమయంగావుంది. అది

ప్రకృతికి సంబంధించిన ఒక విచిత్ర సంఘటన. దానిమీద ఏ న్యాయానికీ, ఏ ధర్మానికీ, ఏ నిబంధనకీ అధికారం లేదు. ప్రకృతియొక్క విచిత్ర నియమమే ప్రేమ. ఇంతకాలమూ దాన్ని సంయమబంధంతో నిగ్రహించుకుంటూ వచ్చాను. నీ ముందూ బయటపడ లేదు; లీలముందూ బయటపడలేదు. ఇక నీ విషయం అంటావు? నీవు జీవన మాధుర్యం తాలూకు బిందువుకూడా ఎరుగవు. నేను లీల భర్తననే ఉద్దేశ్యంచేత నీవూ నిగ్రహం అలవాటు చేసుకున్నావు. కాని సుమతీ, ప్రేమించే నీ ఆంతర్యాన్ని అడ్డుపెట్టేందుకు ఏ ధర్మ సూత్రానికీ బలంచాలదు."

సుమతి విచిత్రంగా అతనివంక చూసింది.

"స్థిరమైన విశ్వాసంతో భగవంతుడున్నాడని నమ్మకం కలిగితే కాదనిచెప్పే అధికారం ఆయనకే లేదు. పైగా ప్రేమ అనేది నిజంగా అతని సృష్టి. ఏ దేశంలో నయినా సరే, ఏ చట్టాలలో నయినా సరే, ఆఖరికి భగవంతుడి కోర్టులోకూడా మన ప్రేమ దోషరహితం. నిజం చెప్పాలంటే దౌర్బల్యమే పెద్ద అపరాధం"

ఓటమిని అంగీకరించినట్లు అతనివంక చూసింది సుమతి. త్యాగరాజులు దృష్టి అంచంచలం.

అకస్మాత్తుగా ఆమె ఆంతర్యం స్పందించింది...

ఇన్ని పాటలు నాకు - ఇన్ని కవితలు నాకు- ఇంత ప్రాణము నాకు - వశికిపోయింది సుమతి.

త్యాగరాజులు మళ్ళీ మాట్లాడటం ప్రారంభించాడు.

"బ్రతుకు పాట పాడుతోంది సుమతీ! దాన్నే జీవశక్తి అంటారు. జీవితం ఎక్కడ దుర్భరమో అక్కడే దాని పాటలు మధురతమంగా ఉంటాయి. కాని దేహ సంబంధమైన లాలస విశ్వగ్రాహి. అదికూడా దుర్జ్ఞేయమైనదీ అనధిగమ్య మైనదీను."

కొంచెం ఆగి—

"ఎవరికెంత ప్రాప్తం ఉన్నదో దానిని మించి ఒక్క క్షణమైనా పొందలేరు. అదొకవి చిత్రమైన ప్రకృతి శాసనం. క్రిష్ణానది చూడు, పర్వతాన్ని చీల్చుకొని ప్రవహిస్తున్నది. పర్వత పదతలంలో మడుగు కడుతుంది - ఎండిపోతుంది... అయినా ఆ మహా స్రోతస్వినికి క్షణం తీరిక లేదు."

హఠాత్తుగా సుమతికి తెలివి వచ్చింది. ఎన్ని గంట లైందని ప్రశ్నించి పొయ్యిరాజేసి ఎసరుపడేసి వంకాయలూ కొళ్ళగిన్నె, కత్తిపీటా ముందేసుకు కూర్చుంది.

మనిషి మారుతూ ఉంటాడు. ప్రతిదినమూ ప్రతి క్షణమూ మారుతూ ఉంటాడు. ప్రకృతి నియమం అంతే. అది అనివార్యం.

"వంకాయలు ఉల్లికారం పెట్టి వండమంటావా త్యాగీ" అన్నది సుమతి. ఆ క్షణంలో తన సర్వస్వాన్ని వండి వడ్డిస్తుందేమో అనిపించింది అతనికి. త్యాగరాజులు ఆ ప్రశ్న వినిపించుకో లేదు.

"నిరంతర త్రయం... ఇరువురు స్త్రీలు- ఒక మగవాడు లేదా ఒక మగవాడు-ఇద్దరు స్త్రీలు. యుగయుగాలుగా జీవన

సంగ్రామం ఇలాగే సాగుతూవస్తోంది" అని నవ్వాడు. సుమతి సమాధానం ఇవ్వలేదు. వంకాయలు పుచ్చుచూసి నీళ్ళల్లో పడవేస్తున్నది.

అత్తగారు పోయినప్పటినుంచీ త్యాగరాజులు ఇక్కడే భోజనం చేస్తున్నాడు. పాపమీద గాలి మళ్ళినప్పుడు తన ఇంటికేసి వెడుతూ ఉండేవాడు కాని పాప లేదు. ఇక అతను వెళ్ళడం మానేశాడు. ఆఫీసులోకూడా అతని సంసార పరిస్థితి దాగలేదు. భార్యని విడిచిపెట్టి ఒక పంతులమ్మతో అక్రమ సంబంధం కలిగిఉన్నాడని వారి అభిప్రాయం. భార్య అందమైనది, చదువుకున్నది. అయినా ఇతనికి ఇదేం బుద్ధి!

ఇంతమందిలోనూ త్యాగరాజుల్ని అర్థంచేసుకున్నవాడు ఒకడే. అతను లలిత భర్త – స్వామి. సాంబశివరావుకి కూడా తెలుసు. అయినా అతనికి బ్రతకటం చేతగానివాళ్ళంటే అసహ్యం. అందుకే అతనినుంచి త్యాగరాజులుకి జాలిగా సానుభూతి దొరకదు.

"అయితే రేపు బయలుదేరి వెడతావా?" అన్నది సుమతి, కత్తిపీటపుచ్చుకుని లేస్తూ.

"పాపాయిని చూడాలనిపిస్తున్నది" అని సమాధానం ఇచ్చి సిగరెట్ ముట్టించాడు అతను.

# 12

"బావగారూ, ఇంకో అరగంటలో త్యాగరాజు వస్తాడు" అన్నది అన్నపూర్ణ. గోపాలరావుగారు మాట్లాడలేదు.

"ఏమిటి బావగారూ! మిమ్మల్నే"

"ఏం చేయమంటావు?"

"చూడండి బావగారూ, నేనో రెండు మాటలు చెప్తాను- ఏమీ అనుకోకండి. ప్రతి సమస్యకూ అవతలివేపు కూడా ఉంటుంది. మనందరం ఏదో అవ్యక్త శక్తి చేతులో కీలుబొమ్మలం. వేదనలోనే ప్రశాంతి ఉంటుంది-అదే ప్రకృతిలో ప్రధాన నియమం. అయితే మిగతావి వాటిలో అవి కొట్టుకుని వాటంతట అవే వుపశమిస్తాయి. కాని బ్రతుకు అలాకాదు బావగారూ! బిగ్గరగా ఒకశోకంపెట్టి ఆరున చచ్చి ఊరుకుంటుంది. అందుకే దాన్ని ఏడవనీయకూడదు. ప్రకృతి నియమాన్ని వెనక్కు నెట్టి తనకో కొత్త నియమాన్ని విధించుకున్నాడు మనిషి. ఆ నియమం విచిత్రమైనది. బ్రతుకు ఒక పెద్ద కవిత. వేదన తాలూకు తాకిడిని నిశ్శబ్దంగా సహించాలి... నిజమే. ముక్కలు ముక్కలుగా పగిలి పోదామనే అని విస్తుంది మనకి. అయినా సహించి తీరాలి బావగారూ!" అన్నది అన్నపూర్ణ.

గోపాలరావుగారు నిట్టూర్పు విడిచి "నీవు లేకపోతే ఈ పాతమేడ ఏనాడో కూలిపోయేది అన్నపూర్ణా" అన్నారు.

"కవిత్వం చెప్పకండి బావగారూ! నా కోడి లేకపోతే తెల్లవారదన్నట్లు..."అన్నది ఆమె. కాని అంతరాంతరాల్లో ఆమెకు పూర్తిగా తెలుసు- తన విధుర జీవితంలో ఆయన స్థానమేమిటో! వాతరోగి స్థూలకాయుడూ అయిన ఈవృద్ధుడి వలన తను పొందగలిగిందేమీ లేదు. లోకం అనేక అపవాదులు వేసింది. ఆ అపవాదుల్ని పురస్కరించుకుని తనని

తనే అనుక్షణం వేళాకోళం చేసుకుంటుంది ఆమె. కాని... కాని...

ఎవరయినా ఎప్పుడయినా ఆమె మనసులోకి దూరి వెతకగలిగితే వృద్ధుడూ అశక్తుడూ అయిన ఈ స్థూలకాయుడిని నిజంగానే ఆమె ప్రేమిస్తున్నదని తెలుసుకోగలుగుతారు. ఎలాగూ లోకం అనుకుంటున్నది- అంటే అదివేరే విషయం. లోకం వారిద్దరికీ దైహికసంబంధాన్ని ఊహిస్తున్నది. అది పూర్తిగా అసంభవం.

పోతే ఆంతర్యం. అదొక్కటే సత్యం... పరమ పవిత్రురాలైన అన్నపూర్ణ - ఎందుకనో తెలియదుగాని నిజంగానే బావగారితో తనకు ఏదో ఉన్నట్లు ప్రవర్తిస్తుంది. అందులో ఆమెకు ఏదో ఆనందం ఉన్నది.

అది విన్నప్పుడు గోపాలరావుగారు మొదట సిగ్గుపడేవారు. ఇప్పుడు అలవాటయింది... ఆయన దృష్టిలో అన్నపూర్ణకీ లీలకీ భేదంలేదు. అయితే అన్నపూర్ణ విజ్ఞానం మీద ఆయనకి నమ్మకం చాలా ఎక్కువ.

త్యాగరాజులు వస్తూనే తాతగారి పొట్టమీద కథకళి నృత్యం చేస్తున్న పాపని ఎత్తుకున్నాడు. మామకీ అల్లుడికీ కూడా ఏదో తప్పుచేసినట్లు ఒకరి మొగం ఒకరు చూసుకోటానికి సిగ్గు అనిపిస్తోంది.

ప్రస్తుతం మానవుని హక్కు ప్రకారం వధూ వరుల ఇష్టంతోనే వివాహం చేశాడు గోపాలరావుగారు... తగు కారణాలుంటే విడిపోవటానికికూడా వారికి లా ప్రకారం హక్కు ఉన్నది. కాని కారణాలే కనిపించటంలేదు!

"కూర్చోవోయ్" అన్నారాయన చివరికి ధైర్యంచేసి. త్యాగరాజులు కూర్చున్నాడు. అతని ఆంతర్యంలో పుత్ర ప్రేమ పొంగి పొరలుతున్నది. తనూ లీలా మహాపాపం చేస్తు న్నారు. ఎవరిసుఖం వారు చూసుకుంటూ మనిషికి కనీస ధర్మం అయిన సంతానంమీద మమతకూడా పోగొట్టు కున్నారు. ఛీ ఛీ! అవన్నీ పుస్తకాల్లో కబుర్లు - నిజానికి మాతృ ప్రేమా జీలకర్రా అన్నీ అబద్ధాలు. ఈ ప్రపంచంలో తల్లీ బిడ్డలూ - భార్యా భర్తలూ అన్నదమ్ములూ అందరూ కూడా 'ఇస్తివాయినం పుచ్చుకుంటివాయనం' అనుకుంటూ బ్రతుకుతున్నారు.

పసిదాన్ని గుండెల కదుముకుంటూ కుర్చీలో కూర్చు న్నాడు త్యాగరాజులు. అతని కంఠంలో దుఃఖం తారాడు తున్నది. అతిప్రయత్నంమీద వెలికి రాబోతున్న దాన్ని లోపలికి తోసి అన్నపూర్ణ తెచ్చిన కాఫీగ్లాసు అందు కున్నాడు అతను.

అన్నపూర్ణకి త్యాగరాజులంటే చాలా అభిమానం. అతని ఆదర్శాలూ నిజాయితీ అంటే ఆమెకి గౌరవం. అలాటి త్యాగరాజులుకూడా ఒకవిధమైన విరక్తిలోనూ మరోవిధ మైన వ్యామోహంలోనూ పడిపోయి స్వధర్మాన్ని మర్చి పోవటం నిజంగా ఆమెకు బాధగానే ఉంది.

"ఏం నాయనా, విజయవాడనుంచేనా రావటం ?" అని ఆప్యాయంగా ప్రశ్నించింది ఆమె.

ఆ ప్రశ్నించే తీరులో ఏం విశేషం వున్నదో తెలి యదుగాని, తను ఎప్పుడో చదివిన నిగమశర్మ అక్క జ్ఞాపకం

వచ్చింది త్యాగరాజులుకి. అవుననన్నట్లు తల ఊపాడు. గోపాల రావుగారు తిరిగీ ఒక్క మాటకూడా మాట్లాడలేదు. ఏం జరగబోతున్నది? అనేప్రశ్న వాతరోగంకన్న అధికంగా వేధిస్తున్నది ఆయనని.

జీవితం— ఆంతర్యం— మానవత్వం— పశుత్వం... వీటికి ఉండే విభేదాలన్నీ నశించి శృతీ లయా లేని ఒక వికృత శబ్ద జాలంగా తయారయి గుండెల్లో హోరుపెట్టటం ప్రారంభించినయ్. ధర్మం— నీతి— మమత మొదలయిన వాక్యాలు పిశాచాల తలకాయలుగా మారి ఆయనని బెదిరిస్తున్నయ్.

"బావగారూ, ఎందుకండీ అంత చెమట పోస్తున్నది— ఫాను వెయ్యనా!" అంటూ స్విచ్చి వేసింది అన్నపూర్ణ. 'ఈ దయామయి పర్యవేక్షణలో నాకు కష్టమనేది లేదు. మృత్యువు కూడా నన్ను సమీపించటానికి భయపడుతుంది' అనుకున్నాడాయన.

భోజనాలయిన తరువాత పసిదాన్ని మధ్య పెట్టుకుని ముగ్గురూ కూర్చున్నారు.

"ఏం నాయనా, ఇలా జరిగిం దేమిటి?" అని గోపాల రావుగారే ప్రారంభించారు ధైర్యంచేసి. త్యాగరాజులు కొన్ని క్షణాలు సమాధానం ఇవ్వలేదు. ఎప్పుడయినా ఈ ప్రశ్నకి సమాధానం చెప్పాల్సిన బాధ్యత తనమీద నే ఉంది.. ఇప్పుడు చెప్పేస్తే ఎలా చెప్పాలో అలవాటన్నా అవుతుంది.

"లీల ఏమని చెప్పింది?"

"నీవు ఇంట్లోంచి వెళ్ళిపోయినావని చెప్పింది."

"ఏ పరిస్థితిలో వెళ్ళానో అది చెప్పలేదా?"

"ఆ ప్రశ్న దేనికి? నీవు చెప్పరాదూ?" అని కటువుగా అన్నారు గోపాలరావుగారు. ఇక అన్నపూర్ణ కలిపించుకోక తప్పలేదు.

"మీరుండండి బావగారూ! అదికాదు నాయనా! ఆడవాళ్ళెప్పుడూ తెలివి తక్కువవాళ్ళే...కాని నువ్వు ఇలా చేశావేమిటని?" అన్నది. త్యాగరాజులు చటుక్కున తలెత్తి ఆమెవంక చూశాడు.

"అదికాదు బాబూ-నేనేం అతి తెలివిగా ప్రశ్నించలేదు. నిజంగానే అడుగుతున్నాను. జీవితం చిత్రమైనది. అది నీకూ తెలుసు. పెళ్ళి అనేది పీటముడి. దాన్ని విడదీయటం ఎవరివల్లాకాదు. అథవా అలా విడదీయా లనుకున్నప్పుడు కోసివేయటం తప్ప గత్యంతరం లేదు. అది మరింత బాధాకరం. కనుక తెలిసో తెలియకో వేసిన...లేదా వేసుకొన్న ఆ పీట ముడితో జీవితం అంతం కావటంలోనే అందం ఉన్నది" అన్నది అన్నపూర్ణ చెప్పదల్చుకున్న విషయం సూటిగా ప్రస్తావిస్తూ.

త్యాగరాజులు కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత-

"ఆమెకి డబ్బువ్యామోహం కొంచెం ఎక్కువయింది. నన్ను లంచాలు తీసుకోమని బలవంతం చెయ్యటం ప్రారంభించింది. అది నా ప్రకృతికి విరుద్ధం. అదీగాక నాగరిక జీవితం మీద ఆమెకు సరదా కలిగింది" అన్నాడు.

"నీకు అనాగరిక జీవితం అంటే ఇష్టమా?" అన్నారు గోపాలరావుగారు చాలా తెలివిగా ప్రశ్నించా ననుకుంటూ.

"బావగారూ, కొంచెం సేపు మీ చెణుకులు మానేయండి" అని ఆయనకి సలహా ఇచ్చి త్యాగరాజులువైపు తిరిగి సాధ్యం అయినంత అనునయం కంఠంలో ధ్వనింపచేస్తూ-

"అదికాదు నాయనా, అంతమాత్రం చేతనే సర్దుకోలేక పోయావా నువ్వు?" అన్నది అన్నపూర్ణ.

"చాలా రోజులు సర్దుకున్నాను. చివరికి నేను పట్టుకున్న నోటుపుస్తకం ఒకడికి అమ్మివేసి అయిదువేలు తీసుకున్నది. పాపాయిని లలితమ్మగారి ఆయాకి ఇచ్చి పగలూ రాత్రీ పికార్లు సాగించింది. దానికికూడా నేనేమీ అనుకోలేదు. కాని, ఆ నోటుపుస్తకం విషయం కష్టమనిపించింది. అంతటితో ఊరుకొన్నా బాగుండేది. సాంబశివరావు అనే లోఫర్ దగ్గిర ఉద్యోగానికి కుదిరింది. వాడు అయిదొందలు జీతం ఇస్తాడట. మామగారు వాళ్ళమ్మాయిని ఐ. ఏ. యస్ ప్యాసు చేయించారల్లేఉంది - అయిదొందలు జీతం తీసుకోడానికి" అని వ్యంగ్యంగా సమాధానం చెప్పాడు త్యాగరాజులు.

గోపాలరావుగారు తలవంచుకున్నారు. లీల ఇవన్నీ చెప్పలేదు. కేవలం సుమతివ్యామోహంలో పడి తనని వదిలి వెళ్ళిపోయినాడని చెప్పింది. అతనువెళ్ళినాకే వుద్యోగంలో చేరిందని తను అనుకున్నాడు.

అన్నపూర్ణకూడా ఆశ్చర్యపోయింది. లీల ఈ విషయాలేమీ చెప్పలేదు — ఒక్క సుమతి విషయం తప్ప.

"సుమతి సంగతేమిటి?" సూటిగా అడిగేసింది అన్నపూర్ణ.

"మీ అమ్మాయిలాగా మీరూ అనుమానిస్తే నాకేం అభ్యంతరంలేదు. ఇంతవరకూ సుమతికీ నాకూ ఏవిధమైన అక్రమ సంబంధమూలేదు. ఇకముందు సంగతంటారా? వ్యవహారం ఇలాగే ఉండటం సంభవిస్తే విడాకులిచ్చి సుమతిలా గృహిణిగా ఉండే స్త్రీని వివాహం చేసుకుందామని ఉంది. పొరపాటు పడ్డాను మామగారూ, ప్రేమించే స్త్రీలు వేరు—పెళ్ళిచేసుకునే స్త్రీలు వేరు. వేరు వేరుగానే వాళ్ళని ఉంచితే పెళ్ళి సుఖంగానే ఉంటుంది- ప్రేమా విచ్ఛిన్నం కాదు. ఆ రెంటినీ కలపటమే ఒకపొరపాటు," అన్నాడు త్యాగరాజులు పసిదానితల నిమురుతూ.

"నీవు చేసేది అన్యాయం" అన్నాడు గోపాలరావు గారు. ఆయన అంతర్యం ఉడికి పోతున్నది. లీల విడాకుల కోసం కోర్టుకెక్కడమా?

"ఎవరు చేసేది అన్యాయం? ... మీరు సరిగా గ్రహించలేరు మామగారూ! పుత్రికా వాత్సల్యం మీ న్యాయదృష్టికి అడ్డు వస్తున్నది. ఆమెమీద మోపటానికి చాలా నేరాలున్నాయ్ ఇంకా... అవన్నీ నానోటితో చెప్పటం నాకిష్టం లేదు. అందుకే అన్ని నేరాలు నా నెత్తిన వేసుకోదలుచుకున్నాను. 'సుమతిమీద వ్యామోహం చేత భార్యకు విడాకులు ఇచ్చాడు త్యాగరాజులు' అనుకుంటేనే నాకు శాంతిగా ఉంటుంది" అన్నాడతను.

ఈ దెబ్బతో గోపాలరావుగారి దిమ్మతిరిగి పోయింది. స్థాణువులా ఆ కుర్చీలో కూర్చుండి పోయారు. అన్నపూర్ణ కూడా చాలాసేపు మాట్లాడలేదు. త్యాగరాజులు పసి దానితో ఆడుకుంటూ ఉండిపోయినాడు.

గోపాలరావుగారి ఆలోచనలు చిక్కు పడుతున్నాయ్. ఒక తడవ తనూ ఇలాగే తొందరపడ్డాడు. చాలాకాలం నాటి సంగతి. భార్య కాపురానికి వచ్చిన రోజులు. ఒక స్నేహితురాలితో తనకి అక్రమ సంబంధాన్ని ఊహించింది భార్య. తను యింటికి రాగానే ప్రారంభించింది.

"మీకు సిగ్గూ శరమూ లేదూ ?"

"దేనికి ?"

"దానికీ మీకూ ఏమిటి సంబంధం ?"

"స్నేహం"

"స్నేహమా; ప్రేమా ?"

"స్నేహంకూడా ప్రేమే. నీబోటి అంధురాలికీ అనాగరికురాలికీ అది తెలుసుకునే శక్తిలేదు" అని ఘాటుగా సమాధానం చెప్పాడు తను.

"మీ అంత దుర్మార్గుడు ఇంకెవరూ లేరు. ఇంత అవినీతి, అన్యాయం ఇంకెక్కడా లేవు" అని మరింతఘాటుగా సమాధానం చెప్పి యింట్లోంచి బయటకి వెళ్ళి పోయిందావిడ.

పనిచేసి అలసిపోయి, ఆకలితో వచ్చాడుతను. ఆకలీ విశ్రాంతికోసం పడిన ఆవేదనా నిమిషంలో ఎగిరి పోయినాయి.

విపరీతమైన కోపం వచ్చింది. తనకోపాన్ని చూచి తనే భయ పడ్డాడు. ఎందులోనన్నా పడి చచ్చిపోయి భార్యని శిక్షిద్దా మనుకొన్నాడు. సైకిలుమీద ఊరుబయటకి వెళ్ళి చాలా సేపు ఒంటరిగా కూర్చున్నాడాయన.

మొదట ఆలోచన, తరువాత తీవ్రమైన ఆత్మహత్యాభి లాష, ఈ పాడులోకాన్ని విడిచి పెట్టాలనే బలీయమైన కోరిక; భార్యచేతిలోంచి ముక్తి పొందాలనే ఎస్కేపిజం ఆయనని ఆవరించి, క్రమక్రమంగా స్థిరపడ్డది. తిరిగీ తిరిగీ ఆత్మ పరిశీలనం చేసుకొన్నాడు. రెండు గంటలు ఆలోచన తరువాత తేలిందేమిటంటే; ఆత్మహత్యవలన ఏమీ ప్రయోజ నంలేదు. నిజంగా తను అవినీతి మార్గంలో ఉన్నాడా? కాదు. ఆయువతితో ఆయనకి స్నేహం ఉన్నది. ఆ స్నేహం ఆయ నకి శాంతికూడా ఇస్తున్నది. ఆమె తనకి అంతరంగిక నేస్తం- అంతే. అంతకన్నా మరేం లేదు. అది దుర్నీతీ కాదు. కాని ఆమెమీద తన అంతరాంతరాల్లో ఏమీ లేదా?... ఏదో ఉన్నట్లే ఉంది. ఇంకా లోతుకిపోయి ఆత్మపరిశీలన చేసుకున్నాడాయన.

ఆమెను పొందాలని లేదుగాని పొందనందుకు మాత్రం ఏదో వేదన ఉన్నది. ఆ వేదనాస్రవంతి జీవితపు లోతుల్లో ఇమిడి ప్రవహించటం లేదు. గట్టు తెగగొట్టాలని అప్పుడ ప్పుడూ ప్రయత్నిస్తూ ఉంటుంది - అందుకే అప్పుడప్పుడూ తను పట్టుబడుతూ ఉంటాడు.

సీతీ స్వాయం వీటి తాలూకు శిలాశాసనాలూ అందు లోని క్లిష్టమైన లిపీ తెలుసుకోవాలంటే బ్రహ్మాండమైన సం

యమం అవసరం. సమాజం, మతం, దేశం, మొదలైనవేవీ ఈ విషయాన్ని గురించి రూప కల్పన చేయటానికి అసమర్థాలు అవుతూ వస్తున్నాయి.

కేవలం తనొక్కడూ ఈఅంధకార మధ్యంలోకూర్చుని ఆలోచించినంత మాత్రంచేత ఈ నిరంతరత్రయానికి అర్థం దొరుకుతుందా? ఒకసారి చుట్టూచూశాడు. లేచి సైకి లెక్కాడు. ఒకటి మాత్రం నిజం– ఆ రోజు తనని ఆత్మహత్యా ప్రయత్నంనుంచి విరమింపచేసింది, ఆ స్నేహమయి స్మృతే.

శాంతమైన మనసుతో ఇంటికి వచ్చాడు – తను క్రోధాన్ని చాలా వరకు నిగ్రహించుకో గలిగాడు. భార్య లేవ లేదు. బోర్లపడుకునుంది. ఇంట్లో పనిమనిషికూడా కనిపించ లేదు. ఒకవేళ తనని వెతకటానికి పంపించిందేమో భార్య!

"నరిసి నన్ను వెదకటానికి వెళ్ళిందా?" అని అడి గాడు తను.

"వెతకటానికి దేనికి? మీరెక్కడికి వెళ్ళారో అంద రికీ తెలుసు... నేనే ఇంటికి పొమ్మన్నాను. కూర్చోండి, మీతో మాట్లాడాలి" అన్నది ఆమె. చాలాసేపు ఏడవటం వలన ఆమెకళ్ళు ఎర్రపడినయ్. ఆయనకి జాలివేసింది.

"నువ్వింకా పసిపిల్లవి లక్ష్మీ... కొంచెం ఆలోచిస్తే అన్నీ నీకే తెలుస్తాయి" అన్నాడు.

"నాకు అన్నీ తెలుసు. మీకుమల్లే ఇంగ్లీషు చదువు వెలగబెట్టకపోయినా రామాయణ భారతాలు చదివాను.

పైగామానాన్న పాతివ్రత్యం, ఏకపత్నీవ్రతం ఎంత గొప్పవో చాలా చెప్పాడు. అందుకే మిమ్మల్ని అనటం. నేను పతివ్రతని. మీరూ ఏక పత్నీ వ్రతులుగానే ఉండాలి?"

"ఉండక ఇప్పుడు నేనేం చేస్తున్నాను ?"

"మీరు ఆ అమ్మాయిని ప్రేమించటం లేదూ ?"

"ప్రేమిస్తున్నాను-ఒక మిత్రుడిని ప్రేమించినట్లు"

"మిత్రుడు ... మిత్రుడు ... అంతా అబద్ధం. చెప్పండి, భగవంతుడిమీద ఒట్టేసిచెప్పండి. ఆమె సంపర్కం మీకిచ్చిన ఆనందం నేను ఇస్తున్నానా ?" కోపంతో అరిచిందామె.

"నీనా సాంగత్యం బ్రతుకంతా తెగదు - అడుగడుగుకీ లక్ష్మీ పీటముళ్ళతో ఉంది. చచ్చిపోయినా ఆ ముళ్ళు విడిపోవు. నేను పూర్తిగా నీ హక్కుని"

"ఉత్త అబద్ధం"

"అబద్ధంకాదు లక్ష్మీ! అర్థంచేసుకోటానికి ప్రయత్నించు. ఆ అర్థం చేసుకో గలగటమే దాంపత్యజీవితంలోని శ్రేష్ఠమైన మాధుర్యం. అది లేకపోతే ప్రతీదీ ~~ఇటుగా ఇటుగా~~గే తయారవుతుంది. నువ్వు నన్ను నిజంగా అర్థం చేసుకుంటే నీ మనసుకి ఈ వెఱ్ఱిమొఱ్ఱి ఆలోచనలు రావు. నీతో నేను కలిసి బ్రతుకుతున్నాను...ఆ అమ్మాయి వచ్చిఅయిదు నిముషాలకన్నా ఎక్కువ ఎప్పుడయినా ఉన్నదా? ఆమెతో స్నేహం పుస్తకాలకూ చర్చలకూ పరిమితం."

తను చాలా శాంతంగా చెప్పాడు. ఆమె మండిపోతూ సమాధానం ఇచ్చింది.

"అదే నేను ఏడిచేది! ఆ అయిదునిమిషాలూ మీకు ఎంత సంతోషం - నాతో ఏనాడైనా అంత సంతోషంగా మాట్లాడారా ? ఎంత హాయి-ఎంత సుఖం"

కొద్దిగా జాలిపడ్డాడు తను. తన కప్పుడు అపరిమితంగా ఆకలి వేస్తున్నది. ప్రకృతికి సంబంధించిన ప్రథమావసరంతో పాటు అతని చైతన్యం, తెలివి కూడా స్తబ్ధమైపోయినాయి. నిగ్రహించుకోవాలని చాలా ప్రయత్నించాడు. చుట్టూ ఉన్న ఆచ్ఛాదన తీసివేసిన అనంతరం రెపరెపలాడే దీపకళికలాగా అతని హృదయం క్షోభించింది.

యుద్ధ సన్నద్ధమైన హృదయం - మండిపోతున్న మహాగ్ని తాలూకు అంచులలాగా ఆలోచనలు ... అతని శాంతాన్ని పరీక్షిస్తున్నాయ్.

"సరే లక్ష్మీ బాగానేఉంది - నిజమే. ఆమె దగ్గర హాయీ ఆనందమూ పొందుతున్నాను.... మరెందు చేత వాటిని నువ్వు ఇవ్వలేక పోతున్నావో ఆలోచించావా ?"

"మీ ప్రవర్తన మంచిది కాదు కనుక - మీకు ఆమె ఇస్తున్నట్లు తోస్తుంది; త్రాగుబోతు కళ్లే అమృత మన్నట్లు."

"సరే లక్ష్మీ, అలా అయితే ఈ త్రాగుబోతుతో పతివ్రతవైన నువ్వు కాపురం చెయ్యలేవు. నన్ను వదలిపెట్టు"

"భలే! అదా ఎత్తు ?"

ఆ సమాధానంలోని వ్యంగ్యానికి ఆయనకి తిక్క-రేగింది.

"ఇదుగో లక్ష్మీ, నన్ను నువ్వు చాలా విసిగిస్తున్నావు. పొద్దున తిన్న అన్నం-ఆకలి మండిపోతున్నది. అయినా నీకు ఆఖరిమాట చెపుతున్నాను - నీకూ నాకూ ఉన్న ఈ బంధం సమాజం వేసినది. దాని ప్రకారం నేను నీకు మొగుడిని — పెళ్ళినాడు వేసిన ముడి ప్రకారం నిన్ను భరించాలి, పోషించాలి. సరే అలాగే నా సంపాదన నీది; నా శరీరం నీది. ఇదివరకు అంతే; ఇకముందుకూడా అంతే. ఇందులో నేనేమీ అన్యాయంగా చరించటంలేదు." అన్నాడు.

"చరింటం లేదా?"

"లేదు"

"మీరు ఆఅమ్మాయిని ప్రేమించటంలేదని ప్రమాణం చేసి చెప్పండి"

ఆ మాటకి ఆలోచనలో పడ్డాడు తను. నిజం చెప్పేయటమే మంచిది.

"నీ హక్కులికి భంగం రానియ్యకుండా ఎవరినైనా ప్రేమిస్తే అది అక్రమం కాదు" అన్నాడు.

"కాదా?"

"కాదు ... కాదు... కాదు.... ప్రేమంటే ఏమిటి? అదేమైనా వస్తువా; చేత్తో ఇవ్వటానికి? నీ ప్రేమ, పాతివ్రత్యంతీసి ఇలా ఇయ్యి" అని అరిచాడు తను.

ఈ ప్రశ్నకి ఆమె కొంచెం ఆలోచించింది.

"ఖంగారుపెట్టి అసలు విషయాన్ని దాటవేస్తున్నారు" అన్నది.

"ఖంగారు కాదు లక్ష్మీ! ప్రేమ ఇచ్చేదీకాదు; పుచ్చుకునేదీ కాదు. సినిమాల్లోనూ కథల్లోనూ చదువుతూ ఉంటాం-ప్రేమించి పిచ్చెక్కడం, చావటం. లాటివి, అక్కడ గొప్పతనం ప్రేమించిన వాళ్ళది కాదు; ప్రేమించబడిన వాళ్ళది. అసలు ప్రేమించేవాడు గుణాన్నీ రూపాన్నీ ప్రేమిస్తాడు. నీలో రూపం నా కిష్టం; ఆ అమ్మాయిలో గుణం నాకిష్టం. అదినీకు అర్థంకాదు... కేవలం దాసికోసమే ఆమెను నేను ప్రేమించాను."

ఆ చివరిమాట మాత్రమే అర్థం అయింది లక్ష్మికి. పెద్ద కంఠంతో అరుస్తూ-

"సిగ్గులేదూ మీకు- అల్లా చెప్పటానికి ?" అన్నది.

"లేదు" స్థిరంగా చెప్పాడు తను. ఆ స్వరంలో భయం లేదు, ఒణుకు లేదు. సత్యాన్ని చెబుతున్నప్పుడు మనిషి భయపడడు. కోపంతో మరింత అరుస్తూ-

"మీ గుడ్లు ఊడి కిందపడతాయి-అంత పాపం చేస్తున్నారు" అన్నది. పల్లెటూరితిట్లు.. ఆమె తల్లిగారి నుంచి సంక్రమించినాయి.

"నా గుడ్లు ఊడి కిందపడవు—నే నేపాపం చెయ్యలేదు"

"ధర్మమే ఉంది... దానికి శిక్ష ఇస్తుంది." ఇది తండ్రిగారినుంచి నేర్చుకుంది ఆమె.

"నీకు ధర్మం అంటే ఏం తెలుసు? మీనాన్న దగ్గర నుంచి నువ్వు నేర్చుకున్న తడిగుడ్డల ధర్మం నాకు అవసరం లేదు. నాది మానవ ధర్మం, బ్రతుకు ధర్మం. అది నీకు ఎలాగూ అర్థం కాదు. నీకు అర్థమయ్యే భాషలో మళ్ళీ ఒక సారి చెబుతున్నాను. పెళ్ళి సమయంలో యే ఒట్లు నా చేత పురోహితుడు పెట్టించాడో, అవన్నీ తు. చ. తప్పకుండా పాలి స్తాను...ఇంతవరకూ పాలిస్తూనే వచ్చాను."

"ఒట్లు మాత్రమేనా? ప్రేమో మరి!"

"అదే మొత్తుకుంటున్నాను. అది ఎవ్వరికీ మనంతట మనం ఇవ్వలేం... వాళ్ళంతటికి వాళ్ళు తీసుకోవాలిసిందే తప్ప. ఎక్కడా మన రూలూస్ రెగ్యులేషనూస్ దమ్మిడీకి కొరగావు. నువ్వెంత పొందటానికి అర్హురాలివో అంతకు మించి దమ్మిడీకూడ పొందలేవు. అయితే ఒకటి- అంతర్యం చేస్తున్న గోల బైటికి వినిపించకుండా చుట్టూ ఇనపగోడలు కట్టి బంధించి ఉంచగలడు మనిషి. అప్పుడుకూడా నవ్వు తాడు, ఉద్యోగం చేస్తాడు, బ్రతుకుతాడు. ఇప్పుడు నే నదే చేస్తున్నాను- నన్ను చంపకు" అని కఠినంగా చెప్పాడు తను.

లక్ష్మి గబగబా లేచి తను ఆమె దగ్గర తీసుకున్న ఖరీదుగల పుస్తకాలన్నీ తగల బెట్టింది. ఆయన ఇక సహించ లేక పోయినాడు. ఆ రోజే మొదటిసారి ఆయన త్రాగాడు. అప్పుడే విడాకుల చట్టం కావాలని మనసారా వాంఛించాడు కూడా. ప్రతిరోజూ సంసారం అంటే అసహ్యించుకుంటూనే ఆయన సంసారం చేశాడు- భార్య పోయినప్పుడుకూడా కలగ వలసినంత దుఃఖం కలగలేదు ఆయనకి.

ఇప్పుడు తన కూతురూ అల్లుడూకూడా సంసారాన్ని నరకం చేసుకున్నారు, విడాకులు కావాలని కోరుతున్నారు. తను భార్యని నిజంగా వదిలిపెట్టాలనుకునీ వదిలిపెట్టనికారణం లీల.

ఇప్పుడు లీల భర్తని వదిలిపెట్టటానికి ఆకారణంకూడా అడ్డురావటం లేదు. తనూ లక్ష్మి బ్రతికిన బ్రతుకులాటిది పగవాళ్ళకుకూడా వద్దు... అలాటి బ్రతుకు బ్రతికేకన్నా లీలా త్యాగరాజులూ విడిపోవటమే మంచిది. చిత్రం ఏమిటంటే; లక్ష్మి పల్లెటూరిలో ఛాందసపు తల్లితండ్రుల మధ్య శుద్ధవైదికంగా పెరిగింది కనుక తనను అలా హింసించిందని సమాధానం చెప్పుకుంటూ ఉండేవాడు మొన్నటివరకూ.

లీలని తను చాలా నాగరికంగా పెంచాడు. తన లేకపోయినా ఆమె కిష్టమైన పెళ్ళి చేశాడు. మరి వాళ్ళు విడాకులకు కోరుతున్నారు- కారణం ఏమిటి?

గోపాలరావుగారి ఆలోచనలు ముందుకు సాగలేదు. ఆయన నిట్టూర్చి కళ్ళు మూసుకున్నారు. ఆయన నిట్టూర్పులో కరుణాజనకమైన అసహాయత, మూసుకున్న కళ్ళ వెనుక దాగిన వేదన, అతి నిష్కపటంగా చేతులు ముడుచుకు పడుకున్న ఆ తీరు అన్నపూర్ణ గ్రహించింది.

"మీరు చెప్పండి బావగారూ! మీరు న్యాయాధిపతులు" అన్నది అన్నపూర్ణ. భగవంతుడిని యుగయుగాల నుంచీ మానవుడు ఇదే ప్రశ్న వేస్తున్నాడు ... మీరు న్యాయాధిపతులు కదా...

ఈ ప్రశ్న గోపాలరావుగారి సర్వ చైతన్యాన్ని జలదరింపచేసింది. నిద్రపోతున్న మనిషి కళ్ళముందు బ్యాటరీలైటు ఫోకస్ చేసినట్లుగా ఉలిక్కి పడ్డా డాయన. నీళ్ళలో మునిగినట్లయింది.

బ్రహ్మాండమైన భయం – కఠినమైన బాధలతో నేటి మనిషి తాలూకు యుగయుగాల ఇతిహాస నాగరికత ఒక్కసారిగా ఆదిమానవుని రాతియుగంలోకి తోసుకొని పోయింది. అప్పుడు దయలేదు, మమత లేదు, బాధ్యతా కర్తవ్యాలు అసలే లేవు. ఉన్నదల్లా కేవలం ప్రాణానికి సంబంధించిన జీవితం.

ఆయన అర్థం చేసుకున్నారు- కేవలం కల్పనతోనే ఆగిపోకుండా యదార్థాన్ని అర్థం చేసుకున్నారు.

దినదినం జీవితం మారుతున్నది- సిద్ధాంతాలు మారుతున్నాయి-బాధ్యతలు మలుపు తిరుగుతున్నాయి. ఈ పరిస్థితిలో తన తీర్పుకి విలువ ఏమిటి? అసలు తీర్పు యిచ్చే అర్హతమాత్రం తనకి ఎక్కడిది? లీల తనబిడ్డ. తను నిజంగా న్యాయాధిపతి అయితే తనబిడ్డ పక్షం మాట్లాడకూడదు... అందుకే తను న్యాయాధిపతి కాదు. లీల మధుర కోమల మూర్తిలో ఇంత కాఠిన్యం దేనికి ఉంది? భారతీయ ధర్మశాస్త్రప్రకారం ఇప్పుడు విడాకులు తీసుకోవచ్చును- తగినంత కారణం ఉంటే.

ఆకారణం వీళ్ళు ఏమి చూపిస్తారు? త్యాగరాజులు నేరం తనమీదనే వేసుకుంటాడు. ఆ సందర్భంలో మరొక ఆడపిల్లని కోర్టుకి లాగుతాడు... సరే వాళ్ళిష్టం.

"బావగారూ ఏదో ఒకటి మాట్లాటండి"

"నువ్వు నన్ను తరిమి తరిమి చంపకు అన్నపూర్ణా! వాళ్ళిష్టం" అని జవాబిచ్చాడాయన.

"మరి పిల్లగతి?" అన్నది అన్నపూర్ణ ...ఆ విషయంలోనే వారిని కలపాలని ఆమె ప్రయత్నం. ఆ మాటకి త్యాగరాజులు ఉలిక్కిపడ్డాడు.

"అవును బాబూ, మీ పిల్లని ఎవరు పెంచుతారు? దేశంలో అనాధ శిశుసంరక్షణాలయాలు చాలా ఉన్నాయి. బెజవాడలో కూడా ఒకటి ఉంది" అన్నది అన్నపూర్ణ.

త్యాగరాజులు వణికిపోయినాడు. తన బిడ్డ - తల్లి తండ్రీ కూడా బ్రతికే ఉన్న తనబిడ్డ-అనాధ శరణాలయంలో చేర్చబడటమా?

అన్నపూర్ణ అన్న ఆ ఒక్క వ్యాకంతో అతనిలో ఉన్న పితృత్వం, జంతుసహజమైన వెర్రి మమకారం — మానవుడికి మానవత్వాన్ని ప్రసాదించిన ఆలోచన - అన్నీ మూలమట్టంగా కదలిపోయినయ్.

తప్పటడుగులు వేస్తూ తన పాప ఆహారంకోసం గిన్నె పుచ్చుకుని అనాధ శరణాలయంలో నడుస్తున్నది - సరిగా స్నానం చెయ్యలేకపోతే కసురుతున్న ఆయా వంక తెల్లపోయి చూస్తున్నది - ఏడుస్తే దగ్గరికి తీసుకునేవారు లేరని తెలిసి, వస్తున్న ఏడుపుని ఆపుకుంటున్నది.

బిడ్డని గట్టిగా కౌగలించుకుని అవురుమన్నాడు త్యాగరాజులు.

# 13

తిరిగి వచ్చిన త్యాగరాజులు ఇదివరకులా తనకి దగ్గరవటానికి ప్రయత్నించకపోవటం చూసి ఆశ్చర్యపోయింది సుమతి. అతనులేని ఈ రెండురోజులలోనూ — ఆమెలో ఏవో కొత్త ఆలోచనలు పొటమరించ సాగినయ్.

జీవితం — దానిలో అనుభూతులు — తనకి అనుభవం కాని కొన్ని మాధుర్యాలూ ఆమెని వేధించటం ప్రారంభించినయ్. ఆలోచనలు ఆమె మెదడులో కొండరాళ్ళమీద ఎగిరిపడే సెలయేర్లలా పరుగిడుతున్నయ్. అనుభూతి మీద అనుభూతి కొత్త కొత్తగా ఆవరించుకొంటున్నాయ్.

ఈ రెండు రాత్రులూ ఆమెకి నిద్రరాలేదు. స్వప్న విహ్వలతలో తెలిసీ తెలియని విచిత్ర స్థితిలో ఉండి పోయిందామె.

ఉదయం ఆ మత్తులోంచి లేవగానే మొదట జ్ఞాపకం వచ్చింది త్యాగరాజులు! ఆశ్చర్యం ఏమిటంటే చైతన్య రహితమైన స్థితిలో కాదు-సచేతనమైన మనోయవనిక తొలగించుకొని సంపూర్ణ స్వరూపంతో వచ్చి కళ్ళ ఎదుట నిలబడ్డాడు అతను. గతించిన కాలంలోని ఒకటీ రెండురోజులు స్మృతి కొచ్చినయ్. ఆ స్మృతి ప్రవంతి కలకల ధ్వనిలో నూతనమైన జీవన సంగీతం విన్నదామె. ఆ కలకల ధ్వని ఈ రెండురోజులనించీ ఆమె అంతర్యంలో ధ్వనిస్తూనే ఉంది.

ఆకాంక్ష విశ్వాన్నే మింగి వేసేట్లుంది. కాని ఆమెకి లభించే ప్రతిఫలం చాలా తక్కువ. అతను రాగానే పరుగెత్తు

కుంటూ వెళ్ళి కౌగలించుకొని "త్యాగీ, నన్ను వదలకు సుమా" అని ప్రార్థించాలనుకుంది ఆమె. కాని అలా చేయు లేక పోయింది.

కనీసం అతనయినా అలా చేస్తాడని ఆశించింది. అదీ జరగలేదు. ఆమెకిహ ఆకలి వెయ్యలేదు; నిద్రరానటం లేదు. ఆలోచనలకి అంతులేదు- అనిపిస్తుంది. ఎప్పుడో ఎవరో అన్నమాట ఆమెకి జ్ఞాపకంవచ్చింది ! 'విచారం కుము లుతున్న నిప్పులాటిది' అని. ఉపమానం అందంగానే ఉంది గాని ఆమె కంతగా నచ్చలేదు. ఆలోచనకు ఆస్కారమిచ్చే విచారం మహాగ్ని, జీవితంలోని ఓటములు దానికి సమిధలు.

జాగరణ వలనా ఆహారం లేకపోవటం వలనా ఆమె అలసి పోయింది. రేపటినుంచీ స్కూలుకి వెళ్ళాలి. ఎందుకనో తెలియదుగాని ఈ తడవ స్కూలుకి వెళ్ళాలని పించటంలేదు. నోరెరుగని పసివాళ్ళకి విజ్ఞానబోధ చేస్తూ, త్రిపిటక్షకంధుడు విష్వక్సేనుడు అనేవాక్యాలని వాళ్ళమీద ప్రయోగిస్తూ కాలంగడపాలంటే ఎందుకో భయంవేస్తున్నది.

జీవితంలో దుర్దమ్యమైన ప్రేమవేగాన్నామె నిగ్రహిం చుకోవాలని ఇన్నాళ్ళు ప్రయత్నించింది. ఇహ ఇప్పుడలా చేయాలనిపించటం లేదు. చెంపని చేయి చేర్చుకొని ఆలో చిస్తున్న సుమతిని చూసి-

"అలా వున్నావేం ?" అన్నాడు త్యాగరాజులు. పక్కింటివారి రేడియోనించి కామవర్ధనీ రాగం వినిపిస్తున్నది.

"ఎలా ఉన్నాను?"

"దిగులుగా ఆలోచిస్తో..."

"ఏం చెయ్యను త్యాగీ! బ్రతుకంటే భయం పుడుతున్నది. చిన్నప్పటినుంచీ రోగిష్టివాళ్ళ మంచాల ప్రక్కన బ్రతకటం అలవాటుఉండేమో; ఇప్పుడిల్లంతా ఖాళీ అవటంతో మతి పోతున్నది" అని నవ్వింది సుమతి.

'నేనున్నాను సుమతీ! బ్రతుకంటే ఉన్నభయం పోగొడతాను' అందామనిపించింది త్యాగరాజులుకి. కాని పాప ముఖం క్లోజప్‌లో కనిపించి దీనంగా చూసింది. ఒకవేళ పాపని పెంచటానికి సుమతి ఒప్పుకుంటుందేమో! ఒప్పుకుంటే మాత్రం లీల ప్రతిబింబాన్ని అనుక్షణమూ ఎదురుగుండా చూస్తూ సుమతితో కాపురం చేయటం ఎలా?

"ఏమిటి త్యాగీ, ఆలోచిస్తున్నావు?"

"మనం శాపగ్రస్తులం సుమతీ! మనకి శాపవిముక్తి కూడా లేదు" అని పేలవంగా నవ్వాడతను.

"రేపటితో సెలవు అయిపోయింది. డ్యూటీకి వెళ్ళాలి" అన్నది పమిటకొంగు వ్రేలికిముడి వేసుకొంటూ సుమతి.

ఇవాళ సుమతి ధోరణే విచిత్రంగా ఉంది. సెలవు అయిపోయిందన్న విషయం తనకి ఇదివరకు తెలుసు. ఇవ్వాళ రెండుతడవలు చెప్పింది. మళ్ళీ ఇప్పుడు అదే విషయాన్ని పునశ్చరణ చేస్తున్నది.

"సుమతీ, ఏం జరిగిందో నాకు చెప్పకూడదూ?" దగ్గరికివచ్చి ఆమె భుజంమీద చెయ్యివేసి అడిగాడతను. రేడియోలోనుంచీ కామవర్ధని రాగం ఇంకా వినవస్తూనే ఉంది.

ఆ స్పర్శతో ఆమె పులకించి పోయింది. ఒక్కతడవ గట్టిగా అతన్ని తనగుండెలకి అదుముకుని "త్యాగీ, ప్రపంచం ఏమన్నాఅనుకోనీ మనం కలిసేజీవిద్దాం"అందా మనిపించింది.

స్త్రీ స్వభావం చిత్రమైనది. జీవితంలో తను కోరిన దాన్ని సాధించటంకోస్సం తల్లిని, తండ్రిని, కులాన్ని, ధర్మాన్ని తేలికగా వదిలేయటమే గాకుండా లజ్జాకరం అని లోకం అనుకుంటున్న మోహంలోపడి వీళ్ళు అతి సులువుగా అన్నీ వదిలి వేసుకుంటారు. అనుచిత ప్రణయసంబంధ మని ప్రపంచం భావిస్తున్న ప్రచండాకర్షణలో రాక్షసమని సంఘం వ్యాఖ్యానిస్తున్న క్షుధాపీడనంలో వాళ్ళు ఏం చెయ్య బోతున్నారో వాళ్ళే తెలుసుకోలేరు.

మనస్సంబంధి అయిన ఉపలబ్ధికివశమై హృదయావేగ నిర్దేశంతో సుమతి చేయబోతున్న పని లోకం దృష్టికి పాపం కావచ్చును కాని, మానవత్వ విచారణలో మాత్రం అధర్మ మైనది కాదు- అస్వాస్థ్యకరం కావచ్చును. సామాజికమైన దృష్టికీ మానవత్వానికి చెందిన వాంఛలకీ ఏనాడూ సామ రస్యం కుదరదు. చట్టరీత్యా అయితే ఏమో తెలియదు. చట్టరీత్యా 'దేహలాలస' అని దేన్ని అంటారో, అది అప్పుడ ప్పుడు ప్రేమగాకూడా అవుతుంది. అది అపరాధం కాదు. కాకపోతే ఒకటి: పర్మిషన్‌గాని, టోకెన్‌గాని లేకుండా, చట్ట రీత్యా మరో స్త్రీ హక్కుని కైవశం చేసుకోవాలని ప్రయ త్నించటం.

అప్పుడామె అపరాధిని. శిక్ష పొందక తప్పదు. సుమతి ఈ విధంగా శిక్ష పొందింది.

త్యాగరాజులుని అల్లుకుపోదామని ఆమె ప్రయత్ని స్తున్న సమయంలో అనుకోకుండా లీలా, స్వామి ఆ గదిలో ప్రవేశించారు... కొన్ని క్షణాలపాటు నలుగురూ మాట్లాడ లేదు. మెదలకుండా లీలా, స్వామీ వెళ్ళిపోయారు. ఇంతే జరిగింది.

# 14

గవర్నరుపేట సెంటరులోఉండే రద్దీ ఇంతా అంతా కాదు. అందులో అయిదూ ఆరూమధ్య ఇక చెప్పనే అక్కర లేదు. స్వామి కారు నడుపుతున్నాడు; వెనక సీటులో లీల నీరసంగా జారబడిఉంది. సరిగ్గా అదే సమయంలో మరో కారు ఎదురు వచ్చింది. అందులో లలితా సాంబశివరావూ వున్నారు. దాని వెనుక టాపులేని మరోకారు. దానిలో గిరి నందిని అనబడే చాకలెటీ, మరో మందుల కంపెనీ మేనేజరూ ఉన్నారు. ఆ వెనుక సైకిలుమీద బ్రాంటీస్వీటీ, ఆమె ఆరా ధకుడైన స్టంటురాము.

ఈ వరుసలో జీవనస్రవంతి అవిచ్ఛిన్నంగా సాగిపో తున్నది గవర్నరుపేట సెంటరులో.

ఒక విధంగా చూస్తే అందులో తప్పేమీ కన్పించ టం లేదు. ఏ క్షణంలో ఏది ఆనందమనిపిస్తే అది చేయటం; మరుక్షణంలో ఏం జరుగబోతున్నదో ఆలోచించి మతి పోగొట్టుకోవటంలాటివి వారిలో ఎవరికీ లేవు—స్వామి కారులో జారబడి కూర్చున్న లీలకి తప్ప.

ఒక విధంగా లీలకి చాలాసంతోషంగా ఉంది. ఎందుకంటే, స్వామి తనకి నీతిబోధచేసి భర్తదగ్గర దిగబెట్టాలని తీసుకవచ్చాడు... అదే సమయానికి త్యాగరాజులు తప్పు చేస్తూ పట్టుబడడం-తనమీాద అపరాధం లేకుండా పోవటం-అదృష్టంకాక మరేమిటి ?

"ఇప్పటికైనా నిజం తెలిసిందా, స్వామిగారూ!" అన్నది ఆమె, నిజం అనేవాక్యంమీాద ఒత్తిపలుకుతూ. విజయవాడ జీవితం ఆమె ఆంతర్యంలోకూడా ఒకవిధమైన విశృంఖలతని ప్రవేశపెట్టింది.

సంఘబంధాలనుంచి పారిపోయినవాళ్లు విజయవాడలో భయపడ నవసరంలేదు. తమకు సాన్నిహిత్య పరిచయం ఉండి,తమని అదుపులో ఉంచగల స్వజనాన్నుంచి బయటపడి-యేవిధమైన భయమూలేని సాంఘిక విశృంఖలతో-వారి వారి మనోప్రవృత్తులకూ వ్యక్తిగతమైన ఆలోచనలకూ అనుగుణంగా సూటిగా బ్రతుకు ప్రారంభిస్తారు. దానిఫలితం ఏమిటంటే, పునాదులూ చుట్టుగోడలూ లేని వదులయిన సాంఘిక వ్యవస్థ ఏర్పడటం.

ఈ వ్యవస్థలో బ్రతికేవాళ్ళ జీవితాలకి ఆధారాలూ ఆశయాలూ వుండవు - విశృంఖలతే తప్ప.

ఆంధ్రదేశపు నడిగడ్డ అయిన ఈ విజయవాడలో మరోచిత్రం ఉన్నది. ఆంధ్రదేశంలో ఉన్న అన్ని మతాలవీ కులాలవీ అయిన సంస్కృతులన్నీ ఇక్కడ కని
వివాహం లేకుండా తల్లులయిన యువతులు—

వృత్తిగా పెట్టుకునికూడా సంఘంలో గౌరవాన్ని పోగొట్టు కోని విచిత్రజీవులు — పరమపవిత్రంగా బ్రతుకుతూకూడా అపనిందల పాలవుతున్న అభాగ్యులు—మాంసంతినే బ్రాహ్మణులు— మాంసం అనేది ముట్టని అబ్రాహ్మణులు— జంధ్యంవేసుకోని భూసురులు—జంధ్యంవేసుకొని వేదపఠనం చేసే శూద్రులూ—విపరీతమైన నాస్తికులు—మూర్ఖులైన ఆస్తికులు ఇలారకరకాల వ్యక్తులు ఈ నగరంలో ఒకరిపక్కన ఒకరు జీవిస్తున్నారు.

సాంఘికమైన సంప్రదాయాలూ మానసిక స్థితులూ పూర్తిగా తారుమారైపోయిన ఈ నగరంలో వ్యక్తులూ వారి మనస్తత్వాలూకూడా కొంత విచిత్రంగానే ఉండటం సహజం. చిత్రం ఏమిటంటే పాతఆచారాలు వదులైపోతయి- కొత్త ఆచారాలను బిగించుకోలేరు. అంతటితో లంగరులేని పడవకీ బ్రతుక్కీ భేదం ఉండదు - ఫలితం: స్వార్థంతో కూడిన విషవలయంలో ఇరుక్కున్న జీవితం.

గాలి పటాలలాటి మనుష్యులు — నీతినియమాలని నిర్లక్ష్యంచేసే నాగరికత—సంస్కార రాహిత్యాన్నే సంస్కారం అని భ్రమించటం—యేబంధాలూ లేకుండా సాధ్యమైనంత ఆనందాన్ని అనుభవించటం... ఇదీ పరిస్థితి. ఈ పరిస్థితినే అధమవర్గాల్లో అవినీతి అంటే-ఉన్నతవర్గాల్లో నాగరికత అంటారు. ఈ నాగరికత మత్తుమందులాటిది. ఇది సేవించిన మగవాడికే మోగాని, ఆడదానికిమాత్రం విముక్తి అంటూ లేదు.

ప్రస్తుతం లీల అదే మాదకతలోపడి భర్త పరస్త్రీ పరిష్వంగంలో ఉంటే విచారించటానికి బదులు విచారాన్ని నటిస్తున్నది.

"స్వామిగారూ, డైవోర్సుతప్ప గత్యంతరంలేదు" అన్నది లీల.

స్వామినవ్వి "వెనక్కితిరిగి అద్దంలోంచి చూడండి- లలిత సాంబులుతో కారులో ఫ్రంట్‌సీటులో కూర్చుని కుడి చెయ్యి అతని సీటుమీద జాపింది... ఇంచుమించు అతని భుజంమీదే ఉంది ఆమెచెయ్యి. నేనూ మీతోపాటే డైవోర్సుకి పడెయ్యమంటారా, చెప్పండి!" అన్నాడు.

లీల ఆశ్చర్యంతో వెనక్కి తిరిగి చూసింది.

"ఇదేతప్పు త్యాగరాజులుగారూ చేశారు. ఆవిడభుజం మీద అతనిచెయ్యి ఉండగా చూశాం మనం" అని ఎడం చేత్తో సిగరెట్ నోట్లో పెట్టుకుని లైటర్‌తో వెలిగించాడు అతను.

లీల మాట్లాడలేదు...నిజమే ఈపనే లలిత చేస్తుంటే తప్పుగా ఎందుకు కనిపించటంలేదు తనకి ?

"మీరే ఆలోచించండి లీలగారూ! మీరు డైవోర్సు ఇస్తే మీపాపని ఎవరికి అప్పచెబుతారో తెలియదు. ఒకవేళ ఆయనకే అప్పచెపితే సవతితల్లి పాపని సరిగా చూస్తుందని గ్యారంటీ ఏమిటి? మీరు బ్రతికుండీకూడా పాపని దిక్కులేని దాన్ని చేస్తారా, చెప్పండి!"

లీల అదిరిపోయింది.

"మాకు సంతానంలేదు. అంతమాత్రంచేత పసిబిడ్డల ప్రేమ తెలియదని అనుకోవద్దు. నేను స్త్రీ హృదయం కల వాడిని లీలగారూ!" అన్నాడు స్వామి. కారు నడుపుతూన్న ఆ లక్షాధికారి ఆంతర్యంలో ఉన్న మార్దవాన్ని గుర్తించి అభినందించేందుకు లీల, అన్నపూర్ణ కాదు.

అన్నపూర్ణ... ఆమె ఎక్కడుందో స్వామికి తెలియదు. ఆమె అతని ప్రియబాంధవి. లీల పినతల్లి అన్నపూర్ణ. అని ఆ క్షణంలో స్వామికి బొత్తిగా తెలియదు. వంచిత అయిన ఆ త్యాగమూర్తి వరుసకు బావగారైన ఒక వృద్ధుడి భారాన్ని తన భుజస్కంధాల కెత్తుకొని అజ్ఞాతంగా బ్రతుకుతున్న సంగతి అసలే తెలియదు. ఆమె కోసం అతని ఆంతర్యం అనుక్షణం స్పందిస్తూనే ఉంది.

కొన్ని సంవత్సరాల క్రిందట తెలుగు దేశంలో ఉన్న అయిదారు ఇందుపల్లులలో ఒకదాంట్లో దేవాలయంలో కార్తీకమాసపు తెల్లవారు జామున ఒక దొంగపెళ్ళి జరిగింది. స్వామి మేనమామ ఊరు అదే అవటం వలన అర్ధరాత్రి ఊళ్ళో ప్రవేశించిన పదహారేళ్ళ స్వామి చీకట్లో ఇల్లు కనుక్కోలేక ఒకఅరుగుమీద చలికి ముడిచిపెట్టుకు పడుకున్నాడు.

తెల్లవారటానికి ఇంకా ఘడియపొద్దు ఉన్నదనగా ఎవరో వచ్చి తనని లేపి తీసుకెళ్ళి 'అరిస్తే తంతాం' అని భయపెట్టి దేవుని సమక్షంలో తనచేత ఒకమ్మాయికి మంగళసూత్రం కట్టించారు. ఆ పిల్లకి పన్నెండేళ్ళు ఉంటాయి. కుడి

బుగ్గమీద పెసరబద్దంత పుట్టుమచ్చ, నిద్రలేక ఎర్రబడినకళ్ళకి కాటుక... మొగాన కళ్యాణ తిలకం. మెల్లిగా ఆ అమ్మాయి చెయ్యి తనచేతిలోకి తీసుకుని 'నీ పేరేమిటి?' అని అడిగా డతను.

"అన్నపూర్ణ" అన్నది ఆ పిల్ల, అతనిచేయి నీటిలో మునిగిపోతున్న దానిలాగా పట్టుకుని.

అసలు వీళ్ళెవరో, ఎందుకని ఇలా తీసుకొచ్చి బలవంతంగా పెళ్ళిచేస్తున్నారో అతనికి అర్థంకాలేదు. ప్రాణాలు దక్కాలంటే ఆ పిల్ల మెళ్ళో మంగళసూత్రం కట్టితీరాలి. ఆ పిల్లని చూశాక ఒకవేళ మళ్ళీ వీళ్ళు 'ఒద్దు పొమ్మంటారేమో'అని కూడా భయపడ్డాడు.

మెల్లిగా ఎవ్వరూ వినకుండా 'నువ్వెవరి పిల్లవి?' అని అడిగాడు. ఆ పిల్ల నిర్భయంగా సమాధానం చెప్పింది. 'వెంకన్న శాస్త్రుల్లుగారి అమ్మాయిని' అని అన్నీ తెలిసినట్లు నవ్వింది.

అంటే బ్రాహ్మణు లన్నమాట! తను శుద్ధమైన అబ్రాహ్మణుడు. ఏదో కొంపమునిగింది, అదేదో ఈ అమ్మాయికి తెలుసు. మెల్లిగా తిరిగి అడిగాడు "ఏమి టిదంతా?"

"మా మామయ్య తన కొడుక్కి నన్నిచ్చి పెళ్ళి చెయ్యాలని - మా నాన్నకి ఇష్టం లేదు; అందుచేత మావూరినించి నన్ను ఎత్తుకొచ్చి వీళ్ళకి అప్పచెప్పాడు. తనకొడుకునికూడా పంపిస్తా నన్నాడుట- మరి వీళ్ళు నిన్ను పట్టుకొచ్చారు" అన్నది ఆ పిల్ల.

"అయితే నేను మీ మామయ్యకొడుకుని కాదు-అని నీకు తెలుసుగదా... వీళ్ళతో చెప్ప వెందుకని?" అన్నాడు తను. అప్పు డాపిల్ల అద్భుతమైన జవాబు ఇచ్చింది.

"మన పెళ్ళి గుళ్ళో జరుగుతున్నది. దేవుడికిష్టం లేక పోతే ఎలా జరుగుతుంది!"

"మేము బ్రాహ్మలం కాదు" అన్నాడు తను ధైర్యం చేసి.

ఆ పిల్ల ఉలిక్కిపడ్డది... కొన్ని క్షణాల్లోనే తేరుకొని మెదలకుండా కూర్చుంది. తనకి ఆ కిందటిరోజే రైల్లో చదివిన కాశీమజిలీకథ గుర్తుకువచ్చి తన ఉంగరంతీసి ఆమె వేలికి తొడిగాడు... తనపేరు ఆ ఉంగరంమీద ఉన్నది.

ఇక ఆ తర్వాత, జరగవల్సిందంతా యథావిధిగా జరిగిన తరువాత తను అసలు పెళ్ళికొడుకుకాదని తెలియటం—తనని నాలుగువాయించి డొంకలో పారేటంవరకూ గుర్తు ఉంది. మర్నాడు తనమేనమామను చూసి దొంగలుకొట్టి ఏదో ఎత్తుకుపోయినారు అనుకోవటం జరిగింది.

తను ఆ మేనమామ కూతుర్నే చేసుకోవాల్సి ఉంది; చేసుకోలేదు. జరిగినదంతా మేనమామతో చెప్పాడు. ఆయన ఆలోచించి-

"నీకు తెలిసింది ఆ అమ్మాయిపేరు అన్నపూర్ణ అనీ; వాళ్ళు బ్రాహ్మణులనీను...అంతేనా?" అన్నాడు. నిజమే, అంతమాత్రంచేత వాళ్ళెవరో ఎలా తెలుస్తుంది! వెళ్ళిచూస్తే తలంబ్రాల బియ్యంతప్ప మరేం కనిపించలేదు. తను పన్నెండేళ్ళు ఆ పిల్లని వెదికాడు. దైవసాన్నిధ్యంలో జరిగిన వివాహ

మది - దైవమే విచ్ఛిన్నం చేశాడు. ఆ పిల్ల ఆచూకీ తెలియలేదు. తరువాత విదేశాలూ డబ్బు సంపాదనా లలితతో జీవితం అన్నీ జరిగినయ్.

అయినా అనుక్షణమూ ఆ అజ్ఞాత వధువు అతని స్మృతి పథంలో మెదులుతూనే ఉంది- తను ధర్మపథం తప్పానేమో అన్న భయమూ వదలటంలేదు. అన్నిటికంటే చిత్రం... దీని విషయమే కవులకూ గాయకులకూ అంతు బట్టటంలేదు. ఆ పిల్లని ఆ కొన్ని ఘడియల్లోనే హృదయేశ్వరిగా భావించాడు. అప్పుడు వయసు మాత్రం ఎంత! ఆ పిల్లకి పన్నెండు; తనకి పదహారు.

తన పరధ్యానం దేనికో లలితకి తెలియదు. ఇంకో తమాషా ఏమిటంటే లలితని తను పత్నిగా భావించలేక పోతున్నాడు - అసలు హక్కుదారిణి ఆమె కాదన్న విషయం అజ్ఞాతంగానే ఉంచాడు. అదికూడా ఒకవిధంగా ద్రోహమే. ఆ కథ చాలామందికి అప్పుడే తెలియదు- ఇక ఇప్పుడా! నిట్టూర్చాడు స్వామి. తన ప్రియ పత్నికోసం ఆక్రోశించింది అతని హృదయం. ఆమె కులం వేరు - తన కులం వేరు; అయినా సరే తమకి ధర్మసమ్మతమైన వివాహం జరిగింది. ఈశ్వరుని అస్తిత్వంలో అతనికి ఇప్పు నమ్మకం లేదు. అయితే ఈశ్వరత్వ కల్పనలో అతనికి విశ్వాసం ఉంది - అందుకే అతనిలోని ఆశ యింకా అంతరించలేదు.

ఆ సమయంలోనే "కారాపండి స్వామిగారూ, మా ఇల్లుదాటి పోతున్నది" అన్నది లీల. తన పరధ్యానానికి తనే నవ్వుకొని కారు బ్రేక్ చేశాడు స్వామి.

ఎదురుగుండా అన్నపూర్ణ, లీల శిశువును ఎత్తుకొని నిలబడిఉంది.

స్వామి తెల్లబోయినాడు. ఏ నాటిమాట! చిత్రపటంలాటి తన లేత ఇల్లాలు సజీవంగా ఎదుట నిల్చింది. ప్రశాంతమైన అతని హృదయం మేఘపుంజాల గర్జనతో వాయువేగంతో విద్యుత్తుతో విచలితమై అల్లకల్లోలమై పోయింది. ఏం జరిగింది ? తను చూస్తున్నదేమిటి ? తుఫానులో చిక్కుకొన్న నౌకలా అతని మెదడు ఊగులాడటం ప్రారంభించింది.

లీల ఆ స్థితి చూసి తెల్లబోయింది. అంతలోనే తేరుకొని "ఎప్పుడొచ్చావు పిన్నీ!" అని అన్నపూర్ణని ప్రశ్నించింది.

అన్నపూర్ణ అంతవరకూ కారువంక చూడలేదు. ఇప్పుడు తలఎత్తి చూసింది... ఉలిక్కిపడి మరోసారి చూసింది... అంతే. నిశ్చైతన్య అయి ఆధారవిహీనమైన లతలా నేలమీద వాలిపోయింది. పాపాయి కెవ్వుమంది.

స్వామి గబగబా కారుదిగివచ్చి, ఆమెతల తన ఒడిలోకి తీసుకున్నాడు. ఆమె బుగ్గమీద పుట్టుమచ్చ అతని ప్రాణాల్ని పిండేస్తున్నది. 'ఇంత ఆలస్యంగానా నీవు కనబడటం' అనుకున్నాడతను. ఒక్కతిడవ తన ప్రాణబంధువుని అక్కున చేర్చుకొన్నాడు. ఇంకా ఆమెకి స్పృహరాలేదు.

లీలకి ఇదంతా ఏమిటో అర్థం కాలేదు. ఇంతలో గోపాలరావుగారి స్థూలకాయం ఇంట్లోంచి వసారాలోకి వచ్చింది. ఆయనకి సర్వమూ అర్థమయిపోయింది. అన్నపూర్ణ విషాద

గాథ ఆయనకి తెలుసు. ఇతని కోసమే దుర్భరమైన వైధవ్య భారాన్ని పైనవేసుకుందనీ - ఇతని కోసమే ఎన్నో అపనిందల్ని సహిస్తున్నదనీకూడా ఆయనకు బాగా తెలుసు.

అర్ధరాత్రి ఎవరో అజ్ఞానబాలుడు దేవాలయంలో కట్టిన పుస్తెకి ఇంత ప్రాధాన్యం ఏమిటి!- అని అందరూ చెప్పినా ఆమె వినలేదు- చివరికి తనుకూడా చెప్పాడు.

"అదేమిటి బావగారూ, ఆ రాత్రి మామయ్యకొడుకుతో పెళ్ళిఅయివుంటే మీరంతా ఆ పెళ్ళిని కాదనమని సలహాయిచ్చి ఉండేవారా, చెప్పండీ? పెళ్ళి అనేది వదిలించుకుందామంటే వదలదు బావగారూ" అన్నది. తరువాత చాలారోజులు అతనెవరో తెలియదు. ఉంగరంమీదమాత్రం అతనిపేరు ఉన్నది. చాలారోజులు ఎదురు చూసిచూసి చివరకి ఒకనాడు తిలకాన్ని, గాజుల్ని విసర్జించి తనకి తానే వైధవ్య శిక్షను విధించుకుంది ఆ సాహసిక.

ఆ తరువాత తనకి వండిపెడుతూ గడిపివేస్తున్నది. చుట్టాలూ బంధువులూ విమర్శించారు. కొందరు పొగిడారుగాని, అదికూడా అర్థంలేని పొగడ్త. పతిత అనిపించుకుంటూ వృద్ధుడూ వాతరోగీ అయిన తనతో అక్రమ సంబంధం అంటగట్టబడిన అన్నపూర్ణ ఎంత ఉన్నతురాలో ఆ సర్వేశ్వరుడికొక్కడికే తెలుసు.

"నాన్నా, ఏమిటిదంతా!" అంది లీల.

గోపాలరావుగారు కళ్ళు తుడుచుకొని "జీవితానుభవంవల్ల నేను తెలుసుకొన్న మహా సత్యాల్లో ఇది ఒకటి" అన్నాడు.

లీల విసుక్కుని "సరిగా చెప్పవయ్యా గొడవ" అన్నది.

"తరువాత చెపుతాను, ముందు పిన్నికి స్పృహ వచ్చేట్లు చూడు" అన్నాడాయన. ఆయన కళ్ళు తిరిగి చెమ్మగిలినయ్.

అన్నపూర్ణకి స్పృహ వచ్చింది. జీవితంలో అతడెన్నటికైనా కనబడితే ప్రేమను బయటికి తెలియచెయ్యొద్దని సంకల్పించుకుంది. ఈ సంకట స్థితిలో ఆ ప్రేమ - మహా వేగంగా వచ్చిన పినాకినీ నదిలాగ వరదగట్టి బయట పడ్డది.

ఇప్పుడు అతను తనకేమవుతాడు ? భారత న్యాయ శాస్త్రప్రకారం ఇన్నాళ్ళు కనిపించకుండా పోతే ఆవివాహం విచ్ఛేదమైనట్లే. బంధు మిత్రులు ఆ పెళ్ళిని అంగీకరించ లేదు- కేవలం తనొక్కతే ఎదురు నిలిచి ఆ వివాహానికి కట్టు బడ్డది. ఇది ఎన్ని జన్మల సంస్కారం ?

భారతదేశపు మట్టిమీద నివసిస్తున్న నారీ హృదయంలో పాతివ్రత్యం అంటే ఇంత ప్రలోభమేమిటి ? తనని తనే నిందించుకుంది అన్నపూర్ణ. ఇన్ని ఆలోచనలనీ ఇంతటి న్యాయశాస్త్రాన్నీ అతిక్రమించి అంతర్యంలోనుంచి పొంగి వచ్చిన ఒక వాత్సల్యవాహిని స్వామి వైపు నెట్టింది ఆమెని. అతని మెడకి రెండుచేతులూ పెనవైచి-

"ఇంతకాలమూ ఏమైపోయావు నువ్వు? మళ్ళీ ఇప్పుడు దేనికి కనిపించావు ! నా బ్రతుకు ఇలాగే వెళ్ళి పోయేది గదా" అని ఏడవటం ప్రారంభించింది ఆమె.

స్వామి నిగ్రహించుకొని "నీ బ్రతుకు నేను పూర్తిగా ఆక్రమించుకున్నాను. నా వల్లనే నీకీ దుస్థితి ప్రాప్తించింది. నన్ను క్షమించు" అన్నాడు.

అతని మాటలకు అడ్డొచ్చి "వద్దు" అంది.

"ఎందుకని ?"

అతని నోరు ముయ్యటానికి ఎత్తిన ఆమె చెయ్యి దుర్బలమై జారిపోయింది. ఈ ఆజ్ఞ ఉల్లంఘించటానికి వీలు లేదు. ఈ బంధం త్రెంచటానికి వీలులేదు. ఆమె ఆ సమయంలో ఒక మహా వేదనకు లొంగిపోయి అతని పాదాలకు నమస్కరించింది. బహుశా భారత దేశంలోని సర్వదేవతలూ ఆమెని ఆశీర్వదించే ఉంటారు.

రెండురోజుల తర్వాత "అతనెవరు ?" అన్నది లీల అన్నపూర్ణతో. అన్నపూర్ణ చిరునవ్వు నవ్వుతూ "నా బాల్య ప్రేమికుడు" అన్నది.

# 15

"అదికాదు నాన్నా, సుమతితో ప్రేమకలాపం జరుపుతున్నవాడితో ఎలా కాపురం చేయటం ?" అంది లీల.

"ఆ మాత్రం క్షమాగుణం లేకపోతే ఎలాగమ్మా!" అన్నది అన్నపూర్ణ పిల్లకి పౌడరద్దుతూ.

లీలకి ఇవ్వాళ మనసు బాగాలేదు. లలితభర్త తన పినతల్లికి బాల్య ప్రేమికుడు అవటం ఆమెకేమీ నచ్చలేదు. ఏదో తెలియగాని అన్యాయం జరిగిపోతున్నట్లనిపించింది. అంతవరదాకా అర్థం తెలియని అవినీతి అర్థమైపోయినట్లనిపించింది. లలిత కాపురం ఏమై పోతుందన్న బాధకూడా కలిగింది. వాళ్ళిద్దరి ప్రేమా ఎంత అంచులు దాటిందో ప్రత్యక్షంగా తనకళ్ళతో చూసింది ఆమె.

"నువ్వు చేస్తున్నది మాత్రం ఏమంత బాగుంది పిన్నీ! ఇతరులకు నీతులు చెప్పటం చాలా తేలిక. ఎదుటివాళ్ళ కాపురానికి నీళ్ళు తోడేవారందరూ క్షమాగుణం మీద లెక్చర్లిస్తూనే ఉంటారు" అని కచ్చగా అనేసింది. గోపాల రావుగారు ఇక సహించలేక "నోర్మూయ్ పాడు వాగుడు" అన్నారు.

"బావగారూ...ఎందుకలా కోప్పడుతారు? స్వామిని వశం చేసుకుని లలిత కాపురాన్ని పాడు చేస్తున్నానని లీల బాధ" అన్నది అన్నపూర్ణ నవ్వుతూనూ.

"అన్నపూర్ణా..."

"ఊరుకోండి బావగారూ! మీకేం తెలియదు" అని బావగారిని కసిరింది ఆమె. లీల మండిపడుతూ అక్కడ నించి వెళ్ళబోతుండేసరికి స్వామి ఆ గదిలోకి ప్రవేశించాడు. అదిచూసిన అన్నపూర్ణ లోపలికీ లీల బయటికీ వెళ్ళిపోయి నారు. ఆ గదిలో కేవలం ఇద్దరే మిగిలారు. ఆ ఇద్దరూ అన్నపూర్ణని దేవీమూర్తిగా ఆరాధించే వ్యక్తులు.

"నాయనా, అపనిందల్ని అన్యాయంగా నెత్తిన వేసు కుంటున్నది ఆమె. ఇకముందు ఏంచెయ్యతలుచుకున్నావు?" అని ప్రశ్నించారు గోపాలరావుగారు.

స్వామి సమాధానం ఇవ్వలేదు. గోపాలరావుగారు మళ్ళీ ప్రారంభించారు. "విధి చాలా చిత్రమైనది. అది ఏ క్షణానికి ఏం చేస్తుందో ఎవరికీ తెలియదు. అన్నపూర్ణకి అనేక తడవలు చెప్పాను— 'కాలం మారింది, నీవు మళ్ళీ పెళ్ళి చేసుకో'మ'ని. విన్నదికాదు. 'పెళ్ళి అనేది ఒక తడవకే శిక్ష

కదా బావగారూ! ఆ శిక్ష మళ్ళీ మళ్ళీకూడా దేనికి!' అన్నది."

"స్వామి మనసులో అన్నపూర్ణ ఉదాత్తత శతధా విస్తరించి మరింత మోహపెట్ట సాగింది.

"'పెళ్ళి అనేది చేసుకోకపోతే ఇంతశిక్ష అనుభవించే దాన్నా చెప్పండి? అతనెవరో నాకు తెలియదు. అతన్ని కలుసుకో గలుగుతానో, లేనో అంతకన్నా తెలియదు. అయినా సరే ఎందుకిలా నిరీక్షిస్తున్నా నంటారు? ఇది నాకు నేనే పెళ్ళివలన విధించుకున్న శిక్ష. ఒకవేళ ఆయన తిరిగి కనిపించినా నన్ను ఏలుకునే స్థితిలో ఉండక పోవచ్చును. హాయిగా మరో పెళ్ళి చేసుకుని పిల్లా పాప కనుక్కొని... పోనీ లెండి బావగారూ, ఆయన మన కులంకూడా కాదుగా...' అనేది - ఏమయినా సలహా చెప్పబోతే"

రెండు కళ్ళూ చెమ్మగిలినయ్ గోపాలరావుగారికి. ఇంతలో అన్నపూర్ణ రెండు గ్లాసులలో కాఫీ తీసుకొచ్చి అక్కడ పెట్టి "మీ ఇష్టా ఇష్టాలు నాకు తెలియవు. ఈ పేళప్పుడు మీరు కాఫీ తాగుతారా?" అన్నది.

స్వామి తలఎత్తి ఆమెవంక చూశాడు. ఆమె మొగాన బొట్టులేదు. చేతికి అరిగిపోయిన బంగారు గాజులు రెండు ఉన్నాయి. మెడ బోసిగా ఉంది. రవిక చాటున కొత్తగా కట్టుకొన్న పసుపుకొమ్ము అతనికి కన్పించ లేదు. ఈ మొగం తో ఈ సేవలతో తనకాట్టే పరిచయం లేదు; కాని ఎన్ని యుగాలనుంచో ఆమె తెలుసునని పిస్తోంది - కొత్త అనిపిం

చటం లేదు. 'వివాహంలో ఉండే ప్రత్యేకత ఇదే అయితే వివాహ విచ్ఛేదాలు దేనికి సంభవిస్తున్నయ్?' అనుకున్నాడతను.

"ఆమెనుకూడా తీసుకురాక పోయారా?" అన్నది అన్నపూర్ణ.

స్వామి నవ్వి "మీరు ఇదివరకు చూసే ఉంటారు" అన్నాడు.

"చూశాను. కాని ఇప్పుడు మళ్ళీ చూడాలనిపిస్తున్నది" అన్నది చీరకొంగు చేతికి మెలివేసుకుంటూ అన్నపూర్ణ.

"ఎందుకు?"

"అది మీకు అర్థంకాదు లెండి."

అన్నపూర్ణ జవాబుకి స్వామి సమాధానం చెప్పలేదు. కాఫీ త్రాగటం పూర్తిచేసి గ్లాసు క్రింద పెట్టబోయినాడు. అన్నపూర్ణ అతని చేతిలోగ్లాసు అందుకుంది. ఆ సమయంలో ఇద్దరివేళ్ళూ తగిలినయ్. ఇది ఏ నాటిస్పర్శ! భగవంతుని సన్నిధిలో పసితనంలో అతని చిటికెనవేలు పట్టుకొని అగ్నిహోత్రంచుట్టూ తిరగటం జ్ఞాపకం వచ్చింది ఆమెకి. 'స్నేహం సాప్తపదీనం'అన్నారు. జీవితాంతం ఆ స్నేహలత తమని ఇలాగే పెనవేస్తుందా? అసలీ వివాహ మంత్రాలలో ఉన్న అద్భుత మేమిటి?

అన్నపూర్ణ గ్లాసులు రెండూ లోపలపెట్టి వచ్చింది.

"ఇకముందు ఏం చెయ్యాలనుకున్నారో పెద్దలు మీరే సెల విప్పండి" అన్నాడు స్వామి సిగరెట్ వెలిగిస్తూ.

"ఇందాకటినుంచీ పొడిదగ్గు దగ్గుతున్నారు_ సిగరెట్టు దేనికి?" అన్నది అన్నపూర్ణ. స్వామి తలఎత్తి ఆమె వంక చూశాడు. కళ్ళు చెమ్మగిల్లినయ్ అతనికి.

ఈ స్నేహమయి నీడలో బ్రతకటం అనే అదృష్టం లభిస్తే అంతకన్న స్వర్గంలేదు – అనిపించింది. మెదలకుండా సిగరెట్టు అవతల పారేశి;

"చెప్పు. చెప్పండి... ఇకముందు" అన్నాడు. అతని మాట పూర్తికానివ్వలేదు అన్నపూర్ణ. "ఉండనియ్యండి-ఆముందుని. ఇప్పుడా చర్చ దేనికి?" అన్నది.

"అలాకాదు పిల్లా, రేపు నా ఘటం..."

"ఊరుకోండి బావగారూ! ఇంతపెద్ద ఘటానికి ఇప్పుడప్పుడే ఏం ఫరవాలేదు..."

స్వామీ గోపాలరావుగారూకూడా పకపకా నవ్వారు. ఆ నవ్వులో స్వస్థతలో అదివరకు ఏ కొంచెంఅయినా కొత్త అనేది మిగిలిఉంటే అది కాస్తా కొట్టుకుపోయింది. ఇంతలో లీల తుపానులా వచ్చి-

"స్వామిగారూ, వెడదాం పదండి" అన్నది. స్వామి తెల్లబోయి ఆమెవంక చూశాడు. ఈమె తనకోసం వచ్చాననుకుంటున్నదా? లేక ఇక్కడనుంచి తనని తీసుకుపోవాలను కుంటున్నదా? ఏదీ అర్థం కాలేదు అతనికి. నిన్న తన బడిలోనికి అన్నపూర్ణని తీసుకోటంవలన ఆమె అపార్థం చేసుకుందేమో అన్నఊహా కూడా రాలేదు అత

నికి...అయినా ఈసొసైటీ లేడీ ఇంత తొందరగా బయట పడుతుందని అనుకోలేదు.

"మీరు ఎక్కడికి వెళ్ళాలో వెళ్ళి, కారు పంపిం చేయండి-నేను తరవాత వస్తాను" అన్నాడతను.

"అసలు ఒకళ్ళని అనాల్సిన పనేముంది! మానాన్నకి జొత్తిగా బుద్ధిలేదులెండి" అని రుసరుసలాడుతూ వెళ్ళి పోయింది. అప్పుడే అంతరించిన కొత్త మళ్ళీ వచ్చినట్లని పించింది.

"చిత్రం-మహాఇల్లాలు కులట అని పించుకుంటుంది; కులట మహా ఇల్లా లనిపించుకుంటుంది. కాలమహిమ!" అని నిట్టూర్చారు గోపాలరావుగారు. ఎవరూ మాట్లాడలేదు.

ఒక అరగంట అయినాక స్వామిలేచి నిలబడి "రేపు వస్తానండీ" అని గోపాలరావుగారితో చెప్పి కారు దగ్గరికి నడిచాడు. అన్నపూర్ణ అతన్ని అనుసరించింది.

కారు ఎక్కబోతూ "అర్భకుడిని అన్నపూర్ణా, నన్ను వదలిపెట్టకు" అని కారు ఎక్కాడు, స్వామి. కారు సాగి పోయింది.

ఆ తరువాత గోపాలరావుగారి ఒళ్ళో తలపెట్టుకుని చాలాసేపు ఏడ్చింది ఆమె... ఆవృద్ధుని హస్తం ఆమె తల మీద ఎక్కువసేపు ఉంది.

"చెప్పండి బావగారూ, ఏం చేయమంటారు?"

"ఏ కులమైనాగాని, నువ్వు అతనిభార్యవు. లీగల్‌గా ఏమిటంటే..."

"అబ్బబ్బ, లీగల్ సంగతి తరువాత ఆలోచిద్దాం... ఆమె గతి ఏమిటి?"

"అదే చెప్పేది. లీగల్‌గా ఆ పెళ్ళి చెల్లదు. అందు కని..."

అన్నపూర్ణ చివాలున లేచి "లీల అన్నట్లు ఆమె కాపురానికి నీళ్ళొదలటం అధర్మం కాదూ!" అంది.

"అసలు ఏమిటంటే లా ప్రకారం... కాపురానికి నీళ్ళొదలటం అనేది..."

"దిక్కుమాలిన లా... దాని సంగతి ఎవరికి కావాలి? ఒక విధంగా ఈ విడాకులూ వాటివలన అన్యాయం జరుగుతున్నది. మాకు ఇష్టమై ఇద్దరమూ ఉంటే అభ్యంతరం పెట్టే హక్కు మీ లాకి లేదు."

"కాని, హిందూ వివాహ చట్టప్రకారం ఏమిటంటే...?"

"ఇదెక్కడి గోల? ప్రేమ ఉన్నప్పుడు విడతీస్తున్నది; ప్రేమలేనప్పుడు కలిసి కాపురం చెయ్యమంటున్నది. ఇదెక్కడి లా బావగారూ! దీనివేళ్ళు రావిలోంచి మొలిస్తే ఎట్లా; మానవుడి అంతర్యంలోంచి మొలవాలిగాని!" అని విసుక్కున్నది అన్నపూర్ణ.

ఈ అభియోగానికి ఆయన సమాధానం ఇచ్చితీరాలి. దాని సమాధానం నిష్ఠురమైనదే కావచ్చును. లక్షమంది స్త్రీలు కుతూహలంతో సమాధానాన్ని ఆశిస్తున్నారు. వారి సమక్షంలో నిలబడ్డాడు తను.

"నేను న్యాయాధిపతిత్వం నుంచి విరమించుకున్నాను అన్నపూర్ణా!"

"నేను చాలా దుఃఖం అనుభవించాను బావగారూ; నా దుఃఖాన్ని నేనే సృష్టించుకున్నాను. సాలీడులాగ స్వయంగా నాచుట్టూ నేను దుఃఖపు వలలు అల్లుకున్నాను. అందులో నాకు ఆనందం ఉంది. కాని నాలాటి స్త్రీలు ఇంకా కొందరు ఉండవచ్చును. వారికి మీ సమాధానం ఏమిటి?"

"దేశ సంబంధమూ, సమాజ సంబంధమూ అయిన న్యాయశాస్త్రంలో దీనికి సమాధానం లేదు అన్నపూర్ణా! ఏ మానవ న్యాయాధిపతీ దీనికి సమాధానం ఇవ్వలేడు. ఈశ్వరుడే దీనికి న్యాయాధిపతి. ఎప్పుడైనా ఆయన కనిపిస్తే దీనికి తీర్పు ఏ విధంగా ఇవ్వాలో తెలుసుకుంటాను."

ఆయన హృదయాన్ని చీలుకున్ని ఒక గాఢ నిశ్వాసం వెడలింది. అన్నపూర్ణ ఇక ప్రశ్నించలేదు. లోపలకు వెళ్ళింది. గోపాలగావుగారు మెల్లిగా లేచి ఆరుబయటికి వచ్చారు. ఎందుకో అడుగు ముందుకు సాగలేదు. ఆకాశం వంక చూచాడు. భగవంతుని కోర్టు ఇప్పుడే ప్రారంభమైనట్లుంది.

భూమి యోగినిలా స్థిరంగా ఉంది. చంద్రుడు ఆకాశమధ్యంలో ఆ మహాన్యాయాధిపతి అంతర్యంలా స్వచ్ఛంగా వెలిగిపోతున్నాడు. మబ్బుతునకల మధ్య వినీల నీలగగనం ,నాసక్తుడైన అతని లలాటంలా సరళంగా మెరుస్తున్నది.

నెమ్మదిగా మరో రెండు అడుగులు ముందుకు వేశారు గోపాలరావుగారు.

సూక్ష్మమైన విచారణలో ఒకవిధమైన ఆత్మ సమర్పణా ప్రసన్నతలో ఆయన అంతర్యం నిండిపోతున్నది.

భూమ్యాకాశ పరివ్యాప్తమైన శుభ్రకౌముదీ ప్రాచుర్యంలో ఆ మహామౌనంలో- అంతఃకరణావేష్టకమైన ఒకానొక అస్తిత్వం ఆయనను ఆక్రమించుకొంది. ఆ వృద్ధమూర్తి హృదయం అభిభూతమైనది.

ఇలాటి తపసు సృష్టి ప్రారంభంనుంచీ సాగుతున్నది. మహాగ్నిలో దగ్ధమై, ప్రళయమారుతంలో విక్షుబ్ధమై వర్షాప్లావితమైన ప్రపంచం, యిలాటి తాపసుల ఆశీర్వాదంలో ప్రసన్నమై ప్రాణస్పందినీ చైతన్యమూర్తి అవుతూఉంటుంది. మధ్య మధ్య, ఇప్పుడది మరోసారి చైతన్యవంతమై గోపాలరావుగారి అభిభూతమైన అస్తిత్వంలో, స్వయంజ్యోతి అయింది.

రెండు చేతులూ ఆకాశానికేసి జోడించి 'ఓ మహాన్యాయాధిపతీ... మరో శిక్షాస్మృతిని ఇవ్వు... మేం నిర్మించుకున్న న్యాయశాస్త్రం సంఘానికేగాని మనిషికికాదు మనిషి తప్పుచేస్తే సంఘం శిక్షిస్తున్నది. సంఘం తప్పుచేస్తే మనిషికి శిక్షించే బలంలేదు... ఈబలహీనతనుంచి మానవుడిని విముక్తుడిని చెయ్యి' అని ప్రార్థించా రాయన.

వెనకాల అడుగుల చప్పుడు అయింది. అన్నపూర్ణ వస్తున్నట్లు ఆయనకు తెలిసింది. అయినా వెనక్కి తిరిగి చూడలేదు.

ఆద్యంతరహితమై, జ్యోతిస్స్వరూపమైన ఆ వినీలాకాశంకింద ఆయన అంతరాత్మ స్థిర శాంత స్థితిలోకి పురోగమిస్తున్నది.

అన్నపూర్ణ వచ్చి ఆయనపక్కన నిలబడింది. జుట్టువిరబోసుకున్నది. విశీర్ణ అశ్రుధారా చిహ్నాలు ఆమె చెక్కిళ్ళమీద చారికలు కట్టినయ్. ఆమె ధౌత వస్త్రధారిణి అయిన తపస్విని.

"లోపలికి రండి బావగారూ, మంచుపడుతున్నది" అని ఆయన చెయ్యిపట్టుకొని లోపలికి నడిచింది ఆమె.

నీలిదేవత నిట్టూర్చింది. కొట్టి బాధపడేతల్లిలా నిట్టూర్చింది... అది విన్న న్యాయాధిపతి నవ్వి—

"పొరపాటు పడుతున్నావు నీలిదేవతా! మానవుడెపుడూ నిన్ను అసహ్యించుకుంటూనే అనుసరిస్తున్నాడు. ఇవ్వాళ కొత్తేముంది!" అన్నాడు.

"మరయితే న్యాయమూర్తీ, నా అవసరం ఎందుకు!"

"సాన్నిహిత్యానికి నీ అవసరం అడ్డువస్తుంది, సంప్రదాయానికి నీ అవసరం గడ్డు సమస్య"

నీలిదేవత ఇక మాట్లాడలేదు.

## 16

క్లబ్బులో సాయంత్రం... ఇతరచోట్ల సాయంత్రంలాగా ఉండదు. ఆ సాయంత్రం షాలిమార్ తోటవంటిది.

అందులో అనేక రకరకాల గులాబీలు వికసిస్తాయి, అనేక తుమ్మెదలు విహరిస్తాయి. ఈ సాయంత్రం పుష్పాలమధ్యా తుమ్మెదలమధ్యా జరుగుతున్న సంభాషణ చిత్రమైనది.

నటేశన్, కురంగేశ్వరరావు, చాకిలెటీ కూర్చుని షాంపేన్ సేవిస్తున్నారు.

"హలో డియర్! ఈ మధ్య స్వామికారు కొత్తచోట ఆగుచున్నది. సాంబశివరావు ఖాళీచేశాడా ఏమిటి?" అన్నాడు నటేశన్.

"లేదు. ఒకవరలో రెండు కత్తులిముడవనా నీ ఉద్దేశ్యం" అని నవ్వాడు కురంగేశ్వరరావు.

మొత్తానికి లీలే జయించింది. ఏ మంటావ్ డార్లింగ్!"అని చాకిలెటీని రెచ్చగొట్టాడు నటేశన్.

కొన్నాళ్ళనుంచి ఈ జీవితం అంటే విసుగు పుటుతున్నది గిరినందినికి. ప్రతి అడ్డమైనవాడితో ప్రేమ నటించడం! ఏ దౌర్భాగ్యుడు మీదచెయ్యివేసినా దాన్ని ఆమోదించడం! ఎంత సమర్థించుకున్నాగాని ఆమె అంతర్యం ఎదురు తిరుగుతున్నది. కాని కొన్ని శతాబ్దాలుగా ఇంట్లో జీవిస్తున్నా పుట్టని విసుగు, కొన్ని సంవత్సరాల నాగరిక జీవితానికి పుడుతున్నది, స్త్రీకి. అలసట ప్రారభమయింది ఆమెకి.

గిరినందిని విచ్చలవిడి జీవితానికి సగంకారణం తండ్రి అని చెప్పవచ్చును. తాగుబోతూ సోమరిపోతూ అయిన ఆ దౌర్భాగ్యుడు తన అందమైన కుమార్తెను మూలధనంగాపెట్టి

వ్యాపారం చేద్దామని ప్రారంభించాడు. ఆమె పాడుతుంది, డ్యాన్సు చేస్తుంది. చాపల్యంగల మగవాళ్ళని ఆకర్షించటానికి కావల్సిన అన్నిగుణాలూ ఆమెలో ఉన్నాయి. బొంబాయి, మద్రాసులాటి నగరాలలో అలాటివాళ్ళు చాలామంది ఉండటంవలన ఈమెకి ప్రత్యేకమైన ప్రాధాన్యత ఏమీలేదు.

విజయవాడ ఒక చిత్రమైన నగరం. ఆ నగరం మనస్తత్వం ఇంకా కిందటి శతాబ్దంలోనేఉంది. ఎయిర్ కండిషన్ థియేటరులో కూర్చుని ఈలలు వేసేవాళ్ళకి, రివాల్వింగ్ ఛెయిర్‌లో రెండుకాళ్ళూ రెడ్డిగంవేసుకుని కూర్చునేవాళ్ళకీ – డిటెక్టివు నవలలు చదివే సంస్కృత పండితులకీ – వాచీ వడ్డాణం ధరించే స్త్రీలకీ ఆ పట్నం నిలయం.

అందుకనే గిరినందిని తండ్రి తమ వ్యాపార కేంద్రంగా ఆ వూరుని ఏరుకున్నాడు. గిరీనందిని విచ్చలవిడితనం అక్కడ ఆశ్చర్యాన్నీ ఆకర్షణనీ కలిగించింది.

'జిందగీమే ఏకబార్ – ఆనా సింగపూర్' అనే పాట పాడుతూ సాంబులుతో డాన్సుచేసిన దగ్గరనించీ... గిరినందిని మనసులో ఒక విధమైన సంచలనం కలగటం ప్రారంభమయింది. తనకీ, వీధి నర్తకి బ్రాంటీకీ ఏమిటి భేదం? ఒక విధంగా ఆమె తనకు కార్టూన్! తనమీద తనకే అంతులేని విరక్తి కలుగుతున్నది. శాంతిలేదు, సుఖం అంతకంటే లేదు. అస్తమానం లిప్‌స్టిక్ చెరుగుతుందో, రూజ్ వెలిసిపోతుందో

అని జాగ్రత పడుతూ బ్రతికే ఈ బ్రతుకుకన్న నికృష్టమైన జీవితం మరొకటిలేదు.

తనతో ఇంత ప్రేమ నటిస్తున్న ఈ చవటలలో ఒక్కడికైనా తనమీద గౌరవం ఉన్నదా ? లేదు.

ఇందులో ఒక్కడైనా తన కూతురుని ఈ స్థితిలో జీవించమంటాడా ? లేదు.

కాని తనతో మాత్రం అందరూ ఎంజాయ్ చెయ్యాలని ప్రయత్నిస్తారు. ఆమె కెందుకో తిక్కరేగుతున్నది. అదుగో అప్పుడే పై ప్రశ్న అడిగాడు నటేశన్.

"షటప్"

బిగ్గరగా అరిచి విసురుగా వెళ్ళిపోయిన చాకిలెటీని చూసి ఆ ఇద్దరూ అరగంటదాకా బిగుసుకుపోయే ఉన్నారు. చాకిలెటీ క్లబ్బు గేటు దగ్గరకి రాగానే సాంబులు ఎదురయి "హలో, అప్పుడే వెడుతున్నావేం ?" అన్నాడు.

"దయచేసి నన్ను ఇంటివద్గర దింపితే చాలా సంతోషిస్తాను" అని అతని సమాధానానికికూడా ఎదురు చూడకండా కారెక్కి కూర్చుంది ఆమె.

ఆమె ధోరణికి సాంబులు ఆశ్చర్యపోయి మెదలకుండా కారు స్టార్టుచేశాడు.

గిరినందిని ఇల్లు మొగల్రాజపురంలో ఉంది.

"ఏమయింది చాకిలెటీ" అన్నాడు సాంబులు.

"దయచేసి నన్ను గిరినందినీ అని పిలవండి" అన్నది ఆమె. ఆ సమాధానానికి సాంబులు నిజంగా చాలా సంతో

పించాడు. అతనికి ఒక రకం స్త్రీ కావాలి. విచ్చలవిడి తనం నటించాలిగాని, విచ్చలవిడి తనం ఉండకూడదు. ఎదటివాళ్ళని ఆకర్షించాలిగాని, ఎదటివాళ్ళ ఆకర్షణకి లొంగి పోకూడదు. తను అంతే...తన స్త్రీ కూడా అలాటిదే అయి ఉండాలి.

క్లబ్బులో చాకిలెటీ అయితే క్లబ్బు వెలుపల గిరినందిని గానే ఉండాలి. లీల పిరికిది; ఎదటివాళ్ళ ఆకర్షణకి లొంగి పోతుంది. లలిత స్వార్థపరురాలు. ఎదటివాళ్ళ సుఖాన్ని గురించి ఆలోచించదు. అలాగే తనకి పరిచయం అయిన స్త్రీలల్లో ఒక్కతీ తనలాటిది కాదు.

చాకిలెటీకి తను ఆశించిన అన్ని గుణాలూ ఉన్నాయి. కాని ఎల్లవేళలా చాకిలెటీగానే ఉండిపోయి గిరినందిని కాదేమో అని భయంవేసింది. ఇప్పుడిహ ఆ భయంలేదు. ఆమె నిస్సంశయంగా గిరినందిని.

వరండాలో కూర్చుని కేవలం నిష్కామంగా పైపు పీలుస్తున్నాడు గిరినందిని తండ్రి హయగ్రీవరావు. ఆయనకి వెభయి వేళ్ళుంటాయి. హృదయంలోవున్న అనుభవాల సుడులూ, నుదుట ఉన్న వార్ధక్యపు ముడతలూ ఆయన దాచుకోవాలన్నా దాగటంలేదు.

"రావోయి, రా చాలా రోజులకి వచ్చావు!" అని అతి ఆప్యాయంగా ఆహ్వానించాడు ఆయన.

నవ్వుతూ వెళ్ళి పేముకూర్చిలో కూర్చున్నాడు సాంబ శివరావు. కొంచెం సేపట్లో గిరినందిని వచ్చింది. శుభ్రమైన

చీరా, రవికా-నుదుట తిలకం సలక్షణంగా చల్లగా కనిపించింది అతని కళ్ళకి.

హయగ్రీవరావుగారు ఆశ్చర్యపోయినారు. వెంటనే భయంకూడా వేసింది; తన కూతురుకి మతిగాని పోలేదు కదా అని.

"లక్ష్మిలా ఉన్నావు గిరినందినీ" అన్నాడు సాంబులు. ఇదివరకు అతను వీనస్‌తో పోలుస్తూ ఉండేవాడు. గిరినందిని మాట్లాడలేదు. తలఎత్తి తండ్రివంక చూసింది. ఆయన కళ్ళల్లో భయం తాలూకు నీడలు ప్రతిఫలించాయి.

"భయం లేదునాన్నా, ఏ క్షణానబడితే ఆ క్షణాన తిరిగి చాకిలెటీగా మారిపోగలను అవునా సాంబులూ!" అన్నది ఆమె.

"కాని నిన్నిక మారనివ్వ దల్చుకోలేదు గిరీ" అన్నాడు సాంబులు లైటర్‌తో సిగరెట్ వెలిగిస్తూ.

గిరినందిని తెల్లపోయింది. ఏం జరగబోతున్నదో పసిపట్టింది. నిజంగా తన మొహాన అంతమంచి గీత ఉందా! తన అదృష్టాన్ని తనే నమ్మలేకపోయింది ఆమె, ఈ తడవ అయినా తండ్రిని ఎదిరించాలి. తలఎత్తి చూసింది.

హయగ్రీవరావుగారి దృష్టిలో ఏ భావమూ కనిపించలేదు, శూన్యంతప్ప. జీవితంలో ఆడుతున్న జూదానికి ఇకనైనా స్వస్తి చెప్పాలి. అదే ఆయన మనసులో మెదులుతున్న ఊహ.

ఇన్నాళ్ళూ ఆయన నిర్లక్ష్యంగా బ్రతికేస్తున్నాడు. లోకంమీద తనకేమయినా కోపం ఉంటే అది కూతురి

ద్వారా తీర్చుకుంటూ కాలం గడుపుతున్నాను. ఆయన నియమాల్ని ఎప్పుడూ పాటించలేదు. డబ్బు ఉన్నవాళ్ళకి నియమాన్ని పాలించడం తేలిక. నియమాన్ని కాదనడంకూడా తేలికే వాళ్ళకి. తనలాటి ఆశోపహతులకి బ్రతుకులే పణంగా పెట్టి అనుక్షణం త్రోసిరాజని తట్టుకుంటూ ఆటకట్టవటంతప్ప గత్యంతరంమాత్రం ఏముంది !

తిరిగీ పైపులో పొగాకు నింపటం ఆరంభించాడాయన.

గిరినందిని సాంబులు వంకచూసింది. వ్యక్తిత్వం నిండిన మొహం - సూటిగా తళుక్కుమనేకళ్ళు - బలంగా స్వేచ్ఛగా ఎదిగిన శరీరం...అతనిలో చైతన్య స్రవంతి తొణికిసలాడుతూ ప్రవహిస్తున్నది.

'సాంబులూ, నా చెయ్యి విడిచిపెట్టకుసుమా' అందామనిపించింది గిరినందినికి. కాని స్త్రీత్వం అడ్డువచ్చింది. ఆ మాట సాంబులే అనాలి — సాంబులు అన్నాడుకూడా.

"ఇటు చూడండి, హయగ్రీవరావుగారూ! ఒక సంగతి మీకే చెప్పదల్చుకున్నా. అదేమిటంటే, నేను గిరినందినిని పెళ్ళిచేసుకుంటాను..."

తండ్రీ, కూతురు ఉలిక్కిపడ్డారు.

"మీరలా ఉలిక్కి పడవలసిన అవసరంలేదు. మీ గత చరిత్ర గురించిగాని, మీ కూతురు గత చరిత్ర గురించిగాని, నేనిప్పుడు ప్రశ్నించబోవటంలేదు. మీకుమల్లే నేనుకూడా జూదం ఆడాను...కనుక అదే మంచిదని వాదించను. బ్రతుకు అనేది ఒక వరం. ఒకప్పుడు అదే శాపంకూడా. అలయితే ఆ బ్రతుకుని పవిత్రంగా గడపటంలోనే సుఖమూ

శాంతీ ఉన్నాయి. ఈ పోటీలోకంలో అవి కుదరనప్పుడు జూదం ఆడక తప్పదు. అది తప్పని మళ్ళీ ఆ లోకమే వ్యాఖ్యానిస్తుంది. కనక హయగ్రీవరావుగారూ, మీ అమ్మాయిని నాకు ఇవ్వటానికి మీరు భయపడ నవసరంలేదు. కొందరు ప్రేమికులలాగా మేం విడిపోతామనే భయమూ లేదు. మా వివాహం ఒక స్వప్న లోకంలో జరగటంలేదు. వాస్తవిక ప్రపంచంలో చేతి ఆసరాకోసం జరుగుతున్నది. ఎదటివాళ్ళ చెయ్యివదిలిపెడితే వాళ్ళేకాదు; మనమూ మునిగి పోతాం-అనే భయం మా ఇద్దరికీ ఉండటంవలన నిజంగానే మాది ఆదర్శదాంపత్యం అవుతుంది. ఇక ఇంకోరి వ్యామోహంలోపడి విడిపోతామనే భయం అసలే లేదు. ఇద్దరమూ కూడా రకరకాల వ్యామోహాల్ని ఎరుగుదుం. ప్రేమా, వ్యామోహంఎంత సిల్లీ ప్రోబ్లెమ్సో మాకు ఇదివరకే తెలుసు. కనుక అనుమతినివ్వండి" అని సిగరెట్ వెలిగించాడు అతను.

గిరినందిని ఉన్నట్టుండి పకపకా నవ్వి "నువ్వు లీలని ప్రేమించా వనుకున్నానే!" అన్నది.

సాంబులు కూడా నవ్వాడు. కాని అతని అంతరాంతరాల్లో 'అవును గిరీ, ఆమెను ప్రేమించాను. అందుకనే ఆమె శ్రేయస్సు కోరుతున్నాను. నాతో ఆమె బ్రతకలేదు. ఆ సంగతి తెలిసే నిన్ను పెళ్ళిచేసుకుంటున్నాను. ఆమె సుఖం కోసమే' అంటామనిపించింది - కాని అనలేదు.

"వివాహానికి లోకం ఇస్తున్నంత గంభీరమైన అర్థం అందులో లేదు గిరీ! అలాగని దాన్ని తేలిక చేయుడమూ పొరపాటే. బ్రతుకులో పెళ్ళి అనేద ముఖ్యమైన పార్టు. సరే,

మరి నేను వెళ్ళిరానా? వివరాలు రేపు మాట్లాడుదాం. క్లబ్బుకు వస్తావా రేపు?" అని లేచి నిలబడ్డాడు సాంబులు.

"రాను" అన్నది గిరినందిని.

"ఆల్‌రైట్. అయితే నేనే ఇక్కడికి వస్తాను" అని కారెక్కాడు. అతను డ్రైవు చేస్తున్నా అతని మెదడులో రకరకాల ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయ్. వీటన్నిటినీ మించిన స్తబ్ధత ఆవరించింది.

కారు స్వామి ఇంటిముందు ఆగేవరకూ ఎలా డ్రైవు చేశాడో అతనికే తెలియదు. పూర్తిగా డ్రెస్ చేసుకొని బయలుదేరుతున్న స్వామి ఎదురొచ్చి విష్‌చేసి తాళాలు గలగల లాడించుకుంటూ కారు షెడ్ వేపు వెళ్ళాడు. ఈ మధ్య స్వామిని గురించి తను చాలా వార్తలు విన్నాడు. లీలా, స్వామి స్నేహంగా ఉంటున్నారన్నది అందులో ఒక వార్త.

"ఎందాకా?" అనుకోకుండా ప్రశ్నించాడు సాంబులు.

"లీలగారి ఇంటికి...లోపల లలిత ఉంది. విచారంలో ఉంది గనుక ఆమెను ఓదార్చి, చెప్పేవదంతా విని ఒక అర గంటలో లీలా వాళ్ళింటికి రా" సమాధానంకోసం కూడా ఎదురు చూడకుండా వెళ్ళిపోయినాడు స్వామి.

సాంబులు నిట్టూర్చి లోపలికి నడిచాడు. స్వామికీ సాంబులుకీ ఒక విచిత్రమైన ఆత్మీయత ఉన్నది. ఎవరేపని చేసినా అందులో పొరపాటు ఉందని రెండోవారు ఎప్పుడూ అనుకోరు. సావిట్లోనే ఎదురయింది లలిత. ఎందుకో చిరచిర లాడుతున్నది ఆమె.

"కూర్చో"

"కూర్చునే తీరిక లేదు...నీకో శుభవార్త చెప్పి పోదామని వచ్చాను. పెళ్ళిచేసుకోబోతున్నాను." అన్నాడు సాంబశివరావు కుర్చీ ముందుకి లాక్కుని కూర్చుంటూ.

"ఇంకా డైవోర్సు కాకుండానే!" అని వెటకారంగా అన్నది లలిత. సాంబులు కొంచెసేపు మాట్లాడలేదు— తరువాత.

"కాసేపు మనం మనుషుల మాదిరిగా మాట్లాడదాం. ఏమిటి, నువ్వంటున్నది? ఎవరి సంగతి?" అన్నాడు.

"ఎవరి సంగతి? లీలమ్మగారి లీలల సంగతి."

"పొరపాటు పడుతున్నావు లలితా! లీలకు డబ్బిచ్చి ఉండేమోగాని చాంచల్యం లేదు. ఇంతకీ ఏమిటి సంగతి?"

"ఏమీ లేదు. ఈ మధ్య స్వామి తరచు రాకపోకలు సాగిస్తున్నారు. అడిగితే నవ్వి ఊరుకోవడంతప్ప సమాధానం చెప్పరు."

ఈ తడవ నిజంగానే ఆశ్చర్యపడ్డాడు సాంబులు. స్వామి చపలచిత్తుడుకాడు. ఒక విధంగా ప్రాక్టికల్ మాన్. కేవలం లీలకోసం అతను తాపత్రయ పడుతున్నాడంటే నమ్మకం కలగటం లేదు. మరి లలితకూడా కాస్తకీ కూస్తకీ అనుమానించే మనిషి కాదు. మరి ఇదేమిటి!

సాంబులు సమాధానం చెప్పలేదు, మెదలకుండా వెనక్కి తిరిగి కారెక్కాడు. లీల ఇంటివేపు సాగిపోయింది కారు.

# 17

"సమాజం దేనిని చెడు అంటుందో, అది సమాజ పరిస్థితుల వల్లనే జరిగిందనే సంగతి సామాన్యంగా గుర్తు ఉండదు. క్షుధాపీడితుడైన వ్యక్తి నూనె మిఠాయి సరుకైనా సరే తినేస్తాడు. అలాగే సమాజంలోని వ్యక్తి, సమాజపు కట్టుబాట్లవల్లనే బందీఅయి మరో ఉపాయంతోచక శారీరకమైన తప్పుల్ని చేయటం జరుగుతున్నది. నిజం ఆలోచిస్తే అతను క్షమార్హుడు; దయనీయుడు కూడా.

అంతేకాదు సృష్టికి తోడ్పడుతున్న స్త్రీయే వ్యామోహానికికూడా తోడ్పడు తున్నది. వివాహ సంస్థను సృష్టించిన మానవుడే వేశ్యలనుకూడా సృష్టించుకున్నాడు. అథవా ఎవరైనా ధైర్యంచేసి ఈ కట్టుబాట్లను కాదంటే వాళ్ళు పతితులని పిలవబడుతున్నారు. వాళ్ళు పతితులు కారు—నీతికి బలిఅయిన పవిత్రులు. అసలు పాశవికమైన అహంకారంతో మన ఆలోచనాశక్తిని పోగొట్టుకున్నాం బావగారూ!" అన్నది అన్నపూర్ణ.

గోపాలరావుగారూ, స్వామి, లీల అన్నపూర్ణావంక చూస్తుని ఉన్నారు; చర్చ తీవ్రంగా సాగిపోతున్నది. అన్నపూర్ణ ఒక సిద్ధాంతం అన్నది అంటే; దానివెనకాల చాలా కథఉంటుంది. ఆమె మాటలకి ఎవరూ సమాధానం చెప్పలేదు.

"ప్రాతివ్రత్యం సమాజ ఆచారం కానూ కాదు, నియమం స్త్రీ ధర్మం కాకనూ పోలేదు. ఆ నియమం ఉంటే పెళ్ళి అనేది ఎత్తివేసినా సమాజభద్రతకు ఏ విధమైన

ప్రమాదమూ ఉండదు. అర్థరహితమైన విధి నిషేధాలతో తనని తనే బంధించుకుని బాధపడుతున్నాడు మనిషి" అన్నది తిరిగి.

ఆమె మాటలు ఒక స్త్రీ మాట్లాడాల్సినవి కావు. అందులో అన్నపూర్ణలాటి స్త్రీ నోటివెంట అలాటి మాటలు వస్తాయని ఎవరూ ఊహించనుకూడా ఊహించలేరు. కాక పోతే అక్కడఉన్న ముగ్గురిలో అన్నపూర్ణని అర్థం చేసు కోనిది లీల ఒక్కతే.

చర్చ మంచి రసకందాయంలో ఉండగా సాంబశివ రావు వచ్చి మరో ఫేముకుర్చీలో విరాజమానుడైనాడు. ఒక సారి అతనికి నమస్కరించి తిరిగి మాట్లాడటం ప్రారంభించింది ఆమె. "ప్రేమ అనేది త్యాగంమీద ఆధారపడి ఉంటుంది గాని స్వార్థంమీద ఆధారపడి ఉండదు. కాని నేటి స్త్రీ పురుషులు 'ఏమి ఇవ్వగలం'- అని ఆలోచించటం మానివేసి 'ఏం తీసుకోగలం' అని ఆలోచిస్తున్నారు."

ఈ అపరిచిత యువతి వాగ్ధోరణికి ముగ్ధుడైపోయినాడు సాంబులు. 'ఈ అద్భుతనారి ఎవరు?' ప్రశ్నార్థకంగా చూశాడు అతను.

"అన్నపూర్ణా! ఇతను సాంబశివరావు. స్వార్థపరుడైన విప్లవవాది" అని అన్నపూర్ణకి పరిచయం చేశాడు స్వామి. ఆ పేరు వినగానే ఇబ్బందిగా కదిలారు గోపాలరావుగారు. సాంబులు వచ్చిన దగ్గరనుంచీ లీల ఎటో చూస్తున్నది. ఒక విధంగా అతను ఆమెని ఆకర్షించాడనే చెప్పాలి.

"వారు ఎవరో చెప్పనే లేదు!" అన్నాడు సాంబులు నవ్వుతూను.

"చెప్పారేమోనని భయపడుతున్నాను. చెప్పకపోతే ఫరవాలేదు" అన్నది అన్నపూర్ణ స్వామివంక అదోమాదిరిగా చూస్తూ.

"మీరేదో చెబుతున్నారు - కానివ్వండి" అన్నాడు సాంబులు సిగరెట్ ముట్టిస్తూ.

"ఏమీ లేదు. ఏదో కాలక్షేపానికి..." అన్నది అన్నపూర్ణ.

"కాని బ్రహ్మాండమైన నిజాలు చెబుతున్నారు" సాంబులు అన్నమాటకి స్వామి నవ్వి-

"అదికాదు సాంబులూ, ప్రేమని గురించి అన్నపూర్ణ సిద్ధాంతాల్ని అపార్థం చేసుకొని ఆమెని గురించి గిరినందినిని భావించినట్లు భావిస్తే ప్రమాదంలో పడతావు. మాటల్లో ఎంత తెగింపో చేతల్లో అంత నిగ్రహం ఆమెకి" అన్నాడు.

"సరేలే... అదికాదు క్షమిస్తే ఒకటడుగుతానమ్మా, ఏమీ అనుకోరు గదూ ?" అని భయం భయంగా ప్రశ్నించాడు సాంబులు.

"ఏమిటి ?"

"ప్రేమించి పెళ్ళి చేసుకోవడం గురించి... మీ అభిప్రాయం ఏమిటి ?"

"చాలా చెప్పాలే, మీకు విసుగు పుడుతుందేమో !"

"లేదు... లేదు... ఇప్పుడు పనికూడా ఏమీలేదు.

మీరు వివరంగా చెప్పవచ్చును" అని సిగరెట్ కొడిని యాష్ ట్రేలో దులిపాడు సాంబులు.

గోపాలరావుగారు పైపులో పొగాకు దట్టించి "ఇక చెప్పు ఇప్పుడిక ఎంత విసుగునయినా భరించగలను."అన్నారు.

"బాగుంది బావగారూ, మీరు కూడా అద్భుతంగా మాట్లాడుతారు" అని బుంగమూతిపెట్టి అన్నది ఆమె. అందరూ పకపక నవ్వారు.

లీలకి ఇదేమీ నచ్చటం లేదు. తన పినతల్లి చుట్టూ హేమాహేమీలయిన ఈ మగవాళ్ళు తిరగటం ఆమెకి అవమానంగా ఉంది. తన నెవరూ గుర్తుపట్టకపోతే అసూయ పడతారు కొందరు. లీల అలాటిది. అందులో సాంబులు కూడా తనని నిర్లక్ష్యం చెయ్యటం ఆమెకు మరీ బాధగా ఉంది.

"ఇక చెప్పండి."

"నా ఊహలు మీకు నచ్చవేమో!"

"అంతలోనే వచ్చే ప్రమాదం ఏముంది చెప్పండి!"

"ఈ లోకంలో సుఖం కావాలంటే ప్రేమద్వారానే దాన్ని సాధించాలని ప్రతివాడూ చూస్తాడు. ప్రేమ మనిషిని త్యాగినీ చేస్తుంది; తిరుగుబాటు దారుడినీ చేస్తుంది. ఏం చేసినా ఆశించిన సుఖాన్ని తనద్వారా పొందటమే దాని ముఖ్య గుణం. చిత్రం ఏమిటంటే మధ్యతరగతి జనుల వివాహ జీవితంలో ప్రేమ అనేది స్వప్నం కాదు, గణితం. ఆ సంగతి బయటపడేసరికి మనిషి చాలా నిరాశ పొందుతాడు. అత

ప్రేమదాహం మరింత ఎక్కువవుతుంది. నిజం చెప్పాలంటే కిందటి శతాబ్దంనుంచి గడిచిన దశాబ్దం వరకూ కూడా సాంఘిక వ్యవస్థలో ఇంకా రకరకాలైన అనుబంధాలుంటూ ఉండేవి. ఇప్పుడు వాటన్నిటి స్థలం ఒక్క స్త్రీ పురుష ప్రేమ ఆక్రమించుకుంది. ఈ నాగరిక సమాజంలో ముఖ్యంగా తెలుగు దేశంలో వ్యక్తివాదం ప్రధానంగా అయి రొమాంటిక్ ప్రేమకు ప్రాధాన్యం బలిసింది. మధ్యతరగతి జీవన వ్యవస్థలో పరంపరాగత ఆచారాలమీద తిరుగుబాటుకు ఈ ప్రేమదాహమే పెద్ద కారణం. న్యాయంగా ప్రేమతాలూకు పరిణతి వివాహంలోనే ఉండాలి. కాని ఉండటం లేదు. దానికి కారణం స్త్రీ. ఆమె జీవితం ప్రేమమీదనే నిర్మితమైంది. కాని దానికి పునాదులు లేవు."

"చూడు పిల్లా! నువ్వుచెప్పింది నాకేం అర్థంకాలేదు. కాని నాది ఒక సందేహం. మనిషి అనేవాడు జన్మంటూ ఎత్తాక తన ఇచ్ఛకి వ్యతిరేకంగా అనేకసార్లు నడవాల్సి ఉంటుంది. పాపం పుణ్యం-నీతి అవినీతి - న్యాయం అన్యాయం ఇలా అనేక సంగతులు అతనికి అడ్డు వస్తూ ఉంటాయి. ఈ మానసిక సంఘర్షణలోపడి అతను పిండి పిండి అవకుండా తప్పించుకోటం ఎలా?" అన్నాడు గోపాలరావుగారు తన స్థూలకాయాన్ని కుర్చీలోంచి లేవతియ్యాలని ప్రయత్నిస్తూ.

"లేవకండి బావగారూ, నేను పడక కుర్చీ తీసుకొస్తాను" అని లోపలికి వెళ్ళి పడకకుర్చీ వేసి ఆయనని అందులో కూర్చోబెట్టి ఔన్సు గ్లాసులో మందుపోసి ఇచ్చింది ఆమె.

"ఆ మానసిక సంఘర్షణవలనే మానవజాతి ఇంత దూరం ప్రయాణంచేస్తూ వస్తున్నది బావగారూ! అలా కొంతమంది నలిగిపోయిన తరువాతగాని కొంత అభ్యుదయం రాదు" అన్నది అన్నపూర్ణ గోపాలరావుగారి చేతిలోంచి గ్లాసు అందుకుంటూ.

"అది సరే అన్నపూర్ణా! స్త్రీ ప్రేమిస్తుంది. సరిగ్గా అదే సమయంలో ద్వేషిస్తుంది· దీనికి గత్యంతరం ఏమిటి?" అన్నాడు స్వామి.

"చిలిపి పిల్లాడిలా ఏమిటా ప్రశ్న?" అంది అన్నపూర్ణ నవ్వుతూను. స్వామిమీద అన్నపూర్ణకి ఉన్న చనువుని చూసి ఆశ్చర్యపోయినాడు సాంబులు. అతని కళ్ళముందు ఒక్కసారిగా తెర తొలిగింది. స్వామి ఈ ఇంటికి వస్తున్నది లీలకోసం కానేకాదు. లలిత పొరపాటు పడ్డది.

"శరీరంకంటె మనసూ – సంఘంకంటె వ్యక్తి అధికం అబ్బాయ్. శారీరక పవిత్రతకంటె మానసికమైన పవిత్రతకి ప్రాధాన్యం ఇచ్చినంతకాలమూ స్త్రీలో అసూయ లేదు. శారీరకంగా ఎండి మానసిక వ్యభిచారం చేస్తున్నప్పుడే ఈ అవస్త. అదీగాక పతివ్రత అనిపించుకోడంలోనే స్త్రీ గొప్పతనం ఉన్నదని భ్రమ తొలిగిపోవాలి" అన్నది అన్నపూర్ణ.

ఈ సారి నిజంగానే సాంబులుకి మతిపోయింది. ఈ విప్లవకారిణి ఒక్కపెట్టున సంఘాన్ని తలకిందులుచేసి చేతులు దులుపుకోదుగద! అనిపించింది అతనికి. చైతన్యమూర్తి అయిన ఈ స్త్రీ తన చుట్టుపక్కలకూడా చైతన్యం నింపుతూ

నిద్ర మత్తులోపడి కొట్టుకొంటున్న లోకాన్ని ఉత్తిష్ఠం చేస్తున్నది. మరి తను...తన సంగతి ఏమిటి?

"ఇంతకూ నువ్వు భోజనం చేశావా?" అన్నారు గోపాలరావుగారు. అన్నపూర్ణ మాట్లాడలేదు. స్వామి గాబరాపడి "అదేమిటి? పొద్దుటనించి భోజనం లేకుండా ఎలా ఉన్నావు?" అన్నాడు.

"ప్రపంచం అంతా మునిగిపోయినట్లు ఏమిటా హడావిడి?" అంటూ నవ్వింది ఆమె.

సుఖ భోగాలకు వంచిత అయిన ఆ స్త్రీ మూర్తి ఆంతర్యం సర్వసంయమాలకూ ప్రతినిధి. గోపాలరావుగారు ఒక నిట్టూర్పు విడిచి ఊరుకున్నారు. అట్టే అందగత్తె కాని తనపినతల్లిలోని ప్రత్యేకత ఏమిటో లీలకి అర్థం కావడం లేదు. పైగా చిరాగ్గా కూడా ఉన్నది. ఎందుకో తెలియదు. ఈమధ్య లలితకూడా ముభావంగానే ఉంటున్నది తనతో. లీల విసుగుతో అక్కడినుంచి లేచిపోయింది.

అది చూసిన అన్నపూర్ణ తనలోతనే నవ్వుకుంది. ఒక అరగంట ఎవరి ఆలోచనలలో వారు ఉండిపోయారు. సాంబులు వెళ్ళటానికి లేచి నిలబడ్డాడు. స్వామి అతని చెయ్యి పట్టుకుని—

"ఉండు, ఈపూట అన్నపూర్ణచేతి అన్నంతిని పోదాం"అని ఆమెనంక తిరిగి "ఆకలేస్తున్నది అన్నపూర్ణా!" అన్నాడు. ఆమె నవ్వుకుంటూ లేచి పోబోయింది—స్వామి గభాలున ఆమె చెయ్యిపట్టుకుని "ఇదిగో అమ్మాయ్!

చారూ అన్నం చాలదు. కాస్తబరువుగానే పడాలి. పద నేనూ వస్తాను వంటింట్లోకి" అన్నాడు.

ఆమె మెల్లిగా చెయ్యి వదిలించుకుని అవతలకు వెళ్ళింది. ఇది చూసిన సాంబులుకి నోటివెంట మాట రాలేదు. కళ్ళు చీకట్లు కమ్మినయ్. స్వామి అతని భుజం మీద తట్టి మెల్లిగా గోపాలరావుగారికి వినపడకుండా "లలిత ఏమంది?" అన్నాడు.

"నువ్వు లీల ఆకర్షణలో పడ్డావని ఆమె భ్రమిస్తున్నది" అని నవ్వుతూ అన్నాడు సాంబులు.

"ఇంకా తళుకు బెళుకుల ఆడవాళ్ళ ఆకర్షణలో పడే స్థితిలోనే ఉన్నాననుకుంటున్నది ఆమె"

"కాని నువ్వు ఎవరి ఆకర్షణలోపడి ఇక్కడకు వస్తున్నావో, వాళ్ళ ఆకర్షణలోంచి బ్రహ్మదేవుడుకూడా తప్పించుకోలేడు" అన్నాడు సాంబులు. స్వామి కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత—

"స్త్రీ పురుషుల మధ్య ఆకర్షణ సహజం. ఆకర్షణ జ్వలిస్తున్నదీపకళికలాటిది. దాన్నిఆర్పివేస్తే ప్రపంచగమనమే ఆగిపోతుంది. విశృంఖలంగా పెంపొందించుకుంటే అందులో పడి మనమే కూలిపోతాం. ఇప్పుడు మనం అనుసరిస్తున్నది రెండవమార్గం. అలాకాక ఆ ఆకర్షణకి పవిత్రత కలిగించి ఉదాత్త స్వరూపం ఇవ్వగలిగినప్పుడు తద్వారా మానవుడు ఉన్నతుడవుతాడు." అన్నాడు స్వామి.

గోపాలరావుగారు చాలా తన్మయావస్థలో – వీరి మాటలు వినటం మానివేశారు.

"గిరినందినిని పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను" అన్నాడు సాంబులు మెల్లిగా.

"ప్రేమించి కాదుగద?"

"కాదు"

"అయితే చేసుకో. వివాహం లెక్కలుకట్టి చేసుకున్నప్పుడు పునాది గట్టిఉంటుంది. ఊహల్లోనూ, మోహంలోనూ పడి చేసుకుంటే తుక్కుదూగ ఎగిరి చక్కా పోతుంది." అన్నాడు స్వామి.

"ఏమీ అనుకోకుండా ఉంటే ఒక సంగతి" సిగరెట్ అంటిస్తూ సాంబులు అన్నాడు.

"ఏమిటది?"

"ఆమె ఎవరు?" ఆ ప్రశ్నకి స్వామి కొన్ని క్షణాలు మాట్లాడలేదు. తరువాత "నా భార్య" అన్నాడు.

"అదేమిటి?"

"అది అంతే. తరువాత చెబుతాను."

"మరి లలిత!"

"భార్య కాకుండా భార్య అనిపించుకుంటున్న మరో స్త్రీ."

"అన్నపూర్ణమ్మగారికీ నీకూ పెళ్ళి అయిందా? "

"ఆహా! యథా విధిగా-గుళ్లో భగవంతుని సాక్షిగా"

"మరి వీళ్లు బ్రాహ్మణులుగా !"

"కథ వింటే అర్థం అవుతుంది- తరువాత చెబుతాను"

"లీలకి ఈమె ఏమవుతుంది?"

"వరుసకు పినతల్లి."

"మీ ఇద్దరూ భార్యాభర్తలని ఆమెకు తెలియదా?"

"తెలియదు. ఒక్క గోపాలరావుగారికి తెలుసు; ఇప్పుడు నీకు తెలుసు. లీల అడిగితే నా బాల్య ప్రేమికుడని చెప్పింది అన్నపూర్ణ."

"ఎందుకని?"

"మరో స్త్రీ కాపురానికి తను అడ్డు రాదట. సాంబులూ! నా బ్రతుకు అంతా ఇలాగే ఉంది. ఈమె కోసం నా ఆంతర్యం అలమటించని క్షణం లేదు. కాని ఏమీ పొందలేక పోయినాను." నిట్టూర్చాడు స్వామి.

"వంటయింది- ఇక రావచ్చును" కొంగుతో మొగం తుడుచుకుంటూ వచ్చింది అన్నపూర్ణ. సాంబులు మొగం చూడగానే గ్రహించేసింది, స్వామి ఇతనికి అంతా చెప్పేశాడని. స్వామివంక తిరిగి మండిపడుతూ-

"నేను నా ధర్మాన్ని నిలుపుకోవాలని ప్రయత్నిస్తున్నానుగాని నా ధర్మపత్నీత్వపు హక్కుని నిలుపుకోవాలని వడవటంలేదు. ధర్మపాలన వలన కలిగే తృప్తి అయినా నాకు మిగులుతుంది - ఆమెకి ఏం మిగులుతుంది? అధర్మం చేసికూడా సుఖం పొందలేక పోవటం. ఎందుకామెని కష్టపెట్టాలి? నన్నిలా బ్రతకనివ్వండి, అంతే చాలు" అన్నది.

"నేనేం చెప్పలేదు. కోప్పడకు" తడబడుతూ స్వామి సంజాయిషీ ఇచ్చాడు.

అపరిమితమైన పూజ్యభావంతో తనవంక చూస్తున్న సాంబులు వంకతిరిగి-

"మనిషి మనిషికి చేస్తున్న అపచారం ఇలా సాగుతూన్నంతవరకూ మనకెవరికీ ముక్తిలేదు" అంది అన్నపూర్ణ.

సాంబులు సమాధానం ఇవ్వలేదు.

అతృప్తవాంఛలే ఉత్కృష్టమైన ఆరాధన అనుకొనే ఆదర్శజీవులు కొందరూ, దేహలాలసలే ప్రేమకి పరమావధి అనుకునే కార్యవాదులు కొందరూ తయారయినారు. ఇప్పుడు ఈ రెండూ కాకుండా మధ్యమార్గం ఒకటుందని ఎవరూ అనుకోవటంలేదు. సరే, భోజనానికి లేవండి" అని వంటింట్లోకి దారితీసింది ఆమె, ఇద్దరూ ఆమెని అనుసరించారు.

లీలవచ్చి తండ్రికి దగ్గరగా కుర్చీలాక్కుని కూర్చుంది. గోపాలరావుగారు ఒక కన్ను సగం తెరిచి ఆమె వంకచూసి మళ్ళీ టపీలుమని మూసుకున్నారు.

"ఏమిటి నాన్నా, ఈ గొడవ?" అని కుదుపుతూ అడిగింది ఆమె.

"ఏ గొడవ?"

"వీళ్ళందరూ వారి సొంత ఇంట్లోకి వచ్చినట్లుగా ఉందిగాని..."

"అమ్మాయ్!"

"ఏమిటి?"

ఇదే ఇంట్లోకి పరాయివాడైన ఆ సాంబుల్నే పిలిచి నీభర్త గౌరవాన్ని విక్రయించి అయిదువేలు తీసుకున్నావు నువ్వు. అన్నపూర్ణ ఏం చేస్తున్నదో తెలుసా? ఎన్నో వళ్ళ

కిందట అర్థరహితంగా అయిన వివాహానికి కట్టుబడి ఉండి తన ప్రాణపతికి తనచేతులతో ఇన్నాళ్ళకి అన్నం పెడుతున్నది. ఇందులో ఎవరితప్పు అధికమో నువ్వు ఆలోచించటం మంచిది"

తండ్రి అన్నమాటలకి మతిపోయింది లీలకి. తన పిన తల్లి బాల్యప్రేమికుడని చెప్పినవ్యక్తి ఆమె భర్త! తల గిర గిరా తిరిగి పోతున్నది.

"అంతేకాదు. నీ స్నేహితురాలైన లలిత అతనికి ధర్మ సమ్మతమైన భార్యకాదు"

తలమీద ఎవరో బాదినట్లయింది ఆమెకి.

"ఇంకా చెప్పనా, విను! ఆమెకోసమే అన్నపూర్ణ త్యాగం చేస్తున్నది. ఆమె సుఖాన్ని తను లాక్కోవాలనుకోటం లేదు. అందుకు అపనిందలు భరిస్తున్నది. భర్తతో భార్యకి ఉన్న అనుబంధం అవినీతి అంటున్న లోకాన్ని చూసి ఒక్క చిరునవ్వు నవ్వి ఊరుకుంటున్నది"

లీలకి ముచ్చెమటలు పోసినయ్.

"మీరంతా ఏం చేస్తున్నారు? ఒక్కసారి ఆలోచించుకుంటే మీకూ ఆమెకూ ఉన్న అంతస్థు ఏమిటో అర్థం అవుతుంది. వానిటీకీ ధనానికీ లోబడి వివాహ బంధాలు ఛేదించుకుంటూ కన్నపిల్లల్ని అనాధ శరణాలయాల్లో చేర్చి, అక్రమప్రణయ సంబంధాలలో అసూయలో పడుతూ బ్రతుకుతున్నారు." గోపాలరావుగారు ఆయాసం వలన ఇక మాట్లాడలేక పోయినారు.

"బావగారూ, ఏమిటిది!"

స్పృహ తప్పిపోతున్న లీలని కుర్చీలోంచి పడకుండా పట్టుకుంటూ అడిగింది, అన్నపూర్ణ.

అప్పటికి అర్థం అయింది, ఆయనకి తను అన్నపూర్ణకి ఇష్టంలేని పనిచేశానని. భయంతో నోటివెంటమాట రాలేదు.

"చెప్పేశారా, బావగారూ!"

గోపాలరావుగారు తలవంచుకున్నారు. అన్నపూర్ణ లీలని సేదతీర్చటంలో నిమగ్నమయింది.

# 18

"ఏమమ్మా, ఎలా ఉంది?" తన నుదుట ఎవరిదో చల్లని హస్త స్పర్శ. తలఎత్తి చూసింది సుమతి. కుర్చీలో మేరీమాత విగ్రహంలాగా అన్నపూర్ణ. ఆమెను గుర్తుపట్టటానికి కొంచెంసేపు పట్టింది సుమతికి. ఆ తరువాత భయం వేసింది. ఈమె లీలపినతల్లి! లీలతరఫున తనతో పోట్లాడటానికి రాలేదుకద!

ఆనాడు లీలా, స్వామి వచ్చివెళ్ళినదగ్గరనుంచీ సుమతి లేవటంలేదు. ఇన్నాళ్ళూ చేసిన వెట్టిచాకిరీ ఆహారలోపం ఇప్పుడు ఈమనోవ్యాధి సందర్భంలో విజృంభించి తమ ప్రభావాన్ని చూపెడుతున్నాయి. త్యాగరాజులుకూడా ఈ బెంగలో వృద్ధుడయి పోయినాడు. ఈ రోజు కూరల మార్కెట్‌లో పనిచూసుకుని వస్తుంటే అన్నపూర్ణ మార్కెట్టుకి

వస్తూ ఎదురయి పలకరించింది. ఆ పలకరింపులోని ఆప్యాయతకి కరిగిపోయి తనబాధలన్నీ చెప్పేసుకున్నాడు అతను. తత్ఫలితంగా సుమతిని చూడటానికి వచ్చింది అన్నపూర్ణ. తననిచూసి సుమతి భయపడుతున్నదని గ్రహించింది ఆమె. 'సుమతి అనుచితమైనది ఏమీ చేయలేదుగద? ఎందుకు భయపడుతున్నది?' అనుకుంది అన్నపూర్ణ.

"ఏమండీ, రోగం ఇంత ముదిరేదాకా ఎలా ఊరుకున్నారు!" అని అక్కడే నిలబడి దిగాలుగా చూస్తున్న త్యాగరాజుని ప్రశ్నించింది ఆమె.

"మందు పారబోసి ఏడుస్తూ పడుకుంటే ఎవరికైనా ముదురుతుంది రోగం" అని విసుగ్గా సమాధానం చెప్పాడు అతను. అది విని సుమతి ఏడవటం మొదలుపెట్టింది. ఆ ఏడుపులో ఉన్న వేదన ఎలాటిదో మీమాంసచేసి చెప్పగల వ్యక్తి ఎదురుగుండానే ఉన్నది.

మీరు ఆఫీసుకు వెళ్ళండి త్యాగరాజులుగారూ, సాయంత్రందాకా నేను ఈమె దగ్గరఉంటానులెండి" అన్నది అన్నపూర్ణ. త్యాగరాజులు నిట్టూర్చి మెల్లిగా గదిబయటకి వెళ్ళిపోయినాడు. సుమతిచెయ్యి తన చేతిలోకి తీసుకొని ఆప్యాయంగా నొక్కుతూ "ఇక చెప్పు చెల్లీ! ఎందుకు ఏడుస్తున్నావు!" అని సముదాయించింది అన్నపూర్ణ.

సుమతి ఏడుపు ఆపుకుని "నేను తప్పు చేస్తున్నాను కదూ!" అన్నది పెగుల్చుకుని.

'అవును తప్పే' అని హెచ్చరించలేక పోయింది అన్నపూర్ణ. ఒకప్రాణి సంకట పరిస్థితులలో ఇరుక్కొని అలమటిస్తు

న్నప్పుడు - మన సంస్కారానికి సంబంధించిన నమ్మకాలకూ అతని అనుభవాలకూ చుక్కెదురవుతుంది. అప్పుడు తీర్పు ఇవ్వటంకన్న తెలివితక్కువలేదు. అందుకే మాట్లాడలేదు ఆమె.

"భార్య కావటానికీ తల్లి కావటానికీ నేను ఎందుకు పెట్టి పుట్టలేదు? సంఘ న్యాయం నా అంతర్యానికి వేస్తున్న సంకెళ్ళ మధ్య ఇరుక్కుపోయి నిరానంద జీవితం ఎందుకు గడపాలి? అందుకోసమేనా దేముడు ఆడవాళ్ళని సృష్టించింది? చెప్పు అన్నపూర్ణా ఇంతేనా మనగతి"? అని ఉద్రేకంగా ప్రశ్నించి ఆయాసపడ సాగింది సుమతి.

"నీ ప్రశ్నలకు జవాబు తరువాత చెబుతాను సుమతీ! ఈ క్లిష్ట సమస్యలకు సమాధానాలు వినేస్థితిలో లేవు నువ్వు"

"కాదు వినగలను. ఇప్పుడు వినలేకపోతే ఇక ఎప్పటికీ వినలేక పోవచ్చును. వీటికి సమాధానాలు వస్తే సుఖంగా ప్రాణాలు వదులుతాను" అన్నది సుమతి.

"దుఃఖాన్ని అనుభవించటం నీకు అలవాటే సుమతీ! మరి ఎందుకిప్పుడు భరించలేక పోతున్నావో నాకు అర్థం కావటంలేదు"

ఓపికలేదు. అలసిపోయాను. అందుకే దుఃఖము అనుభవించటంలో ఆనందం ఉన్నదనే భ్రమ ఒదిలిపోయి బ్రతుకంటే విసుగుపుడుతున్నది. ఇన్నాళ్ళు అనుభవించటంవలన ఏం పొందగలిగాను? కనీసం లోకంచేత గుర్తింపబడనన్నా గుర్తింపబడలేదు" అని విసుక్కుంది సుమతి.

"త్యాగం అనేది లోకంచేత గుర్తింపబడాలని ఆశిస్తూ చేస్తే ఆ త్యాగంలో విలువ తగ్గిపోతుంది సుమతీ" అన్నది అన్నపూర్ణ.

"యమయాతన అనుభవిస్తున్నాను నేను. అందుకే అస్తమానం ఏడవాలనిపిస్తున్నది. మానవజాతి అంటే ఇంత ప్రగాఢమైన ద్వేషం నాలోనుంచి పోగొట్టుకోవాలి. లేకపోతే నాకు ముక్తిలేదు-విశ్రాంతి అంతకన్నా లేదు."

"సుమతీ, ఒక కథ చెపుతా వింటావా?" అన్నది అన్నపూర్ణ. స్వచ్ఛకౌముదీ సదృశమైన ఆమె ఫాలతలం యుగయుగాల నారీచరిత్రలో ఉన్న పవిత్రతకి మరోసారి ఎత్తిన కర్పూరపు నీరాజనంలా ఉన్నది. సుమతి ముగ్ధురాలై వింటున్నది.

"అ[illegible]ప్పుడో కొన్నిసంవత్సరాల క్రితం ఒకపిల్లని ఒక కులం[illegible]స [illegible]బ్బాయికి యిచ్చి పెళ్ళి చేశారు. ఆ పిల్ల ఒక గంటసేపు అతన్ని చీకట్లో చూసింది. అయితేనేం అతను ఆమె భర్త. తరువాత బంధువర్గం పొరపాటు తెలుసుకుని ఆ పెళ్ళి పెళ్ళే కాదు- పొమ్మన్నారు. పొరపాటున జరిగిన దానికిప్రాధాన్యం ఏమిటి, ఇంకో పెళ్ళిచేద్దామని సంకల్పించుకొన్నారు. కాని ఆ పెళ్ళి పెళ్ళేననీ, ఆ పెళ్ళిని తను అంగీకరిస్తాననీ ఆ పిల్ల పెద్దల్ని ఎదిరించింది. తరువాత ఆ పిల్ల తల్లి తండ్రులు పోయినారు. వృద్ధుడైన ఒకదూరపు బంధువు పంచన ఉన్నది. ఆ వృద్ధుడు ఆమెకు వరుసకు బావగారవుతాడు. లోకం ఆ వృద్ధుడికీ ఈ అమ్మాయికీ అక్రమ సంబంధం అంటకట్టింది. ఈ పిల్ల అదీ ఆనందంతోనే స్వీకరిం

చింది. ఈ విధంగా రోజులు గడిచినయ్. ఎవరో తెలియని తన భర్త కనిపించలేదు. అందుకని వైవాహికానందం రుచి చూడకుండానే వైధవ్యభారం వహించాల్సి వచ్చింది. ఆపిల్ల బాధపడటానికి అప్పుడు తీరిక లేకపోయింది ఆమెకు. ఇలా ఉండగా ఒకనాడు అనుకోకుండానే అతను కనిపించాడు; గుర్తించాడు. గాఢంగా ప్రేమిస్తున్నాడు. అయితేనేం అతను మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. ఈమె కోరితే తన ధర్మపత్నీత్వపు హక్కును చిటికలో తిరిగి పొందగలుగుతుంది. కాని అలా చేయాలనిపించటంలేదు. ఇదీ సంగతి. ఇప్పుడు చెప్పు సుమతీ, ఈ బాలనాగమ్మ కథలో ఆ పిల్ల కర్తవ్యం ఏమిటి! అర చేతిలో సుఖం ఉంది. అది పుచ్చుకోవటానికి ధర్మసహాయం ఉన్నది. కాని అంతర్యమే అడ్డువస్తున్నది. ఎందుకనం టావు సుమతీ!" అన్నది అన్నపూర్ణ.

సుమతి తెల్లబోయి చూడసాగింది.

"నేను చెప్పినకథ నీబాధకు పతికృతి అని నేను అను కోవటంలేదు. కాని సుమతీ, ఈకథలో ఏసూాలో స్త్రీధర్మం తాలూకు తీక్షణమైన సత్యం దాగి ఉన్నదని మాత్రం ఒప్పు కోక తప్పదు. వ్యక్తిగతమైన ఈ విభిన్న జీవన విధానాలలో విశ్వవ్యాప్తమైన అఖండ సత్యాన్ని అప్పుడప్పుడూ దర్శిస్తూ ఉంటాం. అదేమిటో తెలుసా! సాక్షాత్తూ ఆ భగవంతుడి కూడా అర్థంకాని మహామానవత్వం. అదొక్కటే సత్యం సుమతీ! మిగతావన్నీ ఉత్త నేతిబీరకాయలు. ఈవిషయం లోకానికి విచిత్రంగా ఉన్నాగాని నాకు విచిత్రంగాలేదు. నాబ్రతుకులో సరిగ్గా దీనికి దొరికిన ప్రతిఫలాన్ని త్యాగం

అనే పెద్దపేరుపెట్టి పిలవాలనీ అనుకోటంలేదు నేను" అని నిట్టూర్చింది అన్నపూర్ణ.

సుమతి ఉలిక్కిపడి "అయితే అక్కా, ఈ కథ నీదేనా!" అన్నది.

అనుకోకుండా అక్కా అని పిలిచిన సుమతిని గుండెలకి అదుముకుని–

"అవును చెల్లీ! ఈకథనాదే. ఇప్పుడునాకర్తవ్యంఏమిటి! అదే తెలుసుకోవాలనుకుంటున్నాను" అన్నది అన్నపూర్ణ.

సుమతి కళ్ళుమూసుకుంది. మూసుకున్న ఆ కన్నుల నించి వెచ్చని కన్నీరుజారి తలగడా తడిపివేస్తున్నది. మూసుకున్న ఆమె కన్నుల కెదురుగా అన్నపూర్ణ నవ్వుమొగం కని పిస్తూనే ఉ[illegible] ఆమె కథని తల్చుకుని ఆమెకు హృదయ పూర్వ[illegible]స్కరిస్తూ–

'వెంకటేశ్వరస్వామీ! ప్రభూ! ఇదెలాటి న్యాయం? ఇలాటి మహా[illegible]ల్లాలి నుదుట ఇంతటి అపకీర్తి, ఇలాటి త్యాగ మూర్తి [illegible] ఇంతటి అసౌఖ్యం, స్త్రీజాతినంతటినీ కర్తవ్యపథం[illegible] చేర్చగలిగిన ఈ ఆదర్శమూర్తికి అప నిందలు, ఎందుకని వ్రాశావు?' అనుకున్నది ఆమె.

"ఇదేమిటి సుమతీ? కథవిని ఏడుస్తారా ఎవరైనా! సరే పోనీలే- ఇప్పుడు నువ్వేంచెయ్యా తల్చుకున్నావు?" అన్నది అన్నపూర్ణ కొంగుతో ఆమె కళ్లు తుడుస్తూ.

"చెప్పక్కా, ఏం చెయ్యమంటావో కూడా నువ్వే చెప్పూ?"

"ఆ తరువాత కోప్పడవు గదా?"

"లేదు" అని నవ్వింది సుమతి.

"నీ సర్వస్వాన్నీ మరొకరికి ధారపోసి కేవలం భిక్షుకివై బయలుదేరిపో. వెనక్కి తిరిగి చూడకు."

"అక్కా!"

"అవును చెల్లీ! కఠినమైన తీర్పు. అయితేనేం? ఆడవాళ్ళు అవలీలగా అమల్లో పెట్టగలరు. ఇప్పుడు కష్టంగా ఉన్నా చివరికి శాంతి లభిస్తుంది." అన్నది అన్నపూర్ణ. దుఃఖంచేత ఆమె కంఠం పెగిలటంలేదు.

"అశక్తురాల్ని. రోగిష్టిదాన్ని. రెండడుగులువేసే ఓపిక లేదు. బండీ ఎక్కడానికికూడా డబ్బులులేవు. ఎలా వెళ్ళను?" అన్నది సుమతి. ఆమె కంఠంలో దుఃఖంలేదు, బాధలేదు. ఉన్నది ఒకేఒక నిరామయ శ్మశాన నిర్లి[illegible]

"ఒంటరిగా నిన్ను ఎవరూ వదలి[illegible] ఎవరో ఒకరు తోడువస్తారు. మరినేను వెళ్ళిరానా! [illegible]పు ఒకమాటు వచ్చి చూస్తాను" అని లేచి నిలబడింది అన్న[illegible]ర్ణ.

"నీ ఆజ్ఞని నెరవేర్చే ఓపికకూడా[illegible]నాకులేదు. ఆ భారం కూడా నీదే అక్కా" అంది సుమతి.

నాలుగు అడుగులు నడిచింది అన్నపూర్ణ. గిరినందినీ సాంబశివరావు ఎదురుగ్గా వచ్చారు.

బుగ్గనచుక్క, నొసట కళ్యాణ తిలకం— జరీ అంచు కంచి పట్టుచీర—మెరిసిపోతున్నది గిరినందిని. సాంబశివరావు అన్నపూర్ణకి నమస్కరించి—

"రిజిస్ట్రారాఫీసుకి వెళుతూ మీకు నమస్కరించి పోదాం అని వచ్చాం. ఆశీర్వదించండి" అన్నాడు.

"నా ఆశీర్వచనంలో అంతనమ్మకం ఉన్నదా మీకు" నవ్వుతూ అంది అన్నపూర్ణ.

సాంబులు కొంచెం మాట్లాడలేదు, తరువాత-

"నేను ధర్మాన్నీ సాంప్రదాయాన్నీ ద్వేషించాను. ఆచారాన్ని అధిగమించాను. జూదం, త్రాగుడు, మోసం అన్నీ నాకు చేతనవును. కాని అన్నపూర్ణగారూ, స్త్రీ పవిత్రతతో నే నేనాడూ చెలగాటం ఆడలేదు. నేను స్త్రీత్వాన్ని ఆరాధిస్తాను, కళంకం చెయ్యను. నారీ పవిత్రత తాలూకు నైర్మల్యంముందు అవనతవదనుడనై నమస్కరిస్తాను. ఆడ వాళ్ళకి ఉద్యోగాలిచ్చి వాళ్ళ ఆకర్షణని పణంగాపెట్టి లాభాలు తీస్తాననే అపవాదు ఉన్నది నాకు. కాని వాళ్ళ శక్తినీ పవిత్రతనీ పణంగా పెట్టాను నేను. అందుకనే త్యాగరాజులుతో విడిపోయిన లీలలో నాకు సంపూర్ణత కనిపించ లేదు. నాఅంత నీచుడూ, దుర్మార్గుడూ, ఇంకొకడు లేడు. కాని నాఅంత తెలివిగలవాడూ లేడు. మానవత్వం తాలూకు ఉన్నతికి వేళ్ళు నారీ ఆంతర్యంలోనుంచే మొలుస్తాయి. ఆ విషయంలో నాకేవిధమైన అనుమానమూ లేదు. అందుకే మీ ఆశీర్వచనంలో నాకు అంతనమ్మకం" అన్నాడు సాంబులు.

అన్నపూర్ణ ఆశీర్వదించింది, సర్వదేవతాశీర్వాదంగా తీసుకున్నారు ఆదంపతులు.

# 19

"హక్కులేని దానికోసం పోట్లాడుతున్నావు నువ్వు, ఉన్న హక్కుని వదలుకుంటున్నది ఆమె. ఎంత భేదం మీా ఇద్దరికీ! ఆమె ఎంత త్యాగమూర్తో అంత స్వార్థపరురాలివి నువ్వు" స్వామి విసుక్కున్నాడు లలితమీాద.

"నీకు ఒకసారి పెళ్ళి అయిందని ఎందుకు చెప్ప లేదు?" నిగ్గదీసి అడిగింది లలిత.

"ఇటుచూడు లలితా! మనం ధర్మప్రకారం భార్యా భర్తలం కాదు; ప్రేయసీ ప్రియులం. ఆ సంగతి లోకానికి తెలియకుండా జాగ్రతపడ్డాం; కనుక భార్యా భర్తలుగానే చూడబడుతున్నాం. అలాంటప్పుడు నాకు ఇదివరకే పెళ్ళి అయిందన్న సంగతి నీకు తెలియ చెప్పాల్సిన అవుసరంలేదు. అతి తెలివిగా మాట్లాడి నన్ను విసిగించకు" చిరాగ్గా సిగరెట్ ముట్టించాడు స్వామి.

"మరిప్పుడు నాగతి ఏమిటి?"

"ఆ సంగతే అన్నపూర్ణ ఆలోచిస్తున్నది. అందు కోసమే తన సర్వసుఖాలు త్యాగం చేస్తున్నది."

"ఇంకోళ్ళ దయాధర్మ భిక్షతో సుఖించాల్సిన గతికి నే నెన్నడూ దిగజారను. నాకేదో తింటానికిస్తే నాదారిన నేను పోతాను"

"నీ దారిన నువ్వు పోయినా, ఉన్నా ఆమె నాతో కాపురం చెయ్యదు"

"ఎందుకు చేస్తుంది. ఉన్నాడుగా బావగారు!"

లలితమాట పూర్తి కాకముందే ఊహాతీతమైన విష యం జరిగింది. స్వామి వెర్రికోపంతో ఆమెను ఎడాపెడా కొట్టటం ఆరంభించాడు. అలా ఎంతసేపు జరిగేదో కాని అన్నపూర్ణే వచ్చి అడ్డుపడింది.

"ఏమిటిది" స్వామికి అడ్డుపోయి గద్దించింది ఆమె.

"ఈ నీచురాలు ..." కోపంతో సమాధానం చెప్ప లేక పోయినాడు అతను.

"అంతా విన్నాను. ఆమె అన్నదాంట్లో ఏమీ అబద్ధం లేదు."

"అన్నపూర్ణా!"

"అవును. ఆమె అన్యాయంగా అనలేదు. అదినిజమే! అందరికీ తెలిసిన విషయమే ఇది"

చివరికి ఈ కళంకం నెత్తిన వేసుకుని నన్ను మభ్య పెట్ట దల్చుకొన్నావా? నువ్వెలాంటి దానివయినా సరే నా భార్యవు"

"వ్యభిచారిణిని మీ భార్య అని అనటానికి మీకు నోరెలా వచ్చింది?"

"అన్నపూర్ణా... అన్నపూర్ణా ! ఎందుకిలా మిథ్యాప వాదాన్ని వేసుకుంటావు? దీనివల్ల నీకు కలిగిన లాభమూ లేదు. ప్రపంచానికి కలిగిన ఫలితమూ లేదు... నన్ను అన్యాయం చెయ్యకు అన్నపూర్ణా" అని రెండుచేతులతో ముగం కప్పు కున్నాడు స్వామి.

ప్రభూ, నాకు మనోబలాన్ని ప్రసాదించు. కళ్ళు మూసుకుని భగవంతుడిని ప్రార్థించింది అన్నపూర్ణ. లలిత దగ్గరకు వెళ్ళి ఆమె భుజంమీద చెయ్యివేసి "నువ్వు అదృష్టవంతురాలవు చెల్లీ! నామీదకోపగించుకోకు. నామూలంగా నీ ప్రేమకీ అనుభవానికీ వ్యాఘాతం కలగదని నమ్ము" అన్నది.

"అవసరం లేదు. మీ భిక్షని యాచించి బ్రతికేందుకు నేను భిక్షుకిని గాను, నా దారి నాకు ఉంది" అని కఠినంగా జవాబిచ్చింది లలిత.

"కాని, నీవూ లేక నేనూ లేకపోతే వారు ఏమయిపోతారు?"

"మొదటినుంచీ నువ్వు లేవు, సగం కాలందాకా నేను లేను. అప్పుడు ఎలా జరిగిందో ఇప్పుడూ అలాగే జరుగుతుంది. అయినా నీవు కావాలనే ఆయన తాపత్రయం."

"అలా అనకోకు"

"ఎందుకని? ఇందాకనే చెప్పారు ఆయన, నీవు భార్యవు నేను ప్రియురాల్ని, లా ప్రకారం హక్కు నీది. నాకేముంది ఇక్కడ?"

"నేనున్నాను చెల్లీ... నేను నీ దాన్ని"

"ఈ బులి బుచ్చకపు కబుర్లకి మురిసి ముప్పందుం అయేందుకు నేను ప్రపంచజ్ఞానం లేనిదాన్ని కాదు." అని విసుక్కుంది లలిత. అన్నపూర్ణ నవ్వి "ఇటుచూడు చెల్లీ, స్త్రీ పురుషుల ప్రేమగాథ మానవ సంస్కృతికి పునాది. అన్నిటి

కన్నా అద్భుతమైన సత్యంఅదే. మానవుడి ప్రతికదలికలోనూ కనిపించేదే అది వివాహం, ప్రేమా వేరువేరు అయిపోయి నయి ఇప్పుడు. నీవు వారిని ప్రేమించావు. ఎంతగా ప్రేమించా వంటే సంఘంలో నీ స్థానాన్ని దృఢతరం చేసుకోవాలని కూడా నీవు అనుకోలేదు. ఇప్పుడు వారిని వదిలివేయగలవు! ఏదో ఒక తెల్లవారుజామున బంధువుల తెలివితక్కువ వలన పుస్తె ముడేయించుకున్న వాక్కుని పురస్కరించుకొని నీ ప్రేమనీ త్యాగాన్నీ భగ్నంచేస్తే భగవంతుడుకూడా క్షమించడు నన్ను" కళ్ళు తుడుచుకొని తిరిగీ చెప్పటం ప్రారంభించింది ఆమె.

"గోపాలరావుగారు వృద్ధుడు-వాతరోగి. నేను లేకపోతే ఆయనకి క్షణంకూడా జరగదు. మహా బ్రతికితే ఏడాదో, రెండేళ్ళో! అందాకా నేను ఎక్కడికీ రాలేను. నీకు నామీద ఎంత కోపం అయినా అందాకా వారిని విడిచి వెళ్ళకు. అలా అని ఒట్టువెయ్యి" చెయ్యిచాచింది అన్నపూర్ణ.

అనాలోచితంగా మంత్రబద్ధంగా ఆ చేతిలో చెయ్యి వేసింది లలిత. ఆ చేతిని తనగుండెల కదుముకుని "చాలు. బావగారి మరణానంతరం నేను వస్తే నాకు గుప్పెడన్నం చాలు. అంతకన్న ఏమీ అక్కరలేదు. ఆ ఆశ్రయం ఇస్తానని కూడా ఒట్టువెయ్యి" అంది అన్నపూర్ణ.

స్వామి తల తిరిగి పోతున్నది.

"అన్నపూర్ణా. ఈ ఆస్తి, ఈ ఇల్లు ఈవాకిలి అన్నీ నీవి. నీకు ఆశ్రయం ఎవరివ్వాలి. సరేపోసి నీపేర బాంకిలో ఒక పదిఘువేలు వేస్తాను".

"ఏభయివేలా! దేనికి! నాది ఒక్క పొట్ట. ఏమీ అక్కర్లేదు, బావగారు ఉన్నంతకాలమూ ఆయన పెడతారు. తరువాత మీరున్నారు. ఇంకా డబ్బు దేనికి!" అన్నది ఆమె.

ఈమె త్యాగంవల్ల వచ్చే కీర్తికోసం శక్తికి మించిన త్యాగాలు చేయటంలేదు గద! అనుకున్నాడు స్వామి. మరు క్షణంలో ఆ ఊహ మాసిపోయి దుఃఖమే మిగిలింది అతనికి.

అన్నపూర్ణ ఇక తర్కించ లేదు. స్వామికి దగ్గరగావచ్చి నమస్కరించబోయింది. అతను ఆమెను నమస్కరించనీయ లేదు. రెండు చేతులా లేవనెత్తి గుండెలకదుముకున్నాడు. ఈ త్యాగమయి తనని విడిచివెళ్ళి పోతున్నది. ఈ ప్రియబాంధవికి తన అవసరం లేనేలేదు. సముద్రంలో మునిగిపోతున్న వ్యక్తికి ఒక తెప్పకొయ్యదొరికీ విరిగిపోయిన చందంగా ఉంది తన బ్రతుకు.

"అన్నపూర్ణా, ఎందుకింత అన్యాయంచేస్తున్నావు?" గద్గద స్వరంతో ప్రశ్నించాడు స్వామి.

"కర్తవ్యం అన్నిటికన్నా గొప్పది. చూడండి, ఇన్నాళ్ళనుంచీ నాకు ఆశ్రయం ఇచ్చిన బావగారు జబ్బు స్థితిలో ఉండగా వారిని వదలిపెట్టి నాసుఖం నేను చూసుకోటం మంచిదా, చెప్పండి! అదీగాక వారిని వెళ్ళమార్చే కర్తవ్యం నామీద ఉన్నది." అని శాంతంగా సమాధానం ఇచ్చింది అన్నపూర్ణ.

"అయితే నాకొక వాగ్దానం ఇయ్యి. తరువాత నయినా వచ్చి నీ ఇంట్లో నువ్వు ఉంటానని"

"తప్పకుండా. నేను మీదాన్ని. ఈ ప్రపంచంలో ఏయే మూలల్లో ఎవరెవరున్నా మనిద్దరం ఒకటే. నేను దిక్కు లేనిదాన్ని కాదు. బలమైన ఈచెయ్యి నీకుఆధారం అనే ఊహ ఇచ్చే బలంతో వెయ్యేళ్ళు బ్రతుకుతాను నేను" స్వామి చేతిని కళ్ళకద్దుకుంది అన్నపూర్ణ.

లలిత తెల్లబోయిచూస్తూ నిలబడింది. ఆమె మన సులో ప్రచండమైన తుపాను సాగుతున్నది. ఒక్క క్షణంలో తన సర్వస్వం ఇతర్ల దయమీద ఆధారపడటమే కాకుండా వాళ్ళదానాన్ని కూడా తను స్వీకరించింది. అన్నని ఎదిరించి స్వామి చెయ్యి పుచ్చుకుని ఇల్లు వదిలేసివచ్చిన రోజున ఇదంతా తనదే అనుకుంది. ఈరోజున ఆ చేసిన పనికి తను గర్వించలేదు.

తన వానిటీ, తనసాహసం, తన తెలివితేటలు ఒక వ్యక్తి ముందు తుక్కు దూగరాగా ఎగిరిపోయినయ్, అయినా ఆమె చేతిలోనే తను చెయ్యి వేసింది. ఏ అజ్ఞా బలం చేత తను అలా చేసిందో ఆమెకే అర్థం కావటంలేదు.

"బావగార్ని గాలిమార్పుకోసం పల్లెటూరు తీసుకు వెళ్ళమన్నాడు డాక్టరు. నాలుగురోజుల్లో బహుశా దేవు దామను కుంటున్నాం" అన్నది అన్నపూర్ణ. ఇప్పుడామె కంఠంలో ఉద్వేగం లేదు, పరమ శాంతంగా ఉంది ఆ స్వరం.

"పిల్లల సంగతి?" ప్రశ్నించాడు స్వామి.

వాళ్ళతల్లిదండ్రులున్నారు" ఆ జవాబుకి ఆశ్చర్య పోయాడు స్వామి. త్యాగరాజులూ లీలా కలిశారా? అన్న

పూర్ణ చేతిలో ఇంద్రజాలం లేదుగద అనిపించిందతనికి ఆ ప్రశ్న పైన అడిగాడు, అన్నపూర్ణ నవ్వి—,

"ఈ దేశంలో భార్యా భర్తలు విడిపోవడానికంటే విడిపోకుండా ఉండటానికి ఎక్కువ కారణాలున్నాయ్. కొట్టుకుంటూ తిట్టుకుంటూ కూడా కలిసి జీవించడంలోనే పరమార్థం ఉందని భావిస్తారు, అది ఈ మట్టి మహిమ, లీలా-త్యాగరాజులూ విడిపోవటం ఎన్నడూ జరుగదు" అన్నది.

"ఆశ్చర్యం ఏమీ లేదు, మనిద్దరం కలుసుకుంటామనే ఆశ పూర్తిగా వదిలిపోయిన తరువాత మనం కలుసుకున్నాం. అదేదో యుగయుగాలనుంచీ ఉన్న వరప్రభావం అల్పసంస్కారంతో అపరిమిత జ్ఞానంలోనూ దాన్ని అర్థం చేసుకోలేం మనం. సరే పోనీయండి... మరి నేను వెళ్ళనా!" అన్నది అన్నపూర్ణ.

స్వామి తలఎత్తి చూశాడు. అతని కన్నులనించి జలజలా స్రవించింది కన్నీరు. అన్నపూర్ణ తనకొంగుతో వాటిని తుడిచి మెల్లిగా బయటికి వెళ్ళిపోయింది. ఎంతసేపు అలా నిలబడ్డాడో అతనికే తెలియలేదు, ఎవరో తనదగ్గరగా వచ్చి నిలబడ్డారు. ఆస్పర్శ తనకి పరిచితమైనదే.

"లలితా"

ఆభార్యా భర్తలు కానీ స్త్రీ పురుషులు ప్రేమ అనే దీపకళిక కాంతిలో అంధకారంలో మార్గం వెతుక్కుంటూ చాలాసేపు అలాగే ఉండిపోయినారు.

# 20

"లోకం విచిత్రమైంది, అది ఎవ్వరిని పతితులంటుందో ఆ పతితత్వానికి అర్థమూ ఆధారమూకూడా ఉండదు. పతనం అనేది మానవుడిలో ఉండే అన్ని గుణాలలోనూ ఒకటిగా అనుకోదు లోకం. పవిత్రత మినహా మరోటి తనలోఉండ కూడదని దాని ఉద్దేశ్యం. దయ - త్యాగం - ఓర్పు మొద లైన గుణాలే దానికి కావాలి. కోపం - స్వార్థం - పొర పాటు ఉండకూడ దంటుంది. కాని అన్నివర్ణాల కలయిక వలనే శ్వేతవర్ణం ఏర్పడినట్లు, అన్నిగుణాల కలయికే మానవుడి మనస్సు అనే సంగతి అదిగ్రహించదు. అక్కడే పొరపాటు చేస్తున్నది. ఏ నాడైతే పతితులకి సానుభూతి తెలివి తక్కువ వాళ్ళకు చేయూతా, చపలచిత్తులకు జాలీ లోకంనించి లభిస్తాయో ఆనాడు ఈభూమి స్వర్గంకింద మారు తుంది. ఈ నరకం నాకం అవుతుంది, నీవు మగవాడివి నీ చాపల్యం సంగతి లోకానికి అవసరం లేదు, కాని లీలని క్షమించదు, అలా లోకంనుంచి క్షమని పొందాలని దానికి ఉంటే ముందు నీ దగ్గర క్షమాపణ తీసుకుంటుంది" అన్నది అన్నపూర్ణ.

త్యాగరాజులు కళ్ళల్లో నీరు తిరిగింది, రాత్రినించీ గోపాలరావుగారికీ సుమతికీకూడా ఆయాసం జాస్తిగా ఉంది పిల్లిద్దరినీ తీసుకుని పల్లెటూరు వెడుతుంది అన్నపూర్ణ ప్రయాణానికి అన్నీ సిద్ధంగా ఉన్నాయ్. ఆనాడు పడిపోయి

దగ్గరనుంచీ గది విడిచి బయటకు రావటం లేదు లీల. త్యాగరాజులూ లీలా తిరిగి కలుసుకోవాలని అన్నపూర్ణ సంకల్పం.

త్యాగరాజులు అన్నపూర్ణ ఆజ్ఞ శిరసావహించి ఇంటికి వచ్చాడు. కాని లీల పొద్దుటినుంచీ గది తలుపులు తీయలేదు. పిల్ల ఏడుస్తున్నా వినిపించుకో లేదు. పిల్లని తీసు కొచ్చి త్యాగరాజులు చేతి కిచ్చింది అన్నపూర్ణ. త్యాగరా జులు బిడ్డని గుండెకు అదుముకున్నాడు.

"దుఃఖం మానవజీవితంలో ఆత్మవికాసానికి దోహదం చేస్తుంది త్యాగరాజులుగారూ. దుఃఖానంతరం హృదయం వర్షానంతరం కొండచరియలా స్వచ్ఛంగా ఉంటాయి. అప్పుడు దానిమీర ఏ అపూర్వ చిత్రాన్నయినా చిత్రించ వచ్చును" అన్నది అన్నపూర్ణ.

త్యాగరాజులికి మాట రావటం లేదు, ఈమె దేవతా మూర్తి కాదుగద, కాకపోతే ఇంతటి ఆత్మశోధన - మాన వుని దుఃఖం అన్నా దుర్దశ అన్నా ఇంతటి సానుభూతి మామూలు స్త్రీకి ఎలా లభిస్తాయి.

"నన్ను గురించి మీరేమీ ఘనంగా అనుకోనవసరం లేదు. నేనూ అందరిలాటి స్త్రీనే, కాకపోతే కన్నీళ్ళూ ష్టాలూ నన్ను కొంచెం సానబట్టినయ్. నాలో ఉన్న ఈ దయ, నాకు లభించటానికి కారణం నాదుఃఖం. అందుకే దుఃఖాన్ని ప్రేమిస్తాను నేను. అలాగే క్షమకూడా. క్షమిం చటంలో చాలా ఆనందం ఉంది, త్యాగరాజులుగారూ

లీలని మీరు క్షమించి చూడండి. ఎంత ఎత్తుకు పెరిగిపో తారో!" అని నవ్వింది అన్నపూర్ణ.

తనలో తను అనుకుంటున్న ఊహాలు ఆమె ఎలా గ్రహించిందో అతనికి అంతుబట్టలేదు.

ఆమె తీవ్రమైన నియమాలు గలిగిన ఒక యోగిని. రక రకాల కల్మషాల మధ్య బ్రతుకుతూ కూడా తాను తపస్విని అయింది. అది కఠోర నియమం కావచ్చును. అయినాసరే అదీ సహజంగానేఉంది ఆమెకు. అందుకే లోకదృష్టికి బావగారితో అక్రమ సంబంధం పెట్టుకున్న వెధవ ముండలాగా కనిపించేది. అందరికీ అర్థము అయ్యేది కాదు. ఆమె తనకు తానే విధిం చుకున్న ఈ నియమాలన్నీ నిప్పులాలే అవుతూ వస్తున్నాయ్. అయినా ఎంత మనోనిగ్రహమూ, మరెంత ఆత్మత్యాగమూ లేకపోతే సర్వసంపదల్నీ తృణప్రాయంగా వదిలేసుకుని, ఇద్దరు రోగిష్టివాళ్ళతో వెళ్ళటానికి సాహసించ గలదు! ఎవరిమీద మమతా ఆమెను కర్తవ్యచ్యుతురాల్ని చేయ లేదు. ఈమెలాగా నిరీక్షించగల్గిన వారూ, ఈమెలాగా సర్వ స్వమూ వదిలేసుకుని తనప్రేమని పూజా పీఠంమీద కూర్చో పెట్టగలిగిన వారూ ఈ లోకంలో ఎంత మందున్నారు?

సంగీతంలో అంతర్గతమైన స్వరంలాగా ఈమె వేదన లోనుంచే ఈమె ఆత్మకాంతిని విరజిమ్ముతున్నది, ఆమెలో ఉత్కృష్టమై ఉండే కరుణ–వేయి దీపకళికలై వెలుగు చిమ్ము తున్నది.

త్యాగరాజులు ఆమెకు నమస్కరించాడు. ఆమె ఏమని ఆశీర్వదించిందో ఆ భగవంతుడికే తెలియాలి.

గబ గబా అడుగులు వేసుకుంటూ స్వామి ఆ గదిలో ప్రవేశించాడు.

"మళ్ళీ దేనికి వచ్చారు మీరు ?"

"ఒక్క సంగతి చెప్పి వెళ్ళు. విరుద్ధ ప్రకృతులు కలసి కాపురం చెయ్యటం ఎలా ?"

"దేవతలూ రాక్షసులూ కలసి మథించిన పాల సముద్రంలోంచి అమృతమే పుట్టింది. విరుద్ధ ప్రకృతుల దాంపత్య జీవితంలోనుంచి అమృతమే పుడుతుందో విషమే పుడుతుందో కాలమే నిర్ణయిస్తుంది, అలా నిర్ణయించేదాకా అమృతం పుడుతుందనే ఆశతో ఉండటం తప్ప చేసేది ఏమీ లేదు. భోగి యోగిగా మారవచ్చును, రాక్షసి దేవత అవనూ వచ్చును, నిరీక్షించటం తప్ప గత్యంతరం లేదు."

స్వామి మాట్లాడలేదు.

"ఏం మాట్లాడవు ?"

"నేను రాక్షసుడిని అని తెలిసికూడా నాకోసం నువ్వు త్యాగం చేస్తున్నావు."

"ఏ త్యాగమూ చెయ్యలేదు, రోగిష్టి మనిషి అయిన బావగారు తన బాధ్యతని నామీద వేశారు, కాదనలేక పోయాను. అంతే - అంతకన్నా మరేం లేదు."

"నిన్నటినుంచీ నీతో ఉన్న బంధాలు త్రెంచి వేసుకో వాలని విశ్వప్రయత్నం చేసి ఓడిపోయాను" అని నిట్టూ ర్చాడు స్వామి.

అన్నపూర్ణ అతని దగ్గరగా వెళ్ళి "జీవన రహస్యం అదే. ఒక మనిషిలో మరో మనిషి ప్రవేశించి అతని అస్తి త్వాన్నే ఆక్రమించుకోవడం, ద్వివిధాలైన జీవన స్రోత స్సులు ఏకముఖంగా ప్రవహించి పోవడం నాకెప్పుడూ ఆశ్చ ర్యాన్నే కలిగిస్తుంది. ఇప్పుడు మరీ ఆశ్చర్యంగా ఉంది" అన్నది.

"నాకిది అగ్ని పరీక్ష అన్నపూర్ణా!"

"తెలివి తక్కువగా మాట్లాడకండి. మనిషి అంటే దేహం మాత్రమే కాదు ఆత్మకూడా, ఆత్మైక్యత అందిన నాడు ఈ వియోగం వియోగమే కాదు.

"ఈ స్వామి అన్నపూర్ణ కాదు."

"ఈ స్వామి అన్నపూర్ణ కాదు... అందుకే ఉన్నతు డవాలి ... కష్టాల కెరటాల తాకిడికి నునుపు తేలిన శిలా మూర్తి కావాలి" అన్నది అన్నపూర్ణ.

స్వామి తెల్లబోయి ఆమె కన్నుల్లోకి చూస్తూ నిల బడ్డాడు.

కొన్ని శతాబ్దాల నుంచీ సంకెళ్ళు వేసుకున్న మేధస్సు ఈ రోజు సకల బంధనాన్ని తెగగొట్టుకుని కాళ్ళూ చేతులూ విదిలించుకుంటున్నది, దాని అపూర్వ నాట్యభం

గిమల వరద ఇక ఆగదు, దాని అంతర్యం యవ్వన వేగంతో తనని తాను సుసజ్జితం చేసుకుంటున్నది.

అది విశ్వ జీవనాన్ని విశ్వజనీనమూ సార్వ జనీనమూ అయిన ఒక మహా వేగంతో నడుపుకు పోతున్నది. ఆంధ్ర దేశంలో ఇదివరకు లేని ఒకమహా చైతన్యం దీపకళికలా వెలిగింపబడ్డది. అది అన్నపూర్ణ ద్వారా, ఆమె వ్యక్తిత్వం ద్వారా.

యుగయుగాల తపస్సునించి మేల్కొన్న మహా యోగినిలా ఆమె తలఎత్తి స్వామివంక చూచి,

"వాన వచ్చేట్లుంది ఇక బయలుదేరతాం" అని డ్రైవరుని కేక వేసింది. మెల్లిగా ఒక్కొక్క సామానే బైటకి చేరవేస్తున్నాడు డ్రైవరు. "త్యాగరాజులుగారూ మీరు కారు తీసుకువెళ్ళి సుమతిని తీసుకురండి" అన్నది ఆమె... త్యాగరాజులు బిడ్డని ఎత్తుకునే వెళ్ళాడు.

అతను మెట్లుదిగేవరకు ఆగి స్వామి గుండెలమీద వాలిపోయి అపూర్వమైన ఏదో అనుభూతికోసం వెతుక్కుంటున్నదానిలా కళ్ళుమూసుకుంది అన్నపూర్ణ.

ఈ ఆఖరి ఘడియల్లో తనభర్తని పొందాలనే గాఢమైన కోరిక కలిగింది. ఒక విధమైన అనుతాపము ఆమెను దహించి వివశురాల్ని చేస్తున్నది. తన భర్తని ఎవరికీ కష్టం కలుగకుండా ఎలాపొందాలో ఆమెకు తెలియటం లేదు. వశంకాని అంతర్యం, బాధ్యత ఈ రెండు ప్రతికూల ప్రవాహాలూ ఎలా సంగమం కాగలవో ఆమెకి సమస్యగా ఉంది.

ఆమె శరీరంలోనూ అంతర్యంలోనూకూడా అవ్యక్త వేదనాజనితమైన ఆర్తనాదమేదో హాహాకారాలు చేస్తున్నది, దానిని నిగ్రహించుకోవటం కష్టంగా ఉంది. ఈ ఆర్తిలో బ్రతుకే విడిచిపెట్టాలనిపిస్తుంది. ఈ వేదనకి అంతూ దరీ కనిపించటం లేదు. ఆమె బిగ్గరగా వస్తున్న దుఃఖాన్ని అణచుకోటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తున్నది.

"ప్రభూ ఈ వ్యామోహంనించీ, లాలసనించీ నన్ను విముక్తురాల్ని చెయ్యి" అని కనిపించని భగవంతుడిని ఉద్దేశించి ప్రార్థించింది అన్నపూర్ణ.

ఈ అద్భుత సంఘర్షణే మానవుడి ప్రగతి. దానిని ఉద్దేశిస్తూనే యుగయుగాలలో వేదనాపూర్ణమైనఇతిహాసాలూ నవలలూ కావ్యాలూ ఉద్భవించినయ్. ఈ సంఘర్షణే మానవుడి కథ.

ఆమె మొర చివరకు భగవంతుడు విననే విన్నాడు. సుమతిని ఎక్కించుకొని కారు తిరిగి వచ్చింది.

కళ్ళుతుడుచుకొని లోపలికి వెళ్ళింది ఆమె...

కొంచెం సేపట్లోనే డ్రైవరు సహాయంతో గోపాల రావుగారి రోగిష్టి శరీరాన్ని జాగ్రత్తగా తీసుకొచ్చి కారులో కూర్చోబెట్టింది. ఆ క్షణంలో ఆమెలో ప్రకాశిస్తున్న తేజస్సు దీపకళికలాగా మారి అక్కడున్న అందరి అంతర్యాలలోనూ కొడిగట్టిన దీపాన్ని వెలిగించివి. ఆ కాంతిలో సర్వప్రపంచమూ జ్యోతిర్మయమై ప్రకాశించిందా అనిపించింది. చివరకు ఆమె జయించింది.

కన్నీళ్ళమీదుగా కరుణాపథంలో కదిలింది అన్నారు. అప్రయత్నంగా చేతులు రెండూ జోడించాడు త్యాగరాజులు.

స్వామి మనస్సులో ఒక ఊహ మెదిలింది.

ఓ స్త్రీ నీవొక ఉజ్వల దీపకళికవు, ఆ కాంతిలో తన జీవితకథను చదువుకుంటూ వస్తున్నాడు మనిషి. కాని ఆ దీపకళిక కాంతీ ప్రాణమూకూడా తనని వెలిగించిన జ్యోతి మీదనే ఆధారపడి ఉంటున్నది. అదే చిత్రం జీవితంలో...





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B113 |
| పుస్తకం పేరు | దీపకళిక |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 219 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | |
| లేని పేజీలు | 1 to 4 |
| తయారు చేసినది | sandhya |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |